చతుర

సంపుటి : 8 జూలై 1985 సంచిక : 6

## ఈ నెల సమగ్ర నవల

"నా తల్లిదండ్రులు అసమర్థులు; అప్రయోజకులు. కన్నబిడ్డలకు తిండీ, బట్టా అయినా ఇవ్వలేని నిత్యదరిద్రులు. అందుకని నా పెళ్ళి నేనే చేసుకోవాలనే తాపత్రయంలో పడ్డాను. వేలూ, లక్షలూ తెచ్చి, పెళ్ళిళ్ల మార్కెట్టులో పెళ్లికొడుకుల్ని కొనగల స్థోమతు లేదు. నాకున్న ఆస్థి అల్లా దేవుడిచ్చిన అందం. దాన్ని పణంగా పెట్టి మొగుణ్ని కొనుక్కోవాలని ఆశపడ్డాను. ఈ వ్యాపారంలో దారుణంగా మోసపోయాను. దగా పడ్డాను. ఆ పర్యవసానాన్నే అనుభవిస్తున్నానిప్పుడు" అంటూ బావురుమందామె. అన్నింటికీ సిద్ధపడి తెగించిన ఆమెను అంతగా విలపింపజేస్తున్న ఆ...




అంత క్రూరమైనదా? తత్ఫలితమైన విషాదానికి పరిష్కారం లేదా? ఆ యువతి జీవితం ఏయే మలుపులు తిరిగి చివరికి ఏ గమ్యాన్ని చేరుకుంటుంది?

## శ్రీధర

కలం నుండి జాలువారిన నేటి పురుషాధిక్య సమాజంలోని ఓ సగటు యువతి జీవన పోరాటాన్ని కరుణామయంగా చిత్రించే 'అనుభవం' ఈ నెల సమగ్ర నవల.

ముఖచిత్రం: రమేష్




# ప్రపంచం

## చూపుడువేలి ఆట

ప్రస్తుతం చూపుడువేలుబలాన్ని పరీక్షించే ఓ రకమైన ఆటకు జర్మనీలో విపరీతమైన జనాకర్షణ లభిస్తోంది.

ఈ ఆటను ఇద్దరు ఆటగాళ్లు మేజా బల్లకు అటూ ఇటూ కూర్చుని ఆడతారు. కబాడీ ఆటలోలా బల్లకు మధ్యలో అడ్డంగా ఓ గీత గీస్తారు. ఆటలో పాల్గొంటున్న వారి కుడిచేతి చూపుడు వేలికి బిగుతైన తోలు వుంగరాలను తొడుగుతారు.

ఎదురెదురుగా బల్లపై చేతులు పెట్టి కూర్చునివున్న ఆటగాళ్లు "స్టార్ట్" అనగానే చేతులు కలుపుకుని ఒకరి ఉంగరాన్ని ఒకరు లాక్కునేందుకు ప్రయత్నిస్తారు. ఎవరో ఒకరు లొంగిపోయే వరకూ ఆ ప్రయత్నం పోరాటంలా సాగుతూనే వుంటుంది.

వినడానికి సులువన్పించినా ఈ ఆటలోని కష్టం ఆడేటప్పుడే తెలుస్తుంది. ఆటలో ఓడిపోగూడదంటే చూపుడు వేలి ఎముక గట్టిగా, వంగకుండా వుండాలి. చూపుడువేలు దృఢంగా వుండేందుకు ఆటగాళ్లు కొన్నిరకాల ఎక్సర్‌సైజులు చేస్తారు. వాటిలో నిండా నీళ్లున్న బకెట్‌ని ఒక చూపుడు వేలుతోనే పట్టుకుని పైకెత్తడం ఒకటి! చూపుడువేలి ఆటలో ఒక్కొక్కసారి వేలి ఎముకలు చిట్లడం కూడా సంభవిస్తుంది.

శివాజి

గత కొన్నియేళ్లుగా జర్మనీలోని ఫ్రాంక్ ఫర్ట్‌కు చెందిన విల్లీ కెన్నర్ ఈ ఆటలో అనేకసార్లు ప్రథమ బహుమతి సంపాదిస్తున్నాడు. అతను పైకప్పుకి చిన్న ఉంగరాన్ని అమర్చి, దాన్ని చూపుడు వేలితో పట్టుకుని వేలాడుతూ ఎక్సర్‌సైజు చేస్తాడు. బరువుల్ని కూడా ఒక్క చూపుడువేలి సహాయంతోనే మోస్తుంటాడు.

## కన్యాశుల్కం

**మనదేశంలో** యువతులకు మల్లేనే ఇస్రాయిల్‌లో నివసించే అరబ్బు ముస్లిం యువకులు వరకట్న సమస్య నెదుర్కొంటున్నారు. వాళ్ళు ముస్లిం యువతిని పెళ్ళిచేసుకోదలిస్తే వారికి కొంత కట్నం ఇవ్వడం తప్పనిసరి. వారి ఆచారప్రకారం 1949లో ఆ కట్నం 700 రూపాయలుగా నిర్ణయించారు. ఏళ్లు గడుస్తున్నకొద్దీ ఆ కట్నం కూడా అదే క్రమంలో పెరుగుతోంది. ఇపుడు సగటు మధ్యతరగతి కుటుంబాలలో వరుడు వధువుకిచ్చే కట్నం 50 వేల రూపాయలయింది.

ఆ యువతి అందగత్తె అయి, సంపన్న కుటుంబానికి చెంది, ఫ్రెంచి భాష వచ్చి, పియానో వాయించగలది, మోడరన్ ఆర్టులో ప్రవేశం వున్నదీ అయితే కట్నం రేటు లక్ష రూపాయలకి మించిపోతున్నది.

మనదేశంలో పెళ్ళికొడుకులవల్ల వరకట్న సమస్య పోనట్టే, ఆ దేశంలో పెళ్ళికూతుళ్ళ కారణంగా కన్యాశుల్క ఆచారం నిలిచివుంది. సాధారణంగా అక్కడ భార్య ఎంత గొప్పదైనా భర్త ఆమెపట్ల క్రూరంగా ప్రవర్తిస్తుంటాడు. కట్నం తీసుకోని భార్యపట్ల ఆ భర్త మరింత హీనంగా ప్రవర్తిస్తాడు.

అదే బాగా కట్నమిచ్చి పెళ్ళాడిన భార్య అయితే భర్త సహజంగానే ఆమెపై మక్కువ చూపిస్తాడు. తాను పెద్దమొత్తం చెల్లించి సంపాదించుకున్న విలువైన ఆస్తిగా ఆమెను సంరక్షించుకుంటాడు.

అరబ్బుదేశాలలో ముఖ్యంగా ఇస్రాయిల్‌లోని యువకులు భార్యకివ్వాల్సిన కట్నం కోసం స్మగ్లింగ్, దోపిడీ, జూదం లాంటి సంఘవ్యతిరేక కార్యకలాపాలకు, నేరాలకు పాల్పడి ధనం సంపాదిస్తున్నారు. ఇదంతా చూసి నజరత్‌లోవున్న అరబ్ యూత్ బాంకు డైరెక్టర్ అబ్దుల్ నషీబ్‌కి ఓ ఆలోచన



కలిగింది. ఆ బాంకులోని మిగిలిన డైరక్టర్లుకూడా దాన్ని ప్రోత్సహించడంతో 1962లో ఇజ్రాయిల్‌లో మొదటిసారిగా ఆ బాంకు పెట్టారు. అటుపై ఇజ్రాయిల్ అంతటా పెళ్ళిళ్ళకు అప్పులిచ్చేందుకు ఆ బాంకు శాఖలను తెరిచారు. ప్రత్యేకంగా, పెళ్ళి చేసుకోగోరే అరబ్బు యువకులకి అప్పులిచ్చేందుకే ఆ శాఖలు నెలకొల్పారు.

తక్కువ వడ్డీ రేటుకిచ్చే ఆ లోన్లను 20-30 నెలసరి వాయిదాలలో తీర్చవచ్చు. తక్కువ మొత్తాలు అప్పే కష్టం లేకుండా త్వరగా లభిస్తాయి. అధిక మొత్తంలో కావాలంటే బాంకు మేనేజరు, ఇతర అధికారులు పెళ్ళికూతురి ఇంటికి వెళ్ళి ఆమెను చూసి, ఆమె ఆ మొత్తానికి అర్హురాలని నిర్ధారించుకుంటేగానీ అప్పు మంజూరు చేయరు.

ఇజ్రాయిల్‌లో బాంకులు కట్నానికి అప్పులిచ్చే పద్ధతి అత్యంత విజయవంతమై అనేకమంది యువకుల పెళ్ళిళ్ళకి కారణమైంది. దాని ఫలితంగా అక్కడ నేరాల సంఖ్య తగ్గిపోయిందికూడా!

## వింత ఆశ్రమం

తమిళనాడులో నితిరుచ్చినుంచి మధురైకి పోయే హైవేలోవున్న 'ఎడమలైవట్టి పాడూర్' దగ్గిర బిచ్చగాళ్ళ ఆశ్రమం వుంది. ఏడెకరాల విస్తీర్ణంలోగల ఆ ఆశ్రమంలో మగా, ఆడ భిక్షుకులను విడివిడిగా వుంచుతారు.

తిరుచ్చి పురపాలక సంఘం నిర్వహిస్తున్న ఈ బిచ్చగాళ్ల ఆశ్రమంలో 1977 నుంచి ఒకే ఒక బిచ్చగాడున్నాడు. ఆ ఏకైక బిచ్చగానిపై పురపాలక సంఘం వారు 1982లో 30వేల రూపాయలు ఖర్చుపెట్టినట్టు లెక్కలు చూపారు.

బిచ్చగాళ్ల ఆశ్రమంలో కుటీర పరిశ్రమలకు సంబంధించిన వర్క్‌షాపులు కొన్ని వున్నాయి. ఆశ్రమ నిర్వహణకు ఒక సూపర్‌వైజర్, ఒక చేతి పనుల సూపర్‌వైజర్, ఒక వంటవాడు, ఇద్దరు కాపలాదారుల్ని నియమించారు. అయితే చివరికా ఏకైక బిచ్చగాడు కూడా ఆశ్రమాన్ని వదిలిపోయాడు.




ఓ పత్రికా విలేకరి ఆశ్రమంలో ఒక్క బిచ్చగాడూ లేకుండా 30 వేలు ఖర్చయిన వైనాన్నిదానికి సంబంధించినశాఖా మంత్రిణి గోమతీ శ్రీనివాసన్ దృష్టికితేగా, ఆవిడ "బిచ్చగాళ్లు భిక్షం ద్వారా వచ్చే రకరకాల తిళ్లకు అలవాటుపడివుంటారు. వాళ్లు తాము అడుక్కుని సంపాదించే చిన్న మొత్తాలను పెట్టుబడిగా చేసి రకరకాలుగా డబ్బు గడిస్తారు. అందుకే వాళ్లు ఆశ్రమాల్లో వుండేందుకు ఇష్టపడరు" అని చెప్పింది.

తిరుచ్చి మేయర్, "మొదట్లో పోలీసులు బిచ్చగాళ్లను అరెస్టుచేసి కోర్టులో హాజరు పరిచి శిక్షింపజేసేవారు. ఇప్పుడు అరెస్టులు మానేయడంతో బిచ్చగాళ్లకి స్వేచ్ఛ పెరిగి ఆశ్రమంలో వుండేందుకెవరూ ఒప్పుకోవడం లేదు" అంటున్నాడు.

ఆ విధంగా ఇప్పుడు తిరుచ్చిలో బిచ్చగాళ్లు లేకుండా బిచ్చగాళ్ళ ఆశ్రమం మాత్రం వుంది.

## మృత్యుదినం

ప్రపంచవ్యాప్తంగా తేల్చిన మరణాల లెక్కల ప్రకారం సోమవారంనాడు ఎక్కువమంది మృత్యువాత పడటంతో కొందరు దాన్ని 'మృత్యుదినం'గా భావిస్తున్నారు. అనేక ఆత్మహత్యలు, పాము కాటు మరణాలు, ఉరితీత, మరణశిక్షలు సోమవారంనాడే జరిగాయి.

వాహనాలు నడిపేవారి నిర్లక్ష్యం వల్లనే చాలామంది ప్రమాదాల్లో మరణిస్తున్నారు. ప్రతివారం ప్రపంచవ్యాప్తంగా సుమారు 2 వేల మంది కారు ప్రమాదాల్లో మరణిస్తున్నారు. అందులో 30 శాతం మంది స్కూటర్, మోటార్ సైకిల్ లాంటి రెండు చక్రాల వాహనాల ప్రమాదాల్లో చనిపోతున్నారు.

ప్రపంచం మొత్తంలో సంవత్సరానికి 10 లక్షల మంది విషకీటకాలు కుట్టి మరణం పాలవుతున్నారు. ఒక్క పాము కాటువల్ల సంవత్సరానికి 40 వేల మంది మృత్యువాత పడుతున్నారు. ఇళ్ళలో వుండే మామూలు ఈగ కూడా ప్రమాదకరమైన కీటకమే. అది 25 రకాల వ్యాధులను వ్యాపింపజేయగలదు. ప్రపంచంలోని సాలుసరి మరణాల్లో 10 శాతం వరకూ దోమల వల్ల వ్యాపించే మలేరియాతో సంభవిస్తున్నాయి.

ఆఖరికి పెంపుడు జంతువులు కూడా మనుషుల మరణానికి కారణమవుతున్నాయి. సంవత్సరానికి దాదాపు 800 మంది కుక్కకాటుకి గురైగాని, ఎద్దు పొడవడంవల్లగాని చనిపోతున్నారు.

ప్రపంచ యుద్ధాలు జరిగిన 30 ఏళ్ళలోనూ యుద్ధంవల్ల 70 లక్షల మంది చనిపోయారు. నేడు ప్రపంచయుద్ధమే సంభవిస్తే, ఆ 30 ఏళ్ళలో జరిగిన జననష్టం ఇప్పటి అణ్వాయుధాల వల్ల 30 గంటల్లోనే జరిగిపోతుంది.

రోడ్లమీద జరిగే ప్రమాదాల్లో మరణించేవారి సంఖ్య ఎక్కువనే ఆలోచన పొరపాటు. లెక్కల ప్రకారం ఎక్కువ మరణాలు ఇళ్లలోనే సంభవించినట్టు తేలింది. జాగ్రత్తలు పాటించవలసిన చోట్ల నిర్లక్ష్యంగా వుండటంతో కొన్ని ఫాక్టరీలు, ఆఫీసులు కూడా మృత్యుప్రదేశాలవుతున్నాయి. ఒక్క బ్రిటన్‌లోనే ఫాక్టరీలలో సంవత్సరానికి 230 మంది శ్రామికులు ప్రమాదాలలో మరణిస్తున్నారు. అన్నింటిలోకీ పెట్రోలియం డ్రిల్లింగ్‌లో అధిక సంఖ్యలో మరణాలు సంభవిస్తున్నట్టు లెక్కలు తేలుస్తున్నాయి.

ఆటలలో సైతం కొందరు చనిపోతున్నారు. అయితే మల్లయుద్ధం, బాక్సింగ్‌లో కంటే క్రికెట్టు, గోల్ఫు ఆటలు ఆడుతుండగా చనిపోయిన క్రీడాకారులే ఎక్కువ.

ఆత్మహత్యలు చేసుకునేవారి సంఖ్య కూడా క్రమేణా పెరుగుతోంది. 1982లో ప్రపంచమంతటా 96 వేలమంది ఆవిధంగా మరణించారు. మరో ఆసక్తికరమైన






అంశమేమంటే ఆత్మహత్యకు పాల్పడిన వారిలో విద్యాధికులు, మేధావులే అధికం!

21 నుంచి 40 ఏళ్ళ మధ్యవయసు గలవారే ఎక్కువగా హత్యకు గురయ్యారు. ఆ హత్యలలో మూడు వంతులు గృహకల్లోలాల వల్ల జరిగినవే. ప్రపంచంలో హత్యలు అధికంగా జరిగేది అమెరికాలో! అక్కడ సగటున ప్రతి 28 నిమిషాలకి ఓ హత్య జరుగుతుంది.

## మేకప్ మహిమ

హాలీవుడ్‌కి చెందిన 'సిస్లీ టైసన్' అనే యువ నటి చాలా అందంగా వుంటుంది. కాని, ఆమె ఓ టెలివిజన్ సినిమాలో 110 ఏళ్ళ వృద్ధురాలి పాత్ర ధరించవలసి వచ్చింది.

అంత అందమైన యువతిని మేకప్ ద్వారా ఒళ్ళంతా ముడతలు పడిన, పండిన జుట్టుగల వృద్ధురాలిగా మార్చే పని ప్రపంచ ప్రఖ్యాత మేకప్ ఆర్టిస్టు 'స్టెన్ విన్స్టన్'కి అప్పగించారు. అతనామెను మేకప్‌చేసేందుకు స్టూడియోకితీసుకెళ్లాడు. స్టెన్ చేతివేళ్ళు సిస్లీ ముఖంపై కదలడం మొదలెట్టిన కొద్దిసేపటికే ఆమె ముఖంపై వృద్ధాప్యం తాలూకు ముడతలుఏర్పడ్డాయి. మరికొంతసేపటికి సిస్లీ అచ్చం వృద్ధురాలిలా కనబడసాగింది.

మేకప్‌తో ఆమెను ఆవిధంగా మార్చినందుకు అతనికి 'ఎమ్మి' అనే అవార్డు లభించింది. దీన్ని 'ఆస్కార్ అవార్డ్'ని మించిన పురస్కారంగా పరిగణిస్తారు. స్టెన్ తన మేకప్ విధానం గురించి వివరిస్తూ, "మొదట 'పాత్ర ఎలా వుంటుంది?' అని ఆలోచించి దానికి తగ్గట్టు మేకప్ డిజైన్ తయారుచేస్తాము. దాన్ని దృష్టిలో వుంచుకుని తగిన 'స్కెచెస్' కొన్ని వేస్తాము. అప్పుడు మేకప్ ఆర్టిస్టు ఆ నటుల కనుముక్కు తీరులను కొంత మేరకు మార్చితే సరిపోతుందా, లేక పూర్తిగా మార్చి ఆ ముఖానికి సరికొత్త రూపును తీసుకురావాలాఅనేదినిర్ణయించుకుంటాడు.

ఈ మేకప్ విషయంలో అంతా కథ,

దర్శకుడిఅభిమతంపైఆధారపడివుంటుంది. ఆవిధంగా తుది నిర్ణయం తీసుకున్నాక నటి లేదా నటుల విగ్రహాన్ని తయారు చేస్తాము. అప్పుడు మేకప్ ప్రారంభ మవుతుంది.

ముందు పాత్రకు అవసరమైన గీతల్ని విగ్రహం.మొహంపై గీస్తాము. దానికై మొహాన్ని నుదురు, ముక్కు, చెక్కిళ్లు, దవడలు అని వివిధ భాగాలుగా విభజిస్తాము. ప్రతి భాగపు స్వరూపాన్ని ఫోమ్ రబ్బరుతో తయారుచేసి ఆ ముక్కలను కత్తిరించి, నటుల ముఖాలపై అతికిస్తాము" అని చెప్పాడు.

ఆస్కార్ అవార్డులకి నామినేట్ చేయబడినవారిలో ప్రపంచంలో ప్రథమ మేకప్ కళాకారుడు 'స్టెన్'యే!

"ఈ టెక్నిక్ కొత్తదేంకాదు. ఇదే టెక్నిక్‌ని 1939లో నిర్మించిన 'విజార్డ్ ఆఫ్ ఓజ్' అనే చిత్రానికి వాడుకున్నారు. కాని, ఇపుడు కొత్తగా అభివృద్ధికరమైన మార్పులు కొన్ని చోటుచేసుకున్నాయి. ఇపుడు ప్రేక్షకులు చాలా తెలివిగా మేకప్‌లోని లోపాల్ని పసిగడుతున్నారు గనక మేము పాత్రలు మరింత వాస్తవికంగా కనబడేట్టు మేకప్ చేయాల్సి వుంటోంది.

"అందువల్ల మేకప్‌మన్‌కి మేకప్‌లో నైపుణ్యం కంటే కల్పనాశక్తే ఎక్కువవుండాలి. అతను మంచి శిల్పి కూడా అయి వుండాలి. అతనికి పాత్రల అసలు స్వభావాన్ని గ్రహించే మంచి అవగాహనాశక్తి వుండాలి.అప్పుడే అతను తన మేకప్‌తో పాత్రలకు సజీవరూపం కల్పించగలడు" అంటాడు స్టెన్.

టెలివిజన్ కోసం నిర్మించిన 'గోర్ గోయల్స్' అనే సినిమాలో మేకప్ ప్రతిభ ప్రదర్శించినందుకు స్టెన్‌కి మరో 'ఎమ్మీ' అవార్డు వచ్చింది. మరో సినిమాలో ఓ యువకుడిని తన మేకప్‌తో 50 ఏళ్ళ వృద్ధుడిగా మార్చేశాడు స్టెన్.



"మేకప్ ఆర్టిస్టు నటుల్ని శారీరకంగా మాత్రమే పాత్రకు అనుగుణంగా మార్చ గలడు. ఆపై ఆ పాత్రలో జీవించాల్సిన బాధ్యత నటులపై వుంటుంది. వారి నటన పాత్రకు తగినట్టు లేకపోతే మేకప్ఆర్టిస్టు పడిన శ్రమ అంతా వృథా అవుతుంది" అంటున్న ఇతడు హాలీవుడ్‌లో అగ్రతార లనేకమందికి మేకప్ చేశాడు.

## ఏడేళ్ల పనికి 5 రెట్ల జీతం

ఇటీవల ఢిల్లీ విశ్వవిద్యాలయపు ప్రొఫెసర్లు తమ కోర్కెల సాధనకై మూడు నెలలపాటు సమ్మె చేసారు. విద్యార్థుల సమ్మెల వల్ల విశ్వవిద్యాల యాలు పనిచేయకపోవడం పరిపాటే. కాని, ఈసారి ప్రొఫెసర్ల సమ్మెతో ఢిల్లీ యూనివర్సిటీ దీర్ఘకాలం మూత పడింది.

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో పనిచేసే లెక్చరర్లు ఇప్పటికే ఎన్నో సౌకర్యాలను అనుభవిస్తున్నారంటూ ఆ విశ్వవిద్యాలయ బోధనా సిబ్బంది పొందుతున్న ప్రయో జనాలు, సౌకర్యాల గురించి సిండికేట్ సభ్యులలో ఒకరు లెక్కలు కట్టారు. ఆ లెక్కలను బట్టి చూస్తే వారి ఉద్యోగం రాజభోగమే అన్పిస్తుంది.

ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ని లెక్చరరుగాని, ప్రొఫెసరుగాని అతని 35 ఏళ్ల సర్వీసులో కేవలం 20 శాతం రోజులే ఉద్యోగ విధులకు హాజరవుతాడు. అంటే 35 ఏళ్ళలో అతను పనిచేసేది మొత్తం 7 ఏళ్ళే! మిగిలిన 29 ఏళ్ల విశ్వవిద్యాలయం ప్రకటించిన లేదా తానే తీసుకున్న సెలవులతో హాయిగా కాలక్షేపం చేస్తాడన్న మాట.

ప్రొఫెసర్‌కి మొత్తం సర్వీసులో 14 నెలల వరకూ ఎర్న్‌డ్ లీవు వుంటుంది. కొత్త నిబంధనల ప్రకారం అతనా సెలవు వాడుకోకపోతే డబ్బులు తీసుకోవచ్చు. సర్వీసులో 16 నెలలు కేజువల్ లీవు, సగం జీతం, ఇతర ఎలవెన్సులతో 21 నెలలపాటు సిక్‌లీవు తీసుకోవచ్చు.

అనారోగ్యం గురించి సరైన డాక్టరు సర్టిఫికెట్ వుంటే ఆ సెలవు కాలమంతా పూర్తి జీతాన్ని పొందే అవకాశముంది. 36 నెలలపాటు తీసుకునేందుకు వీలుగా ఎక్స్‌ట్రార్డినరీ లీవు అనేది కూడా వుంది. విదేశాలకెళ్ళే అవకాశాలొచ్చిన సందర్భా లలో ఆ లీవు వుపయోగించుకుంటారు.

పైవి కాక మామూలు సెలవు దినాలు 65 నెలలుంటాయి. ఎడ్మిషన్ల హడావుడి, విద్యార్థి సంఘ ఎన్నికల వల్ల ప్రతియేటా 3 నెలలపాటు లెక్చరర్లకి పనే వుండదు. ఇంకా విద్యార్థుల సమ్మె, ప్రొఫెసర్ల సమ్మెలను, విశ్వవిద్యాలయాన్ని సందర్శించేందుకు విదేశీ ప్రముఖులు వచ్చినపుడు సెలవుగానే పరిగణించాలి.

వాటికి తోడు స్టడీ టూర్లు,సమావేశాలు, శీతాకాలపు స్కూలు, వేసవి స్కూలు అంటూ సెలవులు కల్పించుకుంటారు. అలాంటి సందర్భాలలో మామూలు జీతమే కాక ఉచిత భోజన, వసతి సౌకర్యం కూడా లభిస్తుంది.

ఆ విధంగా 35 ఏళ్లలో 7 సంవత్స రాలు మాత్రమే పనిచేసే వారి జీతాలు 1,600 నుంచి 3,500 రూపాయల మధ్యలో వుంటాయి.





బస్‌స్టాపులన్నీ కళకళలాడుతున్నాయి. ఫస్టు బస్సు ఎక్కడ వెళ్లిపోతుందోనని పావని హడావుడిగా వస్తోంది.

అవుట్ గేటు దాటి గబగబా అడుగులు వేస్తుంటే అతను దగ్గరగా వచ్చాడు.

"నమస్కారమండీ! మార్నింగ్ రేడియోలో మీ పాట విన్నాను. చాలా బాగుంది" అన్నాడతను.

"థాంక్స్" అందామె కర్చీఫ్‌తో మొహంమీది చిరుచెమటను తుడుచుకుంటూ.

"మళ్లీ ఎక్కడన్నా పాడుతున్నారా?"

"ఏమో...ఏం చెప్పను? అవకాశం రావాలిగదా" అంటూ ఆ సంభాషణ అక్కడితో తుంచేసి 'వస్తాను' అనేసి ముందుకు వెళ్లిపోయింది.

పావని బస్సు ఎక్కేటప్పటికి సీట్లు అన్నీ నిండిపోయినయి. మూడో వరుసలో కూర్చున్న శాంత చూసి నవ్వింది. పావని వెళ్లి ఆమె దగ్గర సర్దుకుని కూర్చుంది. ముందువరసలో కిటికీదగ్గర కూర్చున్న పద్మలత సీరియస్‌గా పత్రికలో సీరియల్ చదివేస్తోంది. పావని ముందుకు వంగి పద్మలత చేతిలోని పత్రిక లాగేసుకుంది.

"ఇంటికెళ్లి చదువుకోవే, బస్సులో కూడా ఏమిటి నీ పోజు? అక్కడికి నీవొక్కదానివే చదువొచ్చినదానివీ, మేమంతా అక్షరంముక్కరాని అజ్ఞానులమనీ నీ ఉద్దేశమా?" అంది పావని.

"నువ్వు పబ్లిగ్గా రోడ్డమీద లవ్వాడగా లేనిది, నేను బస్సులో సీరియల్ చదువుకుంటే తప్పా?" అంటించింది పద్మలత.

"శేఖర్ అని మన ఆఫీసువాడేనే! మెంటల్ కేసులా ఉన్నాడులే! పొద్దున రేడియోలో నా పాట విన్నాట్ట"

"అంత అభిమానంతో వచ్చి మెచ్చుకుంటే, కృతజ్ఞత లేకపోగా, మెంటల్ కేసు అంటావా?" ఆశ్చర్యపోయింది పద్మలత.

"లేకపోతే, సంతోషం పట్టలేక గుడ్డలు విప్పుకుని గంతులు వెయ్యమంటావా? అసలింత శ్రద్ధగా ఎవరేనా వెంటపడుతున్నారంటే, దీని భావమేమి తిరుమలేశా?" సందేహం వెలిబుచ్చింది పావని.

"ఈ జన్మకు నువు బాగుపడవు" తీర్పు చెప్పింది లత.

ఇందాకటినుంచీ వీళ్ల సంభాషణ సరిగ్గా వినిపించని శ్యామల దగ్గరికొచ్చి మరీ అడిగింది.

"ఏమిటే...ఇందాకటినుంచీ ఏమిటో చెవులు కొరుక్కుంటున్నారు?"

"ఏంలేదే ... నువ్వు సాయంత్రం అయిదు గంటలకు కూడా ఫ్రెష్‌గా పెళ్లికూతురిలా తయారై వచ్చావేమిటా అని?" అంది పావని.

"నేను నిత్య పెళ్లికూతుర్నే పిచ్చితల్లీ వాడే యాడనున్నాడో, ఎక్కడున్నాడో, కనబడటంలేదు, అంతే!" స్పష్టంగా చెప్పింది శ్యామల.

"అయితే పేపర్లో ప్రకటన ఇద్దామే. ఉద్యోగంచేస్తున్న అందమైన అమ్మాయిని పెళ్లిచేసుకోగల గుండె ధైర్యంగల డిగ్రీ చదివిన యువకుడు కావలెను. పూర్వానుభవం కనీసం రెండేళ్లు ఉండవలెను. మొదట్లో తాత్కాలికం అయినా, పనిలో చూపే ఆసక్తిని, నేర్పును బట్టి ఆరు నెలల తర్వాత ఖాయం చేయబడును..." అని వివరించింది పావని.

"బొత్తిగా సిగ్గులేదే నీకు" అని గోముగా మందలించింది శ్యామల.

ఇంతలో కండక్టరు వచ్చి టిక్కెట్లు ఇవ్వటం మొదలెట్టాడు.





"గురూ..మనవాళ్లంతా వచ్చినట్టేనా?" అని రామాన్ని అడిగాడు ఆంజనేయులు అడాళ్లవంక చూస్తూ.

"వచ్చేశారు" అన్నాడు రామం.

ఆంజనేయులు గంట కొట్టాడు. కండక్టరుకు కోపం వచ్చింది.

"ఎవరయ్యా అది? ఇదేమన్నా ఆంజనేయుడి గుడా...ప్రతోడూ వచ్చి గంట కొట్టడానికి?" అని అరిచాడు.

"సాక్షాత్తూ ఆంజనేయుడేనయ్యా గంట కొట్టింది. ఇంక పోనియ్" అన్నాడు రామం.

మగాళ్ళు ఫక్కుమని నవ్వారు. ఆడాళ్లు ముసిముసిగా మురిసిపొయ్యారు. కొందరు తలెత్తి ఆంజనేయుల్ని చూశారు. ఆంజనేయులు గాలికొట్టిన బెలూనే అయిపొయ్యాడు.

బస్సు బయల్దేరింది. వెనకాల కూర్చున్నవాళ్ళు రిటైర్‌మెంటు వయస్సు గురించి, మధ్యలో కూర్చున్నవాళ్లు తెలుగుదేశం పరిపాలన గురించి, ముందు నించున్నవాళ్లు నిన్న రిలీజ్ అయిన సినిమా గురించి మాట్లాడుకుంటున్నారు.

బస్‌కు సడన్ బ్రేకు పడింది. ఆంజనేయులు తూలిపక్కన నిలబడ్డ అమ్మాయి మీద పడినంతపని చేశాడు.

"ఎంత హాయి ఈ బ్రేకునందునా!" అని ఆగి, "తర్వాత చరణం ఏమిట్రా?" అనడిగాడు ఆంజనేయులు.

"'ఎంత దెబ్బ ఈ చెప్పు కొట్టునో?' అని వుంటుందనుకుంటా" అంది వయసు ముదిరి యాభయ్యోపడిలోపడ్డ పార్వతమ్మగారు.

"అత్తయ్యగారు కవిత్వం చెబుతున్నారోయ్" అన్నాడు రామం.

"ఎవర్రా నీకు అత్తయ్య?" అని ఆమె కయ్యానికి దిగింది.

"మావాడు అత్తయ్య కూతుర్ల అభిమాన సంఘాధ్యక్షుడండీ" అని ఆంజనేయులు ఎంత చెప్తున్నా వినకుండా ఆమె వివాదానికి దిగటంతో మలక్‌పేటలో ఆమె 'డౌన్' అయ్యేవరకూ అందరికీ ఉచిత వినోదం లభించింది.

తర్వాత టి.వి. టవర్ దగ్గర శాంత దిగింది. ఎబిసి దగ్గర పద్మలత దిగిపోయింది.

తర్వాతి స్టాప్‌లో దిగి పావని ఇంటి మొహం పట్టింది. ఇంటిని తల్చుకోగానే పావనికి బోలెడు దిగులు పట్టుకుంది. ఆఫీసుకు బయల్దేరినప్పటినుంచీ మళ్ళీ కొంపజేరేంత వరకూ, ఇంటి వాతావరణాన్ని మర్చిపోయి, స్నేహితురాండ్రతో సరదాగా, నవ్వుతూ, తుళ్లుతూ కాలక్షేపం చేస్తోంది. కానీ ఉదయించిన సూర్యుడు అస్తమించటం ఎంత నిశ్చయమో, సాయంత్రం సాలెగూడులాంటి ఈ ఇంటికి రావటమూ అంత ఖచ్చితమే.

అన్నిటికీ కన్నీటిని నింపుకోవటం తప్ప మరేమీ ఎరుగని తల్లి –

సాయంత్రం తాగే విస్కీకోసం పగలంతా కళ్లుమూసుకుగడిపే తండ్రి –

పాతికేళ్లు వచ్చినా ఏ బాధ్యతలూ పట్టించుకోని బ్రదరూ–

ఎప్పుడు జంట కుదురుతుందా, రివ్వున ఎగిరిపోవాలని రెక్కలు రెపరెపలాడిస్తున్న చెల్లెలూ... ఇదీ కుటుంబం.

ఎవరి మధ్యా ఆప్యాయతలులేవు. అనుబంధాలకు అర్థం తెలియదు. తెల్సిందల్లా తరుముకొస్తున్న అవసరాలు. వాళ్ళ నరాల్లో ప్రవహిస్తోంది రక్తం కాదు.. స్వార్థం.

అయినవాళ్ళ మధ్య జరిగే అంతః

కలహాలు ఎంత జుగుప్సాకరంగా ఉంప పచ్చో, వాళ్ల పోట్లాటలు అంత జుగుప్సాకరంగానూ ఉంటాయి.

ఆ రెండు గదుల రేకుల షెడ్డూ,నాలుగ జంతువుల్ని పట్టి బంధించిన బోనులా కనిపిస్తుంది! అయినా తప్పదు. అదే తన పాలిటి స్వర్గధామం అనుకోవాల్సిందే!

ఆలోచలను చుట్టబెట్టుకుని నడుస్తున్న పావని తనను ఎవరో ఫాలో అవుతున్న అనుమానం వచ్చి ఆగింది. వెనకనే నడుస్తున్న వ్యక్తిని చూసి నొసలు చిట్లించి చిరాగ్గా అడిగింది–

"ఏం కావాలి?"

"అడ్వకేటు సత్యనారాయణగారిల్లు ఎక్కడండీ?" అన్నాడు అతను – ఆమె అడిగిందే ఆలస్యం దగ్గరగా వచ్చి ఎంతో వినయంగా.

"అదుగో....ఆ కనిపించే మేడే. కానీ వాళ్ళు ఊరికి వెళ్ళారే?" అని చెప్పింది అక్కడే నిలబడి.

"అయ్యేసీ...ఎప్పుడొస్తారో మీకేమన్నా అయిడియా ఉందా?''

"కనీసం ఒక వారం రోజులు అయినా పడుతుంది. ఇంతకీ మీరెవరో తెల్సుకోవచ్చా?"

జవాబు చెప్పటానికి అతను కొంచెం ఇబ్బంది పడ్డాడు. "నేను వైజాగ్ నుంచి వస్తున్నాను. మా నాన్నగారు ఆయనకు లెటర్ రాసిచ్చి నన్ను వెళ్ళి చూసి రమ్మన్నారు" అన్నాడు.

పావనికి కొంతవరకు అర్థమైంది. "రండి .... ఇల్లు చూద్దురు గాని" అంటూ తనతో తీసుకువెళ్లింది.

ఆ మేడ లోపలికి వెళ్లాక, ఒక్క నిముషంలో వస్తానని చెప్పి పక్కనున్న సందులోనుంచి వెనక్కి వెళ్ళింది. తాళం చెవి తెచ్చి, తలుపులు తీసి, ఫాన్ వేసి, అతన్ని లోపలికి పిల్చి, సోఫా చూపించింది.

అతను కూర్చున్నాక తనను తాను పరిచయం చేసుకుంది.

"నా పేరు పావని. నేను ఏదో చిన్న ఉద్యోగం వెలగబెడుతున్నాను. మేము వెనకాల పోర్షన్‌లో అద్దెకుంటున్నాం. సత్యనారాయణగారు మాకేమీ కాకపోయినా, నేను వాళ్ళింట్లోనే ఎక్కువసేపు ఉంటాను. వాళ్ళమ్మాయి కవితా, నేనూ బెస్ట్ ఫ్రెండ్స్‌మి. మీరు వచ్చిన పని ఏమిటో చెబితే, నేను వాళ్లు రాగానే చెబుతాను..." అంది పావని.

అతను మళ్ళీ సిగ్గుపడటం చూసి ఆమె మళ్లీ అందుకుంది "మీరు సిగ్గు పడుతున్నారు..."

"అబ్బే ... అదేం లేదండీ! నాకు సిగ్గేంటి?" అన్నాడతను తడబడుతూ.

''వెరీగుడ్! అయితే చెప్పండి..ఏదైనా ఉద్యోగంగాని, లేక ఇతర సహాయంగాని అడగటానికి వచ్చారా?"

"నేను మా ఊళ్ళోనే బాంక్ మేనేజరుగా పనిచేస్తున్నాను. వేరే పని ఉండి హైదరాబాద్ వచ్చి హోటల్లో దిగాను. మా ఫాదర్‌కి ఇదివరకు ఈయన లెటర్ రాశారట,చూట్టానికి రమ్మని. అందుకని... నేను ఎలాగూ హైదరాబాదు వస్తున్నాను గనుక నన్నే వెళ్ళి చూసి రమ్మన్నారు.."

"అయ్యేసీ, మీరు పెళ్లిచూపుల కొచ్చారన్నమాట. సారీ... ఆ విషయం తెలీక మిమ్మల్ని కొంచెం ఇబ్బంది పెట్టినట్లున్నాను" అని నవ్వింది పావని.

"ఫర్వాలేదండీ" అన్నాడతను.

"వీళ్లంతా సకుటుంబంగా తిరుపతి వెళ్లారు. అక్కడినుంచి మద్రాసు

వెళ్తారుట. బంధువుల ఇంట్లో పెళ్ళివుంది. అదయ్యాక వస్తారు. వారం పదిరోజులు పట్టొచ్చు. మీరు ఎన్నాళ్లు ఉంటున్నారు?" అని అడిగింది పావని.

"నేను వచ్చే గురువారంనాడు గోదావరిలో వెళ్ళిపోతానండి...''

"అయితే కవితను చూడకుండానే వెళ్తారన్నమాట. పోనీ దాని ఫొటో చూద్దురుగాని ఉండండి..." అంటూ పక్కగదిలోకి వెళ్ళి ఆల్బం తెచ్చింది. అందులోని ఫొటోలు చూపిస్తూ కవితను అనేక రకాలుగా పొగిడింది.

"ఫొటోలు సరిగా రాలేదుగానీ నిజంగా కవిత చాలా బావుంటుంది. షి ఈజ్ వెరీ ఛార్మింగ్ గాళ్..." అంటూ పావని వివరిస్తుంటే అతను ఎంతో ఆసక్తిగా ఆమెవైపేచూస్తూ కూర్చున్నాడు.

''ఆమె విశేషాలు ఎలా ఉన్నా మీరు వాటిని వివరించే తీరు మాత్రం బావుంది" అని ఇద్దర్నీ కలిపి మెచ్చుకున్నాడు.

''నేనేం కావాలని పొగడటం లేదండీ! నా అభిప్రాయాలు చెప్పాసంతే. ఫైనల్ డెసిషన్ మీదే అనుకోండి. కానీ, వన్ మస్ట్ బీ లక్కీ టు హావ్ హెర్...ఒక్కతే పిల్ల కావటంచేత ఆయన ఆస్తి అంతా పిల్లకే వస్తుంది... మీరేం తీసుకుంటారు" అని అడిగింది సూటిగా అతని మొహం లోకి చూస్తూ.

"అబ్బే...వరకట్నానికి నేను వ్యతిరేకినండీ''

"వెరీ నైసాఫ్ యు ... కానీ నేను అడిగింది కట్నంగురించి కాదు. కాఫీ, టీ, బోర్నవిటా, కూల్ డ్రింక్...?"

"మీకెందుకీ శ్రమ?"

''భలేవాళ్ళే! మీ కాబోయే అత్తవారింట్లోని ఫ్రిజ్‌లోనుంచి కూల్ డ్రింక్ తీసి ఇవ్వటం శ్రమ అనుకుంటే ఎలాగండీ? రేపు మీరు ఈ పెళ్ళికి ఊ అనాలే గానీ, ముందున్నాయి నా పాట్లన్నీ.... మీ పెళ్ళి నా చేతులమీదుగా జరగాల్సిందే'' అంటూ అతన్ని లోపలికి ఆహ్వానించింది.

ఇద్దరూ డైనింగ్ టేబులు దగ్గర కూర్చుని కూల్ డ్రింక్స్ తాగుతున్నారు.

"ఈ ఇంట్లో మీకు బాగా చొరవ అనుకుంటాను" అని అడిగాడు.

"ఈ ఇంట్లో కవితకన్నా నాకే ఎక్కువ చొరవ. ఈ ఇంట్లో ఎక్కడేంవుందో,నాకు తెల్సినట్లు దానికి కూడా తెలియదు. సత్యనారాయణ దంపతులుకూడా నన్ను వాళ్ల రెండో అమ్మాయిలాగే చూస్తారు. అసలు కవితా, నేనూ ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకుంటామండి..." అని చెప్పుకుపోతూవుంటే అతను అడ్డు తగిలాడు.

"ఇంకా మీరు ఇద్దరూ ఒక మంచంలోనే పడుకుంటుంటే, కొంచెం కష్టమేనండి..." అన్నాడతను నవ్వుతూ.

"నావల్ల మీకెలాంటికష్టమూ ఉండదులెండి. అదేంపెద్ద పట్టించుకోవల్సిన పనేంలేదు. రండి....మేడమీదకు వెళ్దాం. సాయంత్రం పూట పైన ఎంతో బావుంటుంది" అంటూ మేడపైకి తీసుకు వెళ్లింది.

అప్పటికే చీకటిపడింది. ఏ దేవకన్య మెడలోని హారం తెగిందో ఏమో. మిలమిలామెరిసే వజ్రాలన్నీ ఆకాశాన చిందరవందరగా పడివున్నాయి. ఇటునుంచి చంద్రుడు నిండుగా నవ్వుతూ పైకి వస్తున్నాడు.వెన్నెల వెలుగువెల్లువలా ముంచుకొస్తోంది. చల్లగాలి మెల్లమెల్లగా వొళ్లంతా నిమిరి గిలిగింతలు పెడుతోంది.

"అదుగో, అది టి.వి.టవర్, దూరంగా




వెలుగు తెప్పపై తేలుతున్నట్లు కనిపిస్తోందే అది బాలాజీ టెంపుల్..."

ఆమె పిట్టగోడను ఆనుకుని నిలబడి ఉంది. అతనూ అలాగే నిలబడ్డాడు. ఆమె చూపించగలిగినవన్నీ చూపించింది. అతను చూడవల్సినవన్నీ చూశాడు.

"మీకు ఎలా వుందిక్కడ?" అని అడిగింది పావని.

"చాలా బావుంది" ఒప్పుకున్నాడతను.

"ఎప్పటికీ ఇక్కడే ఉండిపోవాలనిపించటం లేదా?"

"అనిపించినంత మాత్రాన కనిపించిందంతా కావాలనుకుంటే దక్కాలిగదా?"

"స్వంతం చేసుకోవాలనేగదా..చూసుకోవటానికి వచ్చారు. కవిత నచ్చిందా? ఫొటో చూశారుగదా! కన్యారత్నంమీద వజ్రంలాంటి మీ అభిప్రాయం చెప్పండి" అని అడిగింది పావని అతనికి అభిముఖంగా తిరిగి.

"ఆమెను నేను చూడకుండా ఏమీ చెప్పటం బావుండదుగాని, మీరు నన్ను చూశారుగదా. నామీద మీ అభిప్రాయం చెప్పండి" అని అడిగాడు అతను.

"మీకేమండీ, హీరోలా ఉన్నారు. "ఛార్మింగ్ ప్రిన్స్ అండ్ డార్లింగ్ ఆఫ్ మిలియన్స్"లా ఉన్నారు...."

"థాంక్స్! నా కళ్లకు మీరూ డ్రీమ్ గర్ల్‌లా కనిపిస్తున్నారు. ఏదో అనుబంధాన్ని పెంచుకుని, పెంచుకుని వెళ్లిపోయి మళ్లీ తిరిగి కల్సుకున్నామేమో ననిపిస్తోంది..." అన్నాడతను.

"అదేమిటీ! నా గురించి మీరలా మాట్లాడటం బావుండలేదు...మీరీ ఇంటికి కాబోయే అల్లుడుగారు"

"కానీ అది నా హృదయ స్పందన. బాగోగుల ప్రసక్తిలేదు. మనసులోని మాట దాచుకోలేక చెప్పాను..."

"కానీ మీరు వచ్చినపని వేరు, కవితను చూడటానికి వచ్చారు"

"కానీ మిమ్మల్ని చూశాను. ఇలా ఎందుకు జరిగిందీ అంటే దీనికి భాష్యం చెప్పటం చేతగాకనే, ఘటన అన్నారు. మిమ్మల్ని కల్సుకున్న ఈ సంఘటన మాత్రం, నా జీవితంలోని మధురాతి మధురమైన అనుభూతిగా ఫీల్ అవుతున్నాను...." అన్నాడు.

"రండి వెళ్దాం. మీకు...టైం అవుతోంది" అని కిందకు వచ్చింది పావని.

ఇద్దరూ నడుస్తూ బస్‌డిపో దాకా వచ్చారు. అంతవరకు ఎంతో హుషారుగా మాట్లాడిన పావని ఒక్కసారిగా మూగదానిలా మారిపోయింది. ఈ మార్పు అతనూ గమనించాడు.

"మిమ్మల్ని నొప్పించి ఉంటాను. నాకు తెల్సు కానీ చెప్పానుగదా. మనసులోనిమాట దాచుకోలేకపోవటం నా తప్పే కావచ్చు. మీరేమనుకున్నా సరే...మళ్లీ అదే అంటున్నాను.. యు ఆర్ మై డ్రీమ్‌గార్ల్... ఎన్నాళ్లుగానో కలలుకంటున్న సౌందర్యరాశి మీరే, మీరేనని నాకు పదేపదే అనిపిస్తోంది. కానీ మీరు చాలా కోపంగా ఉన్నారు..." అన్నాడతను ఆమెను ప్రసన్నంచేసుకోవాలనే ధోరణిలో.

"నాకు కోపమేం లేదు. కానీ కవిత.."

"ఒకరికి కవిత మీద ఇష్టం. మరొకరికి పాట మీద ఇష్టం. ఇంకొకరికి నాట్యం మీద మక్కువ. ఎవరి అభిరుచి వాళ్లది. మనసు పెంచుకునే ఇష్టాయిష్టాలను శాసించటం ఎంత కష్టం?"

"ఇంతకీ మీరనే దేమిటి?" అని సూటిగా అడిగింది పావని.

"ఇవాళ ఎంతో మంచిరోజు, మంచి

సమయం అని పెద్దలు వత్తిడిచేయగా నా జీవిత భాగస్వామిని మొదటిసారిగా చూసుకుందామని వచ్చాను. మీరు కనిపించారు. నాకెంతో తృప్తిగా ఉంది. ఇప్పటికింతకన్నా మరేమీ చెప్పలేను"

"ఇంతకీ మీ పేరైనా చెప్పలేదు"

"ప్రసాద్"

"ఆ పేరెందుకో నాకిష్టం" అన్నది పావని అప్రయత్నంగానే.

"ఆ పేరుగల ఈ వ్యక్తి మీకిష్టమని తెలిస్తే, నేను నెపోలియన్‌కన్నా గొప్పవాడినన్న ధీమాతో వెళ్తాను. అహ... తొందరేం లేదు. టేక్ యువరోన్ టైం. అన్నట్లు...మీరే డిపార్ట్‌మెంటో చెప్పలేదు"

ఆమె చెప్పింది.

బస్సు వచ్చింది.

అయినా అతను ఎక్కలేదు. ఆమె ఎదురుగానే నిలబడి ఉన్నాడు.

"వెళ్ళమంటారా?" అని అడిగాడు.

"బావుంది...నేనుండమంటే ఉంటారా? అయినా కల్సుకోవటం విడిపోవటానికే గదా?..." అంది అతని కళ్ళల్లోకి చూస్తూ.

"విడిపోవటం తిరిగి కల్సుకోవటానికే అయితే, ఆ వియోగం సంయోగం కన్నా మధురంగానే ఉంటుంది" అన్నాడతనూ ఆమె చూపుల్లో చూపులు పెనవేసి.

"ఏమో.... అవన్నీ మీకే తెలియాలి" అంది తలొంచుకుని

"ఇకముందు మీకూ తెలియాలని నా ఆకాంక్ష" అన్నాడామె చెవిలో చెప్పినంత రహస్యంగా.

బస్సు బయల్దేరింది. అతను ఒక గెంతుతో ఎగిరి ఫుట్‌బోర్డు మీద నిలబడి వీడ్కోలుగా చెయ్యి ఊపాడు. అప్రయత్నంగానే ఆమె కూడా చెయ్యి ఊపింది.

బస్సు వెళ్ళిపోయింది.

తర్వాత బరువుగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయింది పావని.

* * *

ఆ సాయంత్రం పావని ఒంటరిగా నడిచి వెళ్తోంది. కాలక్షేపం కోసం, టైం కిల్ చేయటం కోసమనీ మధ్యలో బస్సు దిగి దిక్కులు చూస్తూ నడుస్తోంది.

ఈరోజు త్వరగా ఇంటికి వెళ్ళబుద్ధి కావటంలేదు, పొద్దున ఇంట్లో యుద్ధం జరిగింది. తండ్రీ, తనూ పోటీలు పడి మాటలు తూటాల్లా వదులుకున్నారు. ఆ దృశ్యం ఇంకా కళ్ళముందు కదులుతూనే ఉంది. పొద్దుటినుంచీ మనసంతా వికలమై పోయింది. దేనిమీదా ధ్యాసే కుదరలేదు. అన్యమనస్కంగానే ఉంటూ వచ్చింది.

ఆఫీసునుంచి బయట పడినా, ఇంటికి మాత్రం వెళ్లాలని అనిపించటంలేదు.

అసలే ఇరుకుగా ఉన్న ఫుట్‌పాత్ మీద అడ్డంగా వున్న హాకర్స్‌నూ, రాసుకుంటూ పోతున్న పశువులనూ, పశువుల్లాగానే రాసుకుంటూ పోతున్న కళ్ళుండీ కనలేని మారాజులనూ-తప్పించుకుంటూ నడుస్తోంది పావని. చుట్టూ ఎంత రద్దీగా ఉన్నా, ఎన్ని వందల మంది ఉన్నా, తనచుట్టూ గిరిగీసుకుని ఆ గిరిలోనే ఒంటరిగా ఉండిపోయే అలవాటు పావనిది.

అందుచేతనే ఎదురుగా వచ్చి పలకరించిన అతన్ని చూడనట్టే వెళ్ళిపోతుంటే. అతనే మళ్ళీ పిల్చాడు. అప్పుడు తెప్పరిల్లి తలెత్తి చూసింది.

నిన్న సాయంత్రం ఇంటికొచ్చిన పెళ్ళికొడుకే! ఎదురుగా నవ్వుతూ ని-




బద్దాడు.

"ఏమిటిలా వెళ్తున్నారు?" అని అడిగాడు.

"ఇక్కడే...చిన్న పని ఉంది దిగాను"

''పని అయిపోయిందా?"

"అయిపోయింది'' అందామె నవ్వుతూ.

''ఇప్పుడింక ఎందాకా?"

"ఇంక కొంపకే...అదే ఇంటికే.."

"మీ ఇల్లు ఎక్కడికీ పోదు. అక్కడే ఉంటుందిగానీ, కాసేపు ఆగి వెళ్ళ కూడదూ?" అని అడిగాడతను.

ఇద్దరూ ముందుకు నడుస్తున్నారు.

నిజానికి పావనికీ ఇంటికి వెళ్ళాలన్న ఉద్దేశంలేదు. ఒంటరిగా రోడ్లమీద తిరగటంకన్నా, పక్కన మగ పక్షి ఒకడుంటే, అదో ధైర్యం కదా అనుకుంది.

"నాకు తొందరేంలేదు. రాత్రి పన్నెండు గంటలదాకా బస్సులు తిరుగుతూనే ఉంటాయి"

"ఆ తర్వాత కూడా ఆటోలు తిరుగుతాయి"

"కానీ అర్ధరాత్రి ఆడవాళ్లు ఒంటరిగా తిరగకూడదట"

"అర్ధరాత్రి తిరగకూడదు. అంటే పదకొండూ ముప్పావుదాకా పైమాటే కదండీ మనకి?" అని అడిగాడు.

కాఫీ తాగుదామని అతనే హోటలుకు తీసుకెళ్ళాడు. అక్కడ కూర్చుని ఆర్డర్ ఇచ్చాక అన్నాడు—

"మీ హైదరాబాద్ నాకు నచ్చలేదండీ"

''ఏమి?"

"సాయంత్రం పూట ఓజంట హాయిగా ఓ గంట కాలక్షేపం చెయ్యాలంటే చోటే లేదండీ" అని ఫిర్యాదు చేశాడు.

"అవును. ఇదివరకు చోటు ఉండేది. ఇప్పుడు జనాభా ఎక్కువైపోయి ఇరుకైపోయింది'' అని సమర్థించుకుంది పావని.

''అసలు ఊరికో సీషోర్ అన్నా ఉండాలండి...మనలాంటి వాళ్ళకోసం" అని ఆగిపోయ్యాడు.

పావని కళ్ళెత్తి నిశితంగా చూసింది.

ఖంగుతిన్నాడు అతను.

"మనకోసం అంటే మనిద్దరికోసం అని కాదు...మనలాంటి యువతరంకోసం; ముఖ్యంగా పెళ్ళిగాని ప్రేమికులు ఇలాగ ఇబ్బందిపడకుండా"

"అసలు మీ ధోరణి ఏమిటి? నాకు తెలీక అడుగుతాను-మనకోసం అంటారు, పెళ్లిగాని ప్రేమికులంటారు..ఏమిటిదంతా? అసలు మీ కడుపులో ఉన్నదేమిటో బయటకు రావటంలేదు'' అంది పావని గంభీరంగా.

''నాకు కడుపులో వేరే ఏమీ లేదండి... మీ తోడండి...అదేనండి, నేను అడిగేది మీ తోడు. మీరు నాకు తోడుగా ఉంటారా అని"

''ఉన్నాను గదా, ఇప్పుడు?"

"ఇప్పుడున్నారండి...ఇలాగే ఎప్పటికీ ఉండిపోతారా అని''

''ఎప్పటికీ ఇలాగే వుండిపోవాలంటే, ఈ హోటల్‌వాడు ఊరుకోవద్దూ"

"ఏద్చాడు. వీణ్ని, వీడి హోటల్నీ కొనేసి, మీ పేర రాసేస్తాను" అన్నాడు ప్రసాద్.

చటుక్కున ఆమె చేతిని అందుకుని, చిన్నగా ముద్దుపెట్టి వదిలేశాడు.

ఆ వెంటనే "ఏంటిది? ఎవరన్నా చూస్తే బావుండదు" అంది పావని తెచ్చి పెట్టుకున్న కోపంతో, చెయ్యి వెనక్కి లాగేసుకుని.

"ఎవరూ చూడకపోతే బావుంటుందన్న మాట. థాంక్యూ... ఇలాంటివి ఎవరన్నా

చూడటం నాకూ ఇష్టముండదు. ఓసారి నా రూంకు రాకూడదూ''

''ఎందుకో?''

''ఎందుకంటే, ఇందుకూ అని చెప్ప కూడదు. ఎవరన్నా వింటే బావుండదు ఐమీన్...మనిద్దరమే మాట్లాడుకోవాల్సినవి పర్సనల్ విషయాలు ఉన్నాయి గదా'' అన్నాడు టిఫెన్ ప్లేటు ముందుకు లాక్కుంటూ.

''ఏమిటో ఆ విషయాలు?''

''రామాయణమంతా విని రాముడికి సీత ఏమవుతుందని అడిగింది మీలాంటి వారేనటండీ''

''మీరు రామాయణం కూడా చెబుతారా?''

''ప్రేమాయణంకూడా ఒక రామాయణమే కదా. సరేగానీ ... మీతో విడిగా మాట్లాడాలి. ఎప్పుడు వీలవుతుంది?''

''ఇప్పుడు మాట్లాడండి''

''అబ్బే...ఇలాకాదు''

''ఇంకెలాగా ?''

''ఎలాగో రేపు చెబుతాను.మధ్యాహ్నం ఒంటిగంటకు మీ ఆఫీసు బయట వెయిట్ చేస్తుంటాను. లంచ్ టైంలో వచ్చేయండి. ఒక గంట తర్వాత వెళ్ళిపోవచ్చు''

''కుదరదు''

''అయితే రేపు ఆఫీసు ఎగ్గొట్టేయండి''

''అది అసలు కుదరదు''

''ప్రతిదానికీ కుదరని చెప్పేస్తే అసలు ఇంకెప్పటికీ కుదరదండి మనకి. మన వ్యవహారం గనుక, మనం కుదుర్చుకోవాలంతే''

కాఫీ తాగి బయటికొచ్చాక, మ... ఇద్దరూ నడుస్తున్నారు. బస్ స్టాప్‌లో ఆగింది. ''నేను వెళ్తాను మరి?'' అంది పావని.

''ఏంటా తొందర. పదకొండూ ముప్పావుదాకా తిరగొచ్చునని జనరల్ పర్మిషన్ ఉందిగా''

''గొప్పోరే''

''అయితే రేపు మధ్యాహ్నం ఒంటి గంటకు మీ ఆఫీసుముందు ఎండలో నిలబడి ఎదురుచూస్తుంటాను''

''అక్కడ పెద్ద చెట్టుంది. చెట్టుకింద నిలబడండి.... నీడగా ఉంటుంది''

''అయినా సరే, నేను ఎండలోనే నిలబడతాను. ఎండకీ, వానకీ తట్టుకుని నిలబడితేగాని ప్రేమ పరీక్షలో నెగ్గినట్లు కాదు...''

''చచ్చాం...వస్తాను మరి'' అందామె బస్సు ఎక్కుతూ.

''రేపు రావాలి మరి'' అన్నాడామెను సాగనంపుతూ.

పావనికి ఇతన్ని గురించిన ఆలోచనలే వెంటాడుతున్నాయి. సరదా అయినవాడు, సంతోషం తన సొంతం అయినవాడు, చొరవగా అల్లుకుపోతాడు- ముఖ్యంగా తన విషయంలో.

ఆ రాత్రికి పావనికి ఇంటికి వెళ్లాలని అనిపించటం లేదు. అనుకోకుండానే దారిలో పద్మలత ఇంటికెళ్ళింది. ఆమె ఈ స్నేహితురాలిని చూసి ఆశ్చర్యపడింది. లోపలికి రమ్మంది.

''ఏమిటే... ఇలా వచ్చావ్'' అని అడిగింది.

''ఊరికే నిన్ను చూద్దామనిపించింది.. వచ్చాను. ఏం రాకూడదా? ఈ రాత్రికి ఇక్కడే ఉంటాను''

''అర్థమైందిలే. ఇంట్లో గొడవపడి వచ్చావన్నమాట. పోన్లే... ఇలా అన్నా మా ఇంటిని నీ పాదధూళితో పావనం చేశావు''




"ధూళి అంటే గుర్తొచ్చింది. స్నానం చేస్తానే" అంది పావని.

పద్మలత బాత్ రూం చూపించింది. పావని స్నానం ముగించుకుని పద్మలత ఇచ్చినచీరకట్టుకుని వచ్చేటప్పటికి,ఆమెతో ఎవరో మాట్లాడుతున్నారు. సన్నగా, పొడుగ్గా కళ్లజోడు పైకి నెట్టుకుంటూ అదోరకంగా ఉన్నాడు. పావనిని చూసి అతను పక్కవాటాలోకి వెళ్లిపొయ్యాడు.

"ఎవరతను?"

"మా పక్కింటాయన...."

"గొప్ప పక్కింటాయన్నే పట్టావు మొహాన ఓ నవ్వూలేదు, ఏడుపూలేదు.... రాచ్చిప్పఫేసూ, అతనూను" అంది కావాలనే స్నేహితురాలి రియాక్షన్ చూద్దామని.

"అతన్నేమీ అనకు. మర్యాదగా ఉండదు..."

"ఏమిటి కథ?"

"మొహాన్నిబట్టి అంచనా ఎస్టిమేట్ వెయ్యకు...అతను చాలా ఇంటలిజెంట్"

"దేంట్లో ఇంటలిజెంట్...?"

"అన్నిట్లోనూ"

"ఓయబ్బో...పక్కింటి అమ్మాయి మీద వల విసరటంలో ఇంటలిజెంట్ అనుకున్నా"

"ఏం...పక్కింటమ్మాయే అతనిమీద వల విసురుతోందనుకో వచ్చుగదా... అతను జెంటిల్మన్"

"ఇప్పుడు ఎవడు కాదన్నాడే!ఆయన్ని అంత వెనకేసుకొస్తున్నావ్?"

"ఇందాకాయన్ని రాచ్చిప్ప ఫేస్ అన్నావు. విత్ డ్రాచేసుకో..."

"అదేమిటే... ఓ మనిషిని చూశాక, నా సొంత అభిప్రాయం ఏర్పరచుకునే హక్కు నాకు లేదా?"

"నీకా హక్కు లేదు.... అంతే! సారీ చెప్పు"

"నే చెప్పను...."

"లేకపోతే నువు కట్టుకున్న చీర విప్పి ఇచ్చేసెయ్" అంది పద్మలత.

"అయ్యా బాబోయ్... నేరకపోయి అన్నానే తల్లీ. సారీ... వెరీవెరీసారీ"

"ఇంకెప్పుడూ ఇలా నోరుజారకు మరి. ఆడది కాలు జారినా, నోరుజారినా డేంజర్..." అంటూ హెచ్చరిక చేసింది పద్మలత.

ఆ రాత్రి భోజనాలు చేశాక డాబా మీద పడుకున్నారు. అతను కూడా వచ్చి కొంచెం దూరంగా పడుకున్నాడు. వాళ్లిద్దరూ కాసేపు కబుర్లు చెప్పుకుంటే, పావని మౌనంగా వింది. అతని మాటలు విన్నాకపావని తన అభిప్రాయం మార్చు కుంది. గట్టిపిండమే— అనుకుంది.

తెల్లారి చూసేటప్పటికి అతను కనిపించలేదు.

"ఏడే... నీ జీనియస్?" అని అడిగింది పావని.

"రోజూ నాలుగింటికే లేచి మార్నింగ్ వాక్ కి వెళ్తాడు. ఇంక ఏడు దొరకడు" అంది పద్మలత.

"నాకు అక్కర్లేదులే. నీకైనా దొరుకు తాడా అని" అంది పావని.

"సాయంత్రం దాకా అతనికి ఊపి రాడదనుకో"

"సాయంత్రం దాకా ఊపిరాడక పోయినా అలా ఉన్నాడంటే గొప్ప విషయమే" అని ఒప్పుకుంది పావని.

"మార్నింగ్ వాక్ వల్లనే అలా ఉంటాడు. నువ్వూ నాలుగింటికి లేచిపోతే అలాగే ఉండగలవు"

"వద్దులే నన్ను ఇలాగే ఉండనివ్వు"




అంది పావని.

ఆఫీసుకు బయల్దేరబోయేముందు పావని పద్మలత సూట్ కేస్ తనిఖీ చేసింది.

"నీకు మంచి చీరెలు ఏమున్నాయో చూస్తాను" అంది.

ఉన్నవాటిల్లో ఒకటి మంచిది తనకి నచ్చింది ఎన్నుకుని కట్టుకుంది.

ఆఫీసుకు వచ్చాక పద్మలత తన డిపార్టుమెంటుకు వెళుతూ అంది.

"లంచ్ టైంకు నువ్వు నా దగ్గరికి వస్తావా, నేను నీ దగ్గరికి రానా?"

వెంటనే జవాబు చెప్పలేకపోయింది పావని. "మధ్యాహ్నం నేను కొంచెం బయటికెళ్తాను..."

"ఎందుకూ ?"

"చిన్న సిట్టింగ్ ఉంది"

"ఎవరితో?"

"మ్యూజిక్ రిహార్సల్ ... ట్యూన్ వినిపిస్తానన్నాడు. వినేసి వచ్చేయటమే''

"సరే, అయితే" అని పద్మలత వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం పావని కావాలనే ఓ అరగంట లేటుగా బయటకు వచ్చింది. నిజంగానే అతను ఎండలో నిలబడి ఉన్నాడు. దగ్గరకురాగానే ఆటోపిల్చాడు. ఇద్దరూ వెళ్తున్నారు.

"ఎంత సేపయింది వచ్చి?"

"నన్నుకాదు అడగాల్సిందా ప్రశ్న. మీ ఆఫీసు అవుట్ గేట్ ను అడుగు చెబుతుంది. నెత్తి చూడు ఎలా మాడిపోతోందో...?"

"వెరీసారీ... మా బాస్ పట్టుకుని వదలిపెట్టాడు కాదు"

''ఎవడాబాస్? పట్టుకుని వదిలి పెట్టకపోతే నువ్వెలా ఊరుకున్నావ్? కేకలేసి గొడవ చెయ్యకపోయావా?"

"పట్టుకోవటం అంటే పట్టుకోవటం కాదు...." నవ్వింది.

''మరి?"

"పని తెమలనివ్వలేదు..."

లంచ్ కోసం హోటలుకు వచ్చారిద్దరూ.

"రోజూ ఏమిటిది? హోటళ్లలో పడి తినటం? నాకేం నచ్చలేదు...'' అంది పావని.

"నాకు మాత్రం నచ్చిందేమిటి? అయినా ఇది మనం సొంతంగా కాపురం పెట్టేదాకా తప్పదుగదా మరి?"

"ఏమిటన్నారు? మనం సొంతంగా కాపురం పెట్టాలా?"

"పెడితే తప్పేమిటి?"

"పెళ్ళికాకుండా ఏమిటామాటలు?''

"మాటలకేమి? చేతలకు అభ్యంతరం గాని? అయినా మనం అంటే రాయల్ వుయ్ అన్నమాట"

"ప్రతిసారీ మీచేత అనవసరంగా ఖర్చు పెట్టిస్తున్నాను. నేనేమీ ఇవ్వలేకపోతున్నాను...''

"అయితే నేను ఒకటి అడుగుతాను. ఇస్తారా?" అని ఆశగా అడిగాడు.

"అడగండి..."

"ఇస్తానంటే అడుగుతా''

"ఇవ్వదగినదైతే ఇస్తా''

"ఇవ్వగలిగిందే..."

"ఇవ్వగలగటం వేరు, ఇవ్వదగటం వేరు-రెంటికీ తేడా ఉంది"

''మీ పెన్ నాకిచ్చెయ్యండి''

"నా పెన్ మీకెందుకు? కావాలంటే కొత్తది కొనిస్తాను"

"కొత్తది మీరు కొనివ్వాలేమిటి? నేకొనుక్కోలేనూ?"

"మరి అదే ఎందుకు అడుగుతున్నారు?"

"అదంటే నాకు ఇష్టం. .కాదు క్రేజ్"

"అదే, ఎందుకూ అని"

"దాన్ని నిన్న మీరు పెదాలమధ్య ఇరికించి, తెగ ముద్దు పెట్టుకుంటుంటే చూశాను..."

ఒకసారి కళ్ళింత చేసుకుని చూసింది. అతనేమో నవ్వేశాడు. ఆమె సిగ్గు పడిపోయింది.

"మరీ ఇలా తయారయ్యారేంటి?"

"మీరే ఇలా తయారుచేశారు. నేను అడిగింది ఇస్తానన్నారు. ఇప్పుడేమో వాగ్దాన భంగం చేస్తున్నారు సర్లెండి"

ఆమె పెన్‌తీసి టేబుల్‌మీద పెట్టింది. అతను తీసుకుని ముద్దు పెట్టుకుని జేబులో పెట్టుకున్నాడు. పైగా "ప్రేమికులు చాలా కాముకులు!" అన్నాడు టేబుల్‌కింద ఆమె చేతి వేళ్ళల్లో తన వేళ్ళు దూర్చుస్తూ.

"కావచ్చు కానీ కాముకులు మాత్రం మంచి ప్రేమికులు కాలేరు"

"ఎంచేత?"

"అదంతే. ప్రేమికులు మానసికానుబంధానికి ప్రాధాన్యత నిస్తారు. కాముకులు కేవలం శారీరకానుభవానికే ప్రాముఖ్యతనిస్తారు. ప్రేమించేవాళ్ళల్లోనూ మళ్ళా రెండు రకాలున్నారు. ప్రేమించిన వాళ్ళను పొందాలన్న తపనతో తపించిపోయి, ఆ అవసరం తీరగానే మనసు మరోదాని మీదకు మళ్ళించుకునేవాళ్లు కొందరయితే, అందినా అందకున్నా ఊహలనిండా ఆ వ్యక్తినే నింపుకుని, ఆ వ్యక్తితో శారీరకంగా పొందలేని జీవితాన్ని మానసికంగాపొందుతూ రోజులు గడిపేవాళ్లు ఇంకొందరూ ఉన్నారు" అంది పావని.

"ఇప్పుడు మనం ఎవరం?" అని అడిగాడు ప్రసాద్.

"ఏమో, ఎవరమో మీరే చెప్పాలి" అంది పావని.

"పోనీ నువ్వు ఎవరో చెప్పు..." అని అడిగాడు.

"చెప్పనా... అయామె స్ట్రాంగ్ అండ్ సైలెంట్ లవర్..." అని మృదువుగా అతని చెవిలో చెప్పింది.

"ఎవరా అదృష్టవంతుడు?" అని అతనూ గొణిగాడు.

"ఎవరో ఏమో తెలియదు. నా దగ్గరే ఉన్నారు... నా ప్రియుడు. నా విభుడూ..."

"ఆ ఇద్దరూ ఒక దగ్గరే ఉంటే కష్టమే మరి" అని నవ్వాడు.

"నిజమే. కానీ ఆ ఇద్దరూ ఒకరిలోనే ఉన్నారు గనుక నాకు బాధలేదు..."

"ఎవరా ఒక్కరూ?"

"మీకు తెలియదా?"

"నాకు తెల్సింది నిజమేనన్న మాట! అయినా మీనోట విందామని..."

"మీరే..."

"థాంక్స్. ఇన్నేళ్లూ ఇందుకే, ఇదుగో ఈ క్షణంకోసమే ఎదురు చూస్తూ వచ్చాను. చూశావా, నాకోసం ఎంత ఆనందాన్ని మోసుకొచ్చిందో ఈ ఘడియ..." అంటున్నప్పుడు వెనక నుంచి అతని చెయ్యి ఆమె నడుమును చుట్టేసింది.

"ఇది మన ఏకాంత మందిరంకాదు. కనుక చెయ్యితీస్తే మంచిది" అందామె నవ్వుతూ.

"నేనూ అదే చెప్పాను. వినిపించు కున్నది కాదు ఈ చెయ్యి. అయినా




మనసుకూ, తనువుకూ మధ్య జరిగే ఈ సంఘర్షణ ఈనాటిది కాదు... ఉదాహరణకు ఇప్పుడు ఓసారి ముద్దెట్టుకోవాలని ఉంది. కానీ అదుగో అక్కడ వెయిటర్ ఇటే చూస్తూ ఉన్నాడు..." అన్నాడు.

అతనలా అనగానే ఎందుకో వాడు అక్కడ్నించి లోపలికి వెళ్లాడు.

"పాపం! మీరు వాణ్ణి ముద్దు పెట్టుకుంటారని భయపడినట్లున్నాడు లోపలికి పారిపోయాడు" అంది పావని నవ్వుతూ.

ప్రసాద్ కూడా శృతి కలిపాడు.

భోజనం చేస్తుండగా ప్రసాద్ అన్నాడు. "అన్నట్లు ఇందాకటినుంచీ చెప్పటం మర్చిపోయాను. మీకో మంచి న్యూస్..."

"ఏమిటది?"

"ఇందాక నాకు తెల్సినవాడొకడు కనపడి గుర్తుపట్టి పలకరించాడు... వాడేమో ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేస్తున్నాట్ట..."

"అయితే ఏమిటి?"

"ఏంలేదు, పెళ్ళి శుభలేఖలు అవీ అందంగా అచ్చువేసామండీ, అవసరం ఉంటే చెప్పండి అన్నాడు. అడ్రసు అదీ ఇచ్చాడు. ఇంకనీదే ఆలస్యం..."

"ఏడిసినట్టుంది. ప్రింటింగ్ ప్రెస్‌లో తెల్సినవాడు లేకేనా ఏమిటి పెళ్ళి వెనక్కెళ్ళింది... వెనకటికి ఎవడో అన్నాట్ట.ఒక గుర్రపునాడా దొరికింది... ఇంక మూడు నాడాలు, ఒకి గుర్రమూ దొరకాలి అని. అలా ఉంది"

"అలా ఏంలేదు. నాకు గుర్రం కూడా దొరికింది" అన్నాడతను ఆమె భుజంతట్టి.

"నన్ను గుర్రం అన్నారంటే మర్యాదగా ఉండదు. నేను మిమ్మల్ని గాడిద అనాల్సి వస్తుంది..."

"పెద్ద ప్రమాదమే వచ్చింది. మా ఊళ్ళో ఒకాయన పెళ్లాన్ని కూడా ఏమండీ అనే పిలుస్తాడు. అదేమిటయ్యా పెళ్లాన్ని ఏమే అనలేవా అంటే— అనగలను, కానీ నేను దాన్ని ఏమేవ్ అంటే, అది నన్ను ఒరేయ్ అంటుంది. అందుచేత గౌరవం ఇచ్చి పుచ్చుకుంటుంటాను. అన్నాట్ట..."

భోజనాలు అయ్యాక ప్రసాద్ పావనితో అన్నాడు-

"ఇంక మనం తాంబూలాలు పుచ్చుకుందామామరి?"

"ఓ...దానికేం భాగ్యం? ఒక్కోసారి లంచ్ చేశాక కిళ్లీకొట్టువాడి దగ్గరకెళ్లి తాంబూలాలు పుచ్చుకుంటూనే ఉంటాం" అని లేచింది పావని.

ఇద్దరూ బయటికొచ్చాక అతనుకాసేపు అలా షాపింగ్‌కు వెళ్దాం అన్నాడు.

ఇప్పుడు వీల్లేదని చెప్పి ఆమె ఆటో ఎక్కింది.

అతను అక్కడే ఉండిపోయ్యాడు, చెయ్యి ఊపుతూ.

దార్లోకూడా పావని అతన్ని గురించే ఆలోచిస్తోంది. ఎందుకో అతను ఈకొద్ది పరిచయంతోనే బాగా దగ్గర అయినట్లు అనిపించింది అసలు ఆ వయసే అలాంటిది. మనసులు కలవాలేగాని, ఇంకఎంత దూరానవున్నా, క్షణక్షణం దగ్గర అయినట్లుగానే ఫీల్ అవుతారు.

పావని ఆఫీసుకొచ్చి, సీట్లోకూర్చుని ఫైలు తిరగేసింది. అప్పుడుగుర్తొచ్చింది పెన్ లేదని. ఇంతలో ఫోన్ మోగితేరిసీవ్ చేసుకుంది.

"హలో..."

"నేను పద్మలతను. నువ్వు వచ్చావో లేదో చూద్దామని రింగ్‌చేశాను. అయిందా నీ సిట్టింగ్?"

"ఊ"

"ఎలావుంది ట్యూనింగ్..."

పావని నవ్వుకుంది "ఏదోఉంది. అవే సప్తస్వరాలు. అటు మార్చి, ఇటు మార్చి..."

"పెద్ద గొప్పగా లేదన్నమాట"

"అలా అనేంకాదు. అవునుగాని పెన్‌కావాలి... ఇవ్వగలవా?"

"నీది ఏమైంది?"

"ఎక్కడో వుంది. ప్రస్తుతం కనిపించటంలేదు"

"సరే...నువ్వు వస్తావా, నేరానా?"

"నువ్వేరా... నాకు ఓపికలేదు" అని రిసీవర్ పెట్టేసింది. ఎందుకో చిన్నగా తనలోతనే నవ్వుకుంది.




సాయంత్రం నాలుగున్నర అయింది. పావని చాలా పనివత్తిడిలో ఉంది.

చాలా అర్జంటుఫైలు అది. ఈవేళ వెళ్ళిపోవాలి. పాత జీవోలకోసం పొద్దుటి నుంచీ వెతుకుతుంటే అప్పుడే దొరికాయి. ఆ ఒరిజినల్ జీవోస్ దొరక్కపోతే ఈ వేళరాత్రి ఎన్నిగంటలు అయ్యేదో తెలీదు మొత్తానికి వాటిని ట్రేస్‌చేయగానే లాటరీలో లక్షరూపాయలు దొరికినంత సంతోషంవేసింది. పొద్దుటినుంచీ ఉన్న టెన్షన్ అంతాపోయి, తలంటి పోసుకున్నంత హాయిగా ఉంది.

గబగబా నోట్ రాస్తోంది. ఈ ఫైలు తోసేస్తే ఈవాల్టికి పారిపోవచ్చు. టైం చూసుకుంది. నాలుగూముప్పావు. గబగబా నోట్‌పూర్తిచేసి, పెన్సిల్‌తో రిఫరెన్స్‌లు రాస్తుంటే,పక్కన ఎవరోవచ్చినిలబడ్డారు. మధ్యలో పిళ్లాకళ్లు. ఎక్కడెక్కడినుంచో వచ్చాం, ఇప్పుడు వెళ్ళిపోవాలి, మాఫైలు చూడమంటారు. దాని చరిత్ర అంతా తెలియకుండా ఎలా రాయటం? పైగా ఎన్నో లొసుగులతో పంపిస్తారు. అవి చూడకుండా పంపితేపైనుంచి అక్షింతలు.

"హలో" అన్నాడతను.

అప్పుడు తలెత్తి చూసిన పావని, క్షణంసేపు ఆశ్చర్యపోయింది. "అరె... మీరా? వాటే ప్లెజెంట్ సర్‌ప్రైజ్. రండి.... కూర్చోండి" అంటూ కుర్చీ చూపించింది.

ప్రసాద్ కూర్చున్నాడు.

ఈలోగా ఫోను మోగింది. ఆ ఫైలు తీసుకురమ్మని కబురు.

ఆమెవెళ్లి పై అఫీసరుకు అన్నీ వివరించిచెప్పి ఆ ఫైలు అంతుచూసుకుని వచ్చేటప్పటికి అయిదు అయింది.

"బిజీగా ఉన్నట్లున్నారు?" అన్నాడు ప్రసాద్.

"మాకెప్పుడూ ఇలాగే ఉంటుంది" అని అంటూండగానే సెక్షన్ ఆఫీసర్ కలుగజేసుకున్నాడు.

"మీరు వెళ్ళిపొండి. ఇంక నేను చూసుకుంటాను"

ఆ మాట కోసమే ఎదురుచూస్తున్న పావని బయల్దేరింది.




ఇద్దరూ పోస్టాఫీసుదాకా వచ్చేటప్పటికి మరో బ్లాక్ నుంచి వచ్చిన పద్మలత కల్సింది.

"సేయ్...ఎక్కడికే పరుగు? పిల్లకు పాలివ్వాలా? ఆగు... నేనూ వస్తున్నాను" అంది పావని భుజంమీద చరిచి.

"ష్...ఊరుకోవే. పక్కన ఆయనున్నారు" అంది పావని రహస్యంగా.

పద్మలత ఆశ్చర్యపోయింది. "ఆయనా! మీ ఆయనే? నీకు పెళ్ళి ఎప్పుడైందే, ఆయన్ను వెంటేసుకు తిరుగుతున్నావ్?"

"ఛత్... నోర్ముయ్. జస్ట్ ఫ్రెండ్" అంది పావని.

"నేటి బాయ్‌ఫ్రెండే రేపటి కట్నం లేని భర్త...! గో ఎ హెడ్" అని ప్రోత్సహించింది.

అవుట్ గేట్ దాటి బయటకు రాగానే అతను ఆటో ఎక్కాడు. ఆమె అతని పక్కన కూర్చుంది. ఆటో బయల్దేరింది.

"మిమ్మల్ని చూడాలనిపించింది.... వచ్చాను" అన్నాడు ప్రసాద్.

"మీరు వస్తే బావుండునని నాకూ అనిపించింది. అనిపించగానే వచ్చారు" అంది పావని కూడా నవ్వుతూ.

"అలా అనిపించినప్పుడో సారి ఫోనులో పలకరించకపోయినారా?" అన్నాడతను మృదువుగా ఆమె చేతి గాజుల్ని మీటుతూ.

కొద్దిసేపటి తర్వాత వాళ్ళిద్దరూ అతని హోటల్ రూంలో ఉన్నారు. బాయ్‌ను పిల్చి కూల్‌డ్రింక్స్ ఆర్డర్ ఇస్తే, లేదు కాఫీ మాత్రమే తాగుతానని చెప్పింది

"ఏం...కూల్‌డ్రింక్స్ ఇష్టంవుండదా?" అని అడిగాడు.

"ఇష్టంలేకకాదు. ఐస్‌క్రీం కూడా తినను. గొంతు దెబ్బ తింటుంది"

"అదేమిటి? ఆరోజు మీ ఇంటి దగ్గర కూల్‌డ్రింక్ తాగారుగదా! కొంపతీసి గాయకురాలివా ఏమిటి?" అని ఆశ్చర్యపోయాడు.

"నేను గాయనినేగాని, ఎవరి కొంపా తీయలేదు" అందామె.

"ఇంతవరకూ నాకా విషయం చెప్పకపోవటం దారుణం. మీరు పాడాలి. నేను వినాలి. అంతవరకు విడిచిపెట్టను"

"అలాగే ఇంకో గంటలో ఎలాగూ రవీంద్రభారతిలో నేను పాడబోతున్నాను. మీకు వేరే పనేమీ లేకపోతే మిమ్మల్ని తీసుకెళ్ళాలనే అనుకున్నాను"

"ఓహో..ప్రోగ్రామ్స్‌కూడా ఇస్తున్నారన్నమాట. అన్నీ నేను అడిగితేనేగాని చెప్పరన్నమాట"

"ఎందుకు చెప్పను? నా జీవితంలో నేను గర్వంగా చెప్పుకోగలిందేమన్నా వుంటే ఇదొక్కటే. నారున్న ఇన్ని సమస్యలనూ నిర్లక్ష్యంచేసి, మొండికెత్తి తిరుగుతున్నానంటే దానికి కారణం పది మందిలో పాడాలన్న ఆశ ఒక్కటే..." అని ఆగిపోయింది పావని. ఆమె మనసులో వీస్తున్న భావవీచికల తాలూకు ఛాయలు మొహంలో స్పష్టంగా కనిపిస్తూ వున్నాయి. అది గమనించి ప్రసాద్ అన్నాడు.

"కళాకారుల జీవితం వడ్డించిన విస్తరి కాదు. వాళ్ళకు ఎదురయ్యే సమస్యలు మిగిలిన వాళ్ళకు చెప్పినా అర్థం కావు"

"అర్థం చేసుకోగలిగినవాళ్ళు దొరికితేనే తప్ప వాళ్ళు ముందంజవేయలేరు" అని చెప్పింది పావని.

ఆమాట అతనూ ఒప్పుకున్నాడు.

రవీంద్రభారతిలో ఒక సాంస్కృతిక

సంఘంవాళ్ళు ఏర్పాటుచేసిన కార్య క్రమంలో పావని రెండు పాటలు పాడింది సహజంగానే మధురంగా పాడగల పావని, ఆవేళ అమితమైన పారవశ్యంతో పాడింది. తానే రాధగా, అతనే కృష్ణుడుగా భావించుకుని రసరమ్య లోకంలో విహరిస్తూ తాదాత్మ్యం చెంది పాడింది. ఆ కాసేపూ పరిసరాలనే కాదు... తనను తానే మర్చిపోయింది.

అందరితో పాటు అతనూ చప్పట్లు కొట్టడంచూసి ఎంతో గర్వంగా ఫీలయింది.

తన ప్రోగ్రాం అయిపోగానే ప్రసాద్‌తో కల్సి ఇవతలకు వస్తుంటే, ఆరోజు ఆఫీసు దగ్గర రేడియో పాటకు కంగ్రాట్స్ చెప్పినతను ఎదురై సమస్కారం పెట్టాడు.

"ఇవాళ ఎక్స్‌లెంట్‌గా పాడారండీ" అన్నాడు శేఖర్ మనస్ఫూర్తిగా.

"థాంక్స్" అంది పావని.

"అప్పుడే వెళ్ళిపోతున్నారా?"

"అవునండీ. కొంచెం పనుంది"

"ఆటో తీసుకురమ్మంటారా? నేనూ అటే ఉంటున్నాన్లెండి. అయినా మీతో ఆటో ఎక్కనులెండి"

"అక్కర్లేదండి. మేం వెళ్ళగలం" అందామె.

"మంచిది. ఉంటానండి" అని మళ్ళీ సమస్కారం పెట్టాడు.

పావని, ప్రసాద్ ఇద్దరూ నడుచు కుంటూ కళాభవన్ వైపు మెట్లుదిగివచ్చారు

"అతనెవరు?" అని అడిగాడు.

"ఒక అభిమాని! నేను కనిపించి నప్పుడల్లా అలా అనవసరంగా బాగా పాడారండీ అంటాడు" అని నవ్వింది.

"అయినా నీవింత బాగా పాడగలవని నేను అనుకోలేదు" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

"మీరింత మంచి గానప్రియులని నేనూ అనుకోలేదు. గట్టిగానే చప్పట్లు కొట్టారు"

"నేను ఇకనుంచీ నీ ఫాన్‌ని"

"ఫాన్‌తో వేసవి కాలంలోనే ఉప యోగం"

"ఈ ఫాన్‌తో అన్ని కాలాల్లోనూ ఉపయోగమే" అన్నాడు భావగర్భితంగా చూస్తూ.

"ఏమిహెహాండి" అని మధురంగా కసురుకుంది పావని.

అతని రూంకు వెళ్ళారు. భోజనం చేశారు.

కాసేపు కబుర్లతో కాలక్షేపం చేశారు.

"వైజాగ్ వెళ్ళాక, అక్కడి కల్చరల్ అసోసియేషన్‌తో సంబంధాలు పెట్టు కోవాలి నేను" అన్నాడతను.

"దేనికి?"

"నీవు అక్కడికి వచ్చాక అడపా దడపా ప్రోగ్రామ్స్ ఇవ్వాలిగదా"

"అప్పుడే అంతదూరం వెళ్లారా?" అని నవ్వింది వెన్నెలకన్నా హాయిగా.

తనను మెచ్చుకోటమేగాక, తన సంగీతాన్ని మెచ్చుకుని, తగినంత ప్రోత్సాహాన్నిచ్చే వ్యక్తి దొరకటం నిజంగానే పూర్వజన్మ సుకృతం.

"ఎవరేమన్నాగాని, ఎదురేమున్నాగాని ప్రేమించుకుందాం, పెళ్ళి చేసుకుందాం- అని ఇందాక పాడావు చూశావా, అంత గాఢంగానూ ప్రేమించుకుని పెళ్ళిచేసుకుని పెనవేసుకుందాం"

"అయ్యబాబోయ్" అంది పావని ఆశ్చర్యాన్ని అభినయిస్తూ.

"పోనీ. అవన్నీ నాకొదిలెయ్యి"

"మరి నేవెళ్తాను...బాగాలేటయింది"





అని లేచింది పావని.

"పోనీ, ఈ రాత్రికిక్కడే ఉండిపో కూడదూ?" అన్నాడు

"ఇంకానయం? అదయినా మీరు మరీ బలవంతం చేస్తున్నారు కాబట్టి ఇలా వచ్చి ఇంతసేపున్నాను"

"ఉంటానంటే ఇంకా బలవంతం చేస్తాను"

''ఇంకా ఉంటే నిజంగానే బలవంతం చేసినా చేస్తారు. వెళ్ళిపోతాను" అంది నవ్వుతూ- అద్దం ముందు నిలబడి దువ్వెనతో పైపైన జుట్టు దువ్వుకుంటూ.

"నీవెళ్ళిపోతే ఒక్కసారిగా చీకటి చుట్టేసుకుంటుంది.కంటికేమీ కనిపించదు. చాలా అవస్తపడతాను"

"అవస్త ఏముంది? హాయిగా నిద్ర పొండి"

"నిద్ర రాదుగదా ...కన్ను మూత కూడా పడదు"

''ఇదేదో కంటి జబ్బే. డాక్టర్ని సంప్రదించండి"

"సంప్రదిస్తే, పావనిని నిలువెల్లా చూస్తూ కూర్చుంటే కంటికి, వొంటికీ, ఇంటికి మంచిదంటాడు ... అందుచేత నన్ను కనికరించి ఉండిపో''

"ఆ పప్పులేం ఉడకవులెండి" అంది హేండ్‌బ్యాగ్ తీసుకుని.

''పోనీ రేపు పొద్దున్నే నిద్దర లేచే టప్పటికి వచ్చేస్తావా?"

''నాకు వేరే ఉద్యోగం ఉంది"

"రాజీనామా చేసి పడెయ్ రేపే... నిజంగానే సీరియస్‌గానే చెబుతున్నా, రేపే రాజీనామా ఇచ్చేసెయ్. వచ్చి నా దగ్గర ఇల్లాలి పోస్టులో చేరిపో. రేపు దశమి, బుధవారం, దివ్యంగా ఉంది''

''జీతం ఎంతిస్తారు?''

''కాఫీలు, టిఫిన్లు, భోజనాలు చీరలు, నగలూగాక ముద్దూ ముచ్చటా చెల్లించి అన్నివిధాలా సంతోషపెడతాం"

"ఇంక్రిమెంట్స్ ఉండవా?'' అని అడిగింది అమాయకతను తెచ్చిపెట్టుకుని.

''భలేదానివే. కష్టపడి పని చెయ్యాలే గాని ఈజాబ్‌లో ఏడాదికో బాబు చొప్పున ఇంక్రిమెంట్స్ దొరుకుతాయి. ఇంకా కష్టపడితే డబుల్ ఇంక్రిమెంట్స్ కూడా లభిస్తాయి...కనుక రేపే దానికి రిజైన్ చేస్తున్నావు. మన దగ్గర జేరుతున్నావు. ఓకే?...''అని అంగీకారం అడిగాడు.

"మీ ఉద్యోగంలో చేరటానికింకా టైముందిగదా ... అంతవరకూ ఈ ఉద్యోగంలో ఉంటే నష్టమేమిటి?" అని అడిగింది పావని.

"నీ ఉద్యోగాన్ని, నిన్నూ నేను స్వయంగా చూశాను. ఆ వెధవ చిత్తు కాగితాల ఫైళ్ల మధ్య తలదూర్చి చెమటలు కక్కుకుంటూ ఆ డబ్బైన ఆఫీసర్ వెధవల వద్దకి పరుగులు తీయటం నాకు నచ్చలేదు. వేరే దారి లేనప్పటి సంగతి వేరు. ఇప్పుడు నీకా అవసరం లేదు. నేను వచ్చే నెల్లో వచ్చి,నిన్నెలాగూ తీసుకుపోతాను. అంతకన్నా ఎక్కువ కాలం ఈ విరహతాపంలో వేగలేను. ఈ నెల రోజులకీ మహా అయితే ఓ వెయ్యి రూపాయల జీతం వస్తుందేమో! నీకు కావాలంటే నాలుగువేలు నేను ఇచ్చి వెళ్తాను...నీక్కావల్సినవన్నీ కొనుక్కో, రెస్ట్ తీసుకో. పత్రికలు చదువుకో, ఫ్రెండ్స్‌తో సినిమాలకు వెళ్ళు, హాయి హాయిగా సరదాగా ఈ నాలుగువారాలూ ఖాళీగా గడుపు. అన్నట్లు....నీకింకో పని కూడా వుంది. నేవెళ్ళిన మర్నాటినుంచీ రోజూ పది పేజీల ప్రేమలేఖ రాయాలి.

 

ఈ వియోగం మన విరహాన్ని పెంచుతుంది. అప్పటి ఉత్తరాలే మనకు కొంత ఉపశమనాన్ని కలిగిస్తాయి. ఆఫీసులో నీ ఫైల్సులో మొక్కుబడి రాతలతో ఈ తిరిగిరాని అమూల్యమైన సమయాన్ని వృధా చెయ్యకూడదు...అదీ ముష్టి వెయ్యి రూపాయల కోసం. నీ ఒక్కో ఉత్తరం ఒక్కో మధుర గీతాలాపనగా నాకు వినిపించాలి. ఇకనుంచీ ఎప్పుడు చూసినా, నువ్వు అప్పుడే విరిసిన తాజా రోజాలా ఉండాలే తప్ప వాడిపోయిన పువ్వులా సాయంత్రానికి నీరసంగా గూటికి చేరటం నాకెంత మాత్రం నచ్చలేదు ... ఏమంటావు?"

"మీ ఆవేశం చూస్తుంటే నవ్వొస్తోంది" నవ్వింది.

"ఇది ఆవేశం కాదు. నా పావని ఇకనుంచీ ఏమాత్రం కష్టపడరాదన్న ఆకాంక్ష. చూడూ... ఈ నెలరోజులూ బాగా రెస్ట్ తీసుకో... పాలూ, పళ్ళూ, పుష్టికరమైన ఆహారం, బలవర్ధక టానిక్‌లూ పుచ్చుకో. తర్వాత రెండు నెలలపాటు బిగిసిన కౌగిళ్ళలో ఊపిరాడుతుందో లేదో" అన్నాడతను.

"చాల్లే ఊర్కోండి'' అంది మధురాతి మధురంగా మందలిస్తూ.

రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో పావనిని ఆటోలో తీసుకెళ్ళి ఇంటి దగ్గర దింపేసి వచ్చాడు.

* * *

మర్నాడు పావని సంతకం చేసివచ్చి సీట్లో కూర్చున్న అయిదు నిమిషాలకే ఫోను మోగింది.

"శుభోదయం..ఏమిటింత పొద్దున్నే?" అని అడిగింది.

"ఇంత పొద్దున్నే అంటున్నావా? ఇప్పటికి అరడజనుసార్లు ఫోను చేశాను. నేను ఉన్నంతసేపూ హాయిగా మనం కల్సి ఉండకుండా ఏమిటిది? ఇంతకీ నువ్వు రాజీనామా కాగితం వాళ్ళ మొహాన పారేశావా లేదా?"

''లేదు"

"ఏమిటాలస్యం?"

''దేనికంత తొందర?"

"సరిపోయింది. రామాయణం అంతా విని రాముడికి సీత ఏమవుతుందని అడిగారట...అలా వుంది''

''ఇప్పుడే ఇస్తాను అయితే"

''ఇచ్చి మరో అరగంటలో వచ్చేయ్''

''అలా కుదరదు. రిలీవ్ చెయ్యాలి గదా''

"అదంతా నాకు తెలియదు. పన్నెండు గంటలకు నువ్వు నాదగ్గరకువచ్చెయ్యాలి"

"లాభం లేదు...రెండుగంటలు దాటాల్సిందే"

''సరే...ఎలాగో రెండు గంటలదాకా వెయిట్ చేస్తాను. రాకపోతే రెండు గంటలా అయిదు నిమిషాలకు ఈ ఊరి నుంచి వెళ్ళిపోతాను" అన్నాడు ప్రసాద్.

ఫోన్ పెట్టేసి ఎదురుగా ఉన్న ఫైలు తీసుకునేటప్పటికి శాంత వచ్చింది.

"ఏవమ్మా పెళ్ళికూతురా... ఏమిటి నల్లపూస అయిపోయ్యావ్'' అంది.

''అదేమిటి?...ఆ కొత్త సంబోధనేమిటి?" అని నవ్వింది పావని.

''ముందు నువ్వు సీట్లోంచిలే" అని లేవదీసుకు వెళ్ళింది.

కాఫీ హౌస్‌లో శాంత చాలా వివరాలు లాగింది. వాటికి వెంటనే బహుళ ప్రచారాన్ని ఇచ్చింది.

అక్కడివాళ్ళంతా ఆశ్చర్యపోయారు.

''మీరు మాకు పార్టీ ఇస్తారా, మేం

మీకు పార్టీ ఇవ్వాలా?" అని అడిగారు.

"నేనే ఇస్తాను "అంది పావని.

లంచ్ టైంలో కాంటీన్ టిఫిన్ చేసి, పాత బిల్డింగ్ వెనకాల లాన్‌లో కూర్చు న్నారు పావని, పద్మలత, శాంత, మరో ఇద్దరు కొలిగ్స్.

"ఉన్నట్లుండి నిన్న నువ్వు మమ్మల్ని వొదిలేసి ఆయనతో ఆటోఎక్కగానే, పెద్దకుట్ర జరిగిపోయిందని మేం గ్రహిం చేశాం!కానీ ఇంతఅకస్మాత్తుగా పెళ్ళికబురు వింటామని మాత్రం గ్రహించలేక పొయ్యాం" అంది పద్మలత.

"ఏదో అనుకోకుండా అలా జరిగి పోయింది" అంది పావని.

"పోన్లే ఇప్పటికన్నా చెప్పావు. ఏడాదితర్వాత పిల్లను చంకనేసుకొచ్చి పరిచయం చేయకుండా ఈమాత్రం ముందైనా చెప్పావు" అంది శాంత.

"ఇంతకీ నీవుడ్‌బీకి ఎన్నేళ్ళసర్వీసు?" అని అడిగింది పద్మలత.

"పర్మినెంట్‌గానే చేసుకుంటున్నావా, లేక ఉద్యోగంలోలాగే అర్నెల్ల తర్వాత ఖాయం చేయదల్చుకున్నావా ?" అని నిలదీసింది శాంత.

"నోర్మూయ్యండే" అని కోపంగా మందలించింది పావని.

"ఏంతల్లీ... మామీద జోక్‌లువిసిరి నప్పుడేమైందీ కోపం?" అని గుస్సేసింది పద్మలత.

"అవునే ... మనమీద ఈ కోపం, ఆ రాబోయే ఆయనమీద తాపం...ఇవన్నీ పెళ్ళిజబ్బు లక్షణాలేనే" అంది శాంత.

"పొండే, ఆజబ్బులో ఎంత ఆనందం ఉందో అది అనుభవించేవాళ్ళకిగాని తెలియదు" అని లేచింది పావని.

"ఏమిటా ఆత్రం? కూర్చో" అని గదిమింది మరో ఫ్రెండ్.

"దీని తొందరచూస్తే పెళ్ళికిముందరే శోభనం కానిచ్చేటట్లుంది. తర్వాత తీరిగ్గా పెళ్ళిచేసుకోవచ్చని..." అంది. పద్మలత

"నేనంటే ఏమనుకున్నారే? నిప్పు... నిప్పు" అని గుస్సేసింది పావని.

"నువ్వు నిప్పు కాదని ఎవరన్నారే? కాకపోతే హోటల్‌రూమ్స్‌లో నీళ్ళు ఉంటయిగదా... ఏమయిపోతావోనని" సందేహం వెలిబుచ్చింది శాంత.

"ఎంతనిప్పు అయినా, నీళ్ళు జల్లితే మాడి బొగ్గయిపోవల్సిందే..." అని మరొకరి కామెంట్.

పావని టైంచూసుకుంది. రెండుగంట లైంది. మళ్ళీకలుస్తాననిచెప్పి బయల్దేరింది.

బయటకువస్తూ అనుకుంది. తనకు ఈ బిల్డింగ్స్‌తో, ఈ మనుషలో రెండేళ్ళ అనుబంధం. అదిప్పుడు తీరిపోతుంది... మళ్ళీ ఎప్పటికైనా తను ఇక్కడికి వస్తుందా?

ఈసారి వచ్చేటప్పటికి బహుశా ఈ కొత్తబిల్డింగ్స్ పూర్తయి కళకళలాడు తుంటాయి. ఇప్పుడు నిత్యంచూస్తున్న ఎన్నో మొహాలు మరీముసలివైపోతాయి. కొన్ని రిటైరయిపోతాయి. మరికొన్ని ఈ లోకంనుంచే రిటైరుకావచ్చు. ఇన్నాళ్ళూ ఇది తన ఆఫీసులని, ఇక్కడ తనకూ ఒకస్థానం ఉందని అనుకుంటూ రోజూ వస్తూపోతూ ఉండేది. కానీ ఇంత దుర్బల మైనదా ఈఅనుబంధంఅనిపిస్తోందిప్పుడు.

ఏదో కనిపించని బంధాన్ని బలవం తాన తెంచుకోవాలంటే ఎంతోబాధ అని పించింది. చిత్రం ఏమిటంటే-ఇంటినుంచి దూరంగా వెళ్లాలంటే ఎలాంటిబాధా లేదు మరి ఆఫీసునుంచి వెళ్లటానికి ఇప్పుడిదే మిటి?




హోటల్ రూంముందు నిలబడి బెల్ కొట్టగానే, ప్రసాద్ తలుపుతీసి ఆమెను చూసి ప్రైంచూసుకుని...

"పావుగంట లేటు" అన్నాడు.

అతని నోట్లోనించి ఏదో వాసన గుప్పుమంది!

"నేనురావటం లేటయితే వెళ్లిపోతా మన్నారుగా అందుకేలేటు" అంది దరహాసాన్ని దాచుకుంటూ.

"వెళ్లిపోవాలని ప్రయత్నించాను. కానీ అది సాధ్యంకాదని తెల్సిపోయింది. నీకోసం ఈ జీవితమంతా ఈ హోటలు గదిలోనే ఎదురుచూస్తూ గడపాలని పిస్తోంది..."

"అయితే మీ నిరీక్షణకు అడ్డొచ్చిన ట్లున్నాను. వెళ్ళిపోతాను..." అంది టేబిల్ మీది ఖాళీగ్లాసూ, సగంఖాళీసీసా చూస్తూ.

"నా నిరీక్షణే నీకోసంగదా...నువ్వు వెళ్ళిపొయ్యావంటే పగటిపూట కూడా చీకట్లోతడుముకోవాల్సి వస్తుంది..."

"చాల్లెండి. కబుర్లకేం తక్కువలేదు"

"అంటే నీ ఉద్దేశం? కబుర్లుచెప్పటం తప్ప మరేమీ చేతకాదనా?"

"అనినేను అనలేదు. మీరే అనుకుం టున్నారు..."

"కావాలంటే ఇప్పటికిప్పుడే రుజూ చేయగలను. కానీ చెయ్యను. ఎందుకంటే మనం వీరప్రేమికులం. కమాన్...."

అంటూ పావని చెయ్యిపట్టుకు లాగాడు ప్రసాద్.

"చెయ్యివదలండి. నొప్పెడుతుంది"

అని చేతిని వదిలించుకుంది.

"రా మరి"

"ఏమిటి మీ ఉద్దేశ్యం?" అని నిలదీసింది పావని.

"నా ఉద్దేశం నీకు నిజంగా తెలియ కనే అడుగుతున్నావా?"

"తెలియక కాదు. నేను కలగంటు న్నానా, మేలుకునే ఉన్నానా అని రూఢి చేసుకునేందుకు అడుగుతున్నాను"

అన్నది పావని లేచి నిలబడి.

"కల నిజమవుతోంది ప్రేయసీ..." అంటూ ప్రసాద్ వెనకనుంచి వచ్చి ఆమెను కౌగలించుకున్నాడు. పావని విసుక్కుంది. క్షణంసేపు విలవిల్లాడి విడిపించుకుంది.

"నాకిది నచ్చదు" అందామె.

"ఏది నచ్చదు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఈ విచ్చలవిడితనం..."

"మరి నేను రమ్మనగానే ఎందు కొచ్చావు? నువ్వూ నేనూ వయస్సులో ఉన్నాం. ఈ గదిలో కావల్సినంత ఒంటరి తనం. పైగా మనసు నిలువనీయని ప్రణయోద్వేగంలో ఉన్నాం. అందుకే గదా నువ్విక్కడికి వచ్చావు. మరి నచ్చ దంటావేం?"

"అయితే మీరు చాలా పొరపాటు పడ్డారు. మీరు నన్ను పెళ్ళిచేసుకుంటా మన్నారు. ఈపెళ్ళి విషయంలో పెద్దలు జోక్యం చేసుకోవడం లేదు. మనమే స్వయంగా నిర్ణయించుకుంటున్నాం కనుక జీవితానికి సంబంధించిన ప్రధానమైన నిర్ణయం తీసుకోబోయేముందు, ఏకాం తంగా కల్సుకుని మనసువిప్పి మాట్లాడు కుని, ఆమాటలను చేతల్లోకి మార్చుకో గల ధైర్య సాహసాలను పరస్పరం ఇచ్చి పుచ్చుకునే అవసరం మనిద్దరికీ ఉంది. నేను ఆ పనిమీదే వచ్చాను"

"పెళ్ళి అంటే ఏమిటి? ఇద్దరి మనుషుల కలయిక"





''అదీ తప్పే. ఇద్దరి మనుషుల కలయిక కాదు. ఒక స్త్రీ, ఒక పురుషని కలయిక. శారీరక అను బంధాని కన్నా ముందు మానసిక అనుబంధం ఏర్పడటం అవసరం. కనుకనే పెళ్ళికి ముందు ప్రేమ కావాలంటున్నారు ఈనాటి మనబోటి వాళ్ళు"

"నేను అంటున్నదీ అదే" అని నొక్కి చెప్పాడు ప్రసాద్.

"మీరు కావాలని అంటున్నది పెళ్ళికి ముందే సెక్స్. నేను కోరుకున్నది పెళ్ళికి ముందు ప్రేమ. నా దృష్టిలో ప్రేమకీ, సెక్స్‌కీ తేడా ఉంది"

''నేను నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పానుగదా''

"చెప్పటానికీ, చేసుకోవటానికీ మధ్య బోలెడు తేడా ఉంది. చేసుకునేంతవరకూ ఆగాలని మాత్రమే నేను కోరుకుంటు న్నాను"

"అంటే నామీద నమ్మకం లేదన్న మాట..."

"మీమీదేకాదు, నామీదే నాకు నమ్మకం లేదు. పరిస్థితులు భవిష్యత్తును ఎటు మలుపు తిప్పుతాయో మనకు తెలియదు. అసలే నేను ఏమీలేని నిరుపేదను. ఉన్న ఒక్క శీలాన్ని కూడా పోగొట్టుకుని మరీ దౌర్భాగ్యురాల్ని కాలేను"

"నీ అభిప్రాయాన్ని నేను అభినందిస్తు న్నాను. కానీ నువ్వు చాలా వెనకబడి ఉన్నావు. అమెరికాలో ఇప్పుడు ప్రతి వాళ్లు సెక్స్ బిఫోర్ మేరేజ్‌ను కోరు కుంటున్నారు. నువ్వింకా ఈ పాతబడిన నియమాలకు కట్టుబడి ఉండటం ఏమంత సబబు...?"

"అమెరికాకు, ఇండియాకు చాలా వ్యత్యాసం ఉంది. పాము నేలమీద పాకి నంత సహజంగా, వేగంగా పురుషుడు

స్త్రీ మీదకు పాకుతుంటాడక్కడ. ఆ విశృంఖలత నాకు బొత్తిగా నచ్చదు. ఇక్కడి మన కట్టుబాట్లు ఆడదానికో రక్షణను, భద్రతనూ కల్పిస్తున్నాయి..."

"ఇక్కడమాత్రం ఏం తక్కువ? ఈరోజుల్లో ఆడపిల్లలు ఇంటికెళ్లిపడుకుం టున్నారో, పడుకుని ఇంటికొస్తున్నారో తెలియటం లేదు"

"చాలా సంతోషం మామీద మీకెంత గొప్ప అభిప్రాయం ఉందో మీమాటల్ని బట్టి తెల్సింది. నేనూ ఈ కాలపు ఆడ పిల్లనేగాని... మూడు తరాల ముందటి ముసలమ్మనుగాను. కనుక మీ మాటలు నాకూ వర్తిస్తాయి. నిజానికి మీకన్నా ఎక్కువ ఉద్రేకం, ఉద్వేగం నాలోనూ ఉన్నాయి. కానీ ముందు వెనకలు చూసు కోకుండా తొందరపడితే, రేపు అందరి ముందరా తిరగలేక, విషం మింగి చావాల్సి వస్తుందని కూడా నాకు తెలుసు"

"నీ వెర్రి మొర్రి ఆలోచనలతో ఇంత అద్భుతమైన అవకాశాన్ని పాడుజేస్తు న్నావు. నన్ను నిరాశ పరుస్తున్నావు"

"మగవాడెప్పుడూ ఆ అద్భుతమైన అనుభవం కోసం ఆరాటపడతాడు. ఎందు కంటే ఆ అనుభూతి తాలూకు అనంతం అతనికి దక్కేటందుకున్న సాక్ష్యాధారాలు కూడా లోకానికి దొరకవు. ఆడదాని సర్వస్వాన్ని దొంగలా దోచుకుని ఏ చట్టానికీ, శాసనానికీ, కోర్టుకూ అందకుండా పారిపోయే పెద్దమనిషి అతను. ఓ బలహీనమైన క్షణంలో తనువూ, మనసూ చేసిన తొందరకు తట్టుకోలేక లొంగి పోయి, మగవాడి ప్రార్థనను మన్నించి నందుకు, సమాజం ఆమెను మాత్రం ఒక జీవితకాలంపాటు శిక్షిస్తుంది. ఇంక ఆ తరుణి తెగిన గాలిపటంలా ఎటు కొట్టుకు పోతుందో తెలీదు. అందుకనే నాకింత ఆలోచన... ఇంత వెనుకంజ"

"నన్ను చాలా చక్కగా అర్థం చేసు కున్నావు. నిన్ను కోరుతున్నాను అదాని మహా బెట్టుసరి చేస్తున్నావు. అదే కావా లనుకుంటే, వంద రూపాయలు పారేసి ఇంతగా ఊరిస్తున్న ఆ అందమైన అనుభవాన్ని నేను పొందలేనా?"

"వచ్చు. కానీ నేను డబ్బుకు అమ్ముడు పొయ్యేదాన్ని కాదు. ప్రేమిస్తున్నానని చెబితే నిజమే కాబోలు అనుకుని ఈ మాత్రం చొరవనైనా ఇచ్చాను. అంతేకాని మా పేదరికాన్ని అలుసుగా తీసుకుని ఆశలు కల్పించి, పబ్బం గడుపుకుపొయ్యే పెద్దల వలలోకి నడిచివెళ్ళే దుర్బలత్వం మాత్రం నాకు లేదు"

"ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నావు" అన్నాడు ప్రసాద్ కోపంతో ఊగిపోతూ. "నన్ను ఇలా అవమానపరిచినందుకు నిన్నేం చేయాలి?"

"నేను అవమానపరిచాననే ముందు మీరు నన్నెంత గాయపరిచారో ఆలోచించ రేం! వారంరోజుల కిందటి వరకూ మీ మొహం నాకు తెలియదు. నా మొహం మీకు తెలియదు. ఎవర్నో పెళ్ళికూతుర్ని చూడటానికి వచ్చి దార్లో ఎదురైన నన్ను చూసి, 'నిన్నే ప్రేమించాను' అన్నారు. పెళ్ళి చేసుకుంటానని అన్నారు. మీ డబ్బునీ, హోదాని, తీయని మాటల్ని చూసి మతిపోయి మిమ్మల్ని వాటేసు కుంటాననుకున్నారు. కాటేసి వెళ్ళిపోవచ్చు ననుకున్నారు. కానీ దేవుడు నాకు ఏం ఇచ్చినా, ఇవ్వకపోయినా విచక్షణాజ్ఞానం ఇచ్చాడు. దాని సాయంతోనే మీరెవరో, ఎలాంటివారో తెల్సుకున్నాను.. వస్తాను" అని లేచింది పావని.




విసురుగా వెళ్ళబోయిన ఆమెను ఆపటం కోసం ప్రసాద్ చటుక్కున ఆమె చెయ్యి పట్టుకులాగాడు.

పావని నేత్రాలనుండి నిప్పులు కురవ బోతుండగా తీవ్రంగా,

"మర్యాదగా చెయ్యి వదులు. లేకపోతే పళ్ళు రాలగొడతాను" అన్నది బుసలు కొడుతూ.

"నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు..."

"చాలు, నిన్ను నేను బాగానే అర్థం చేసుకున్నాను. నీ మాయమాటలకు మోసపోయి మంచంమీద వాలిపోయేవాళ్ళు ఇంకెవరన్నా వున్నారేమో చూసుకో" అని రుసరుసా గదినుంచి బయటకు వచ్చేసింది.

పిడి ఇచ్చకోలు మాటలు విని ఇప్పటికే తను నిక్షేపంలాంటి ఉద్యోగాన్ని వదులుకోబోయింది. పైగా పెళ్ళి చేసుకోబోతున్నట్లు గర్వంగా అందరికీ చెప్పి వచ్చింది. మళ్ళీ ఏ మొహం పెట్టుకుని వాళ్ళ మధ్యకు వెళ్తుంది?నింగిలోని నల్లమబ్బును నమ్ముకుని ముంతలోని నీళ్ల పారబోసుకోబోయినట్లు అయింది తనపని.



3

కుటుంబరావుగారు బాగా బతికిన రోజుల్లో మీసాలకు సంపంగినూనె రాసిన మనిషే. ఖరీదైన అలవాట్ల వల్లనే ఇప్పుడు బాగా చితికిపొయ్యాడు.రంగు వెలిసిన బొమ్మలా అయిపొయ్యాడు. సంపెంగనూనె కొనలేక ఈమధ్యనే మీసాలు తీసేశాడు. కానీ రక్తంలో జీర్ణించుకుపోయిన అలవాట్లు మాత్రం ఆయన్ను వదల్లేదు.

వొళ్ళొంచి పనిచేయడానికి ఆయనకు ససేమిరా మనసొప్పదు. అసలాయనకు తాను సుఖపడటానికే పుట్టానన్న దృఢమైన నమ్మకం చిన్నప్పట్నించీ వుంది. ఏదో కాలం కల్సిరాక ఆస్తంతా హారతి కర్పూరంలా హరించుకుపోవచ్చుగాక. అంతమాత్రాన, ఇంత బతుకూ బతికి ఇంటి వెనకాలే చచ్చినట్లు, ఇన్నేళ్ళు వచ్చి ఇప్పుడు మరొకడి చేతికింద పనిచేయటం ఎంత కష్టం?—అనుకుంటాడాయన.

అలాఅని ఆయన ఊరికే కూర్చోవటం లేదు. వారాంతాల్లో గుర్రపు పందేలకు వెళ్తాడు. ఉన్నదంతా అక్కడే పోగొట్టుకున్నాడు కాబట్టి, ఎప్పటికైనా తిరిగి అంతకు పదింతలు అక్కడే సంపాదించి తెస్తానన్న నమ్మకం ముమ్మరంగా ఉంది. కానీ వెధవది కాలం కల్సిరావటం లేదు. ప్రతిసారీ వెంట్రుక వాసిలోనే పోతోంది. ఏదో ఒకరోజున ధనలక్ష్మి వెతుక్కుంటూ వచ్చి తన వళ్ళోనే వాలుతుంది గ్యారంటీగా. అయితే ఎప్పుడొస్తుందో తెలీదు, అంతే!

అందాకా కాలక్షేపానికి అన్నట్లు ఆయన పేకాడతాడు. చిల్లర వెధవలతో ఆడటం ఇష్టముండదు. పెద్దలతో క్లబ్‌లో కూర్చుని ఆడితేనేగాని దాని గొప్పదనం తెలీదు.

ఇన్ని చికాకులతో రోజంతా గడిపాక సాయంత్రానికి కొంచెం సురాపానం పుచ్చుకోకపోతే పిచ్చెక్కిపోతుంది.

ఈ ఖర్చులన్నిటికోసం ఇంట్లో ఉన్న

చిల్లిచెంబు దగ్గరనుంచీ అమ్మేసిన గొప్ప తాత్వికుడాయన. కొనేవాళ్లుంటే భార్యాబిడ్డల్ని చౌరాస్తాలో నుంచోబెట్టి వేలం పాడగలడు. ఇదంతా మాయామేయ జగంబు అంటాడు పైగా.

ఇంతాచేసి ఇవాళ్టి పరిస్థితి ఏమిటంటే పావని జీతంమీద సంసారం నడుస్తోంది.

పెళ్ళికి ఎదిగిన పిల్ల.ముద్దూమురిపెం, అచ్చటముచ్చటా ఏమీలేకుండా నిర్లిప్తంగా రోజులు నెట్టుకొస్తోందన్న విషయాన్ని తల్లిదండ్రులు గుర్తించినట్లే కనబడరు. కానీ పావని పెళ్ళిచేసుకుని తన దోవన వెళ్ళిపోతే చెర్లోనుంచి బయటపడ్డ చేపల్లా గిలగిలలాడాల్సిందేనన్న వాస్తవాన్ని మాత్రం వాళ్లు విస్మరించలేకుండా ఉన్నారు.

అందుకే ఎవరయినా కూతురి పెళ్ళి గురించి ప్రస్తావన తెచ్చినప్పుడు కుటుంబరావుగారుచెప్పే మాటలు ఆయనమీద జాలిని, సానుభూతిని కలిగిస్తాయి.

"పిల్లను ఒక అయ్యచేతిలో పెట్టాలని నేనుపడే తపన అంతా ఇంతా కాదు. కాళ్ళ చెప్పులు అరిగేలా తిరుగుతున్నానేగాని, దాని నెత్తిన అక్షింతలుపడే ఘడియ కల్సి రావటంలేదు. మొగాడైపుట్టి, మెళతాడు కట్టిన ప్రతివాడూ హీనపక్షం పదివేలన్నా తెమ్మంటున్నాడు. ఎన్ని పదులూ, వందలూ కూడబెడితే, నాలాంటి మధ్య తరగతి మనిషి పదివేలు పోగుచెయ్య గలడు చెప్పండి?"

ఈ రికార్డు పావనే స్వయంగా అనేక సార్లు వింది. పావని చెల్లెలు కల్యాణి పదో తరగతిదాకావచ్చి పల్టీలుకొట్టి, విద్యా విధానాన్ని తెగతిట్టి, ఇంకచదవను పొమ్మని మొండికేసింది. పత్రికలు, సినిమాలు, స్నేహితులతో కాలక్షేపం చేస్తోంది. ఈ తల్లిదండ్రీ తమ అవసరాలను తీర్చలేరని కల్యాణి ఎప్పుడో తెలుసుకుంది. అయితే తెలియనిదల్లా వాటిని తీర్చగలవారెవరూ అన్న విషయమే. అలాంటివాళ్ళకోసం వాళ్ళంతా కళ్లుచేసుకుని ఎదురు చూస్తోంది ఇప్పుడు.

కుటుంబరావుగారి ఏకైక పుత్రుడు మధుసూదనం. అతను ఎప్పుడు ఇంటి కొస్తాడో, ఎప్పుడు ఊరిమీదకు పోతాడో తెలియదు. వచ్చిన కాసేపట్లో అందర్నీ తిట్టి, కొట్టి కనిపించినవన్నీ లాక్కుని పారిపోతాడు. ఒక్కోసారి దేశంమీదపడి తిరుగుతూ నెలలతరబడి ఇంటికిరాడు. ఏ ఊళ్ళోనయినా బంధుమిత్రులున్నారని తెలిస్తే వెళ్ళి పరిచయం చేసుకుని, అక్కడ తిష్టవేసుకుని కూర్చుని, గిట్టుబాటుఅయ్యే దేమన్నా వుంటే చేజిక్కించుకుని ఇట్టే మాయమైపోతాడు. వాడిమీద బోలెడన్ని కేసులున్నాయి. అందుకని వాడు ఇంటి ఛాయలకు రాకూడదని కన్నవాళ్ళే కనిపించని దేవుళ్ళకు మొక్కుకుంటుంటే, ఎప్పుడొస్తాడా అని పోలీసులు ఎదురు చూస్తుంటారు. రెండుమూడుసార్లు వాళ్ళకు చిక్కి, కొన్నాళ్ళపాటు ముంతకూడు తిని వచ్చాడు. ఈ కొడుకు గురించి ఎంత తక్కువ చెప్పుకొంటే అంత మంచిదని తల్లిదండ్రుల అభిప్రాయం.

వరసగా రెండురోజులు పావనిఇంట్లోనే ఉండటంచూసి తండ్రి గదమాయించి అడిగాడు.

"ఇప్పుడు శలవెందుకు పెట్టినట్లు? పెళ్లా, పేరంటమా?"

"మాబతుక్కితోడు పెళ్ళి, పేరంటాలు కూడాను ... నువు చెయ్యటం, మేం చూడటం ఈ జన్మకు జరిగేపని కాదు..." అని ఎదురు సమాధానం చెప్పింది పావని.




"పెళ్ళంటే నోటిమాటలతో వుందను కున్నావా? నోట్లు...నోట్ల వర్షం కురి పించాలి..."

"ఎందుకూ ... ఈ మా కన్నీటివర్షం చాలదా....?"

"అయినా ఏమిటి? పెళ్ళి పెళ్ళి అని కలవరించి చచ్చిపోతున్నావ్. ఇంక రెండో ధ్యాసలేదా నీకు?"

"నాకు వేరేధ్యాసేముంది? రేసులా, పేకాటా, తాగుడా — ఏ అలవాటూ లేదాయె" అని అంటించింది పావని.

"ఏమిటే ఆ మాటలు పెద్దంతరం, చిన్నంతరం లేకుండా..." అని తల్లి కల్పించుకుంది.

"నువ్వు ఇన్నేళ్ళనుంచీ ఇచ్చినఅలుసు వల్లే ఇదంతా. నీ మొగుడు ఎంత చక్కగా సంసారాన్ని దిద్దుతున్నాడో ఎన్నడన్నా ఆలోచించావా? తమ పిల్లల బరువు బాధ్యతలనుకూడా తామే నెత్తినవేసుకుని, ఆ పిల్లలకోసమే బతికే తల్లిదండ్రులూ కొందరు వుంటారు. అలాగే పిల్లల్నికని, వాళ్ళకు ఏమాత్రం వెసలుబాటు కలిగించక పోగా, వాళ్ళ మెడకు గుదిబండలై కూర్చుని, జలగల్లాపట్టి నెత్తురు పీల్చుకు తాగేవాళ్ళూ ఉండటం మా దౌర్భాగ్యం" అంది పావని ఆవేశంగా.

"కష్టం సుఖం తెల్సుకోకుండాఎంత మాటబడితే అంతమాటఅనే నీలాంటి పిల్లను కనటం మా దౌర్భాగ్యం" అన్నాడు కుటుంబరావుగారు.

"నాకు తెల్సినప్పటినుంచీ నీ సుఖాన్ని మాత్రమే నువు చూసుకుంటూ, మమ్మల్ని కష్టాలపాలు చేస్తున్నావు. పైగా నువ్వు ఇవాళ కష్టసుఖాల గురించి మాట్లాడటం విడ్డూరంగా వుంది."

"నీకన్నీ విడ్డూరంగానే వుంటాయి. ఇంతకీ నువ్వు ఆఫీసుకు ఎందుకు వెళ్ళటం లేదని అడుగుతున్నాను..." మళ్ళీ మొదటి కొచ్చాడు.

"ఎందుకు వెళ్ళాలని నేను అడుగు తున్నాను? నేనొక్కదాన్నే సంపాదించు కొచ్చి మిమ్మల్ని అందర్నీ ఎందుకు పోషించాలని అడుగుతున్నాను?" అని గొంతు చించుకుందామె.

"ఇవాళ నువ్వు సంపాదనకొచ్చావు గదాని పేట్రేగిపోకు. ఎదిగిన పిల్లలు కుటుంబాన్ని ఆదుకోవటం అందరి ఇళ్ళల్లో వున్నదే. నువ్వొక్కదానివే ఇలా మాట్లాడుతున్నావు. అందరి పిల్లలూ కష్టాల్లోనున్న కుటుంబాలను ఆదుకోవ టానికి తాపత్రయపడతారు. కానీ నీలాగా అయినవాళ్ళ మీదనే యుద్ధానికి దిగేవాళ్ళను ఎక్కడా చూడలేదు" అన్నారు కుటుంబరావుగారు.

ఈ వాదన ఎంతకీ తెగేది కాదని ఇద్దరికీ తెలుసు.

ఎదిగిన పిల్లలు ఆదుకోవాలని కుటుంబరావుగారి ఉద్దేశం. మా కోసం మీరేమి కష్టపడనప్పుడు, మీకోసం మేమెందుకు కష్టపడాలని కూతురి అభిప్రాయం. అసలు ప్రేమలు, అభిమానాలు అనేవాటిని ఈ పెట్టుపోతల కొలమానంతో కొలవకూడదన్న ఆలోచన ఆ ఇద్దరికీ రాదు.

మరో రెండురోజుల తర్వాత ఇంటి యజమాని సత్యనారాయణగారు సకుటుం బంగా వచ్చేశారు. వాళ్ల వచ్చినప్పటినుంచీ పావని వాళ్ళింట్లోనే కాలక్షేపం చేయటం మొదలెట్టింది.

"ఏమే..మీ ప్రయాణం ఎలా జరిగింది? విశేషాలు ఏమిటి ?" అని అడిగింది పావని.

"బాగా ఎంజాయ్ చేశామే. నువ్వూ రావల్సింది" అంది కవిత తల దువ్వుకుంటూ.

"అంత అదృష్టం అందరికీ ఉంటొద్దూ?" అన్నది పావని. కొద్దిగా నిరాశ ఆమె గొంతులో ధ్వనించింది.

"కాలేజీ వెళ్ళాం గదా... నీకోసం ప్రత్యేకంగా ఖర్చేముంది? రమ్మంటే పెద్ద బెట్టుసరి శలవు లేదంటూ. ఇప్పుడేమో ఇంట్లో కూర్చుని గోళ్ళు గిల్లుకోవటానికి శలవు మాత్రం దొరుకుతుంది" అని నిష్ఠూరమాడింది కవిత.

"ఇంక అంతా శలవేనే" అంది పావని, బాల్కనీలోంచి కిందికి చూస్తూ.

"అంటే ?"

"ఉద్యోగం పోయింది"

"ఎందుకని...?"

"ఋణం తీరింది కనుక! అసలే టెంపరరీ ఉద్యోగం కదా" అంది బలవంతంగా నవ్వు తెచ్చుకుని.

కవిత తల్లికి ఆ విషయం తెలిసే ఆమె కూడా ఆశ్చర్యపోయింది.

"మరేం చేద్దామనుకుంటున్నావ్?" అని అడిగింది సరస్వతమ్మగారు పావని తలమీద నిమురుతూ.

"ఏదో ఒకటి మళ్ళీ వెతుక్కోవాలి"

"అక్కడే మళ్ళీ ఖాళీలు రావా?" అని ఆరాతీసిందామె.

"రావు" అని కుండలు బద్దలు కొట్టినట్టు చెప్పింది పావని. "బాబాయిగారితో చెప్పి ఎక్కడన్నా ఖాళీలుంటే చూడమను పిన్నీ" అని కూడా అర్థించింది.

"తప్పకుండా చెబుతాను. మాకు కవిత ఎంతో, నువ్వూ అంతే" అన్నదామె.

ఆమె చూపించే ఆప్యాయతకు పావని ఎంతగానో చలించిపోతుంది. ఎంతయినా తాను పరాయిదే. ఆ విషయాన్ని వాళ్ళు మర్చిపోయినా తను మర్చిపోలేదు.

కవిత వాళ్ళకు ఒక్కగానొక్క పిల్ల. ఇన్నేళ్ళొచ్చినా, ఇంకా కవితను పసి పాపను చూసినట్లే చూస్తారు. కూతురికి ఎప్పుడే చిన్న అవసరం వచ్చినా ఆదుకోవాలనే ఉంటుంది వాళ్ళకు. ఆ పిల్ల కాలు కింద పెడితే కందిపోతుందేమో నన్నంత సుకుమారంగా చూస్తారు. కన్న కూతుర్నే గాక, పావనినీ సొంత బిడ్డలాగానే ప్రేమగా ఆదరిస్తారు. అదే తమ తల్లి దండ్రులు పిల్లల్ని చూసే తీరు ఇందుకు పూర్తిగా విరుద్ధంగా ఉంటుంది. వాళ్ళ కడుపున పుట్టినందుకు పిల్లలకిచ్చే ఆస్తి పాస్తులు ఏమీ లేకపోగా, వాళ్ళ బరువు బాధ్యతలన్నీ వీళ్ళమీదకు తోసి, అవన్నీ నెరవేర్చటం బిడ్డల కర్తవ్యంలా భావిస్తారు. ఈ రెండు సంసారాల్లోనూ పెద్దవాళ్ళ ఆలోచనలకు ఉత్తర దక్షిణ ధృవాలకున్నంత వ్యత్యాసం ఉంది.

అనుకోని విధంగా పావని సంపాదన ఆగిపోవటంతో కుటుంబరావు గుండెల్లో పెద్ద బండపడింది. పైగా పావని ఉద్యోగానికి గడువు తీరిన సంగతి తనంతగా చెప్పనేలేదు. ఏమన్నా రిట్టాలని మందు కొచ్చినా, ఇందులో పావనిని అనేదేముంది. అసలే లీవ్ వేకెన్సీ. ఎప్పటికయినా ఊడేదే. ఈలోగా మరొకటి వెతికి పెట్టక పోవటం తన తప్పే.

అయినా, సంపాదించుకొచ్చి సంసారాన్ని పోషించాల్సిన బాధ్యత పెద్దకూతురు పావనిదే అన్నట్లు మాట్లాడతాడాయన.

తనొక్కతే కష్టపడితేనే, మిగిలిన వాళ్ళంతా కూర్చుని తినటం ఏమిటి? తనూ




కాళ్లు జాపుకుని కూర్చుంటానంటుంది పావని. ఒళ్ళుమండి అందుమీదట మాటా మాటా పెరిగి ఆయన కూతుర్ని కొట్టాడు. ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు.

ఏడుస్తూ బయటకు వెళ్ళబోతున్న పావనిని సరస్వతమ్మగారే లోపలికి తీసుకొచ్చి అక్కున జేర్చుకుంది.

"నన్ను వదిలెయ్ పిన్నీ ! అడ్డు పడకు... నన్ను వెళ్ళనీ"

"ఎక్కడికి వెళ్తావు?" అని అడిగిందామె-ప్రేమగా పావని తల నిమురుతూ.

"నాకు బతకాలని లేదు. నేను చచ్చిపోతాను'' అంది పావని కళ్ళవెంట కృష్ణాగోదావరులు ప్రవహిస్తుండగా.

"ఈ మాత్రం కష్టం వచ్చినప్పుడల్లా ప్రతివాళ్ళూ చచ్చిపోతుంటే, ప్రపంచంలోని జనాభా అంతా ఎప్పుడో తుడిచిపెట్టుకుపోయేవాళ్ళు. చదువుకున్నదానివి, అన్నీ తెల్సినదానివి. నువ్వూ ఇలా తొందరపడి మాకందరికీ జీవితకాలపు దుఃఖాన్ని మిగులుస్తావా? పుట్టటం మన చేతుల్లోలేదు. గిట్టటమూ మన చేతుల్లోలేదు. ఈ రెండింటి మధ్యనున్న రసవత్తరమైన ఆటలో అలసిపొయ్యేదాకా ఆడుతూ ఉండటమే మనం చేయగలిగిన పని" అని ఆమె అనునయించింది.

పావని వాళ్ళింట్లోనే మొదట్నించీ ఉంటోంది. ఇదివరకు అప్పుడప్పుడు వెనక వాటాలోనున్న తమ పోర్షన్‌లోకి వెళ్ళి వస్తుండేది. ఇప్పుడు మేడ దిగటం లేదు. మేడమీద తనకే లోపమూ జరగటం లేదు. అందరూ ప్రేమగానే చూస్తున్నా స్నేహానుబంధం తప్ప మరేబంధమూలేని పిళ్ళకు ఎంతకాలం బరువుగా ఉంటుంది? వీలైనంత త్వరలో తన దోవ తాను చూసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందన్న వాస్తవాన్ని విస్మరించలేక పోయింది పావని.

* * *

ఓ సాయంత్రంవేళ పద్మలత వచ్చి నప్పుడుగానీ పావని మేడదిగి కిందికి రాలేదు.

పావనిని చూడగానే పద్మలత ఆశ్చర్యపోయింది.

"ఏమిటే.... ఇలా అయిపొయ్యావు? ఒంట్లో బాగుండటంలేదా?" అని అడిగింది, ఆదరంగా భుజంమీద చెయ్యివేసి.

"అవునే...ఒంట్లో బాగుండటంలేదు" అంది పావని నీరసంగా నవ్వి.

"ఏమిటీ...నీకేం రోగం?"

''పెద్ద రోగం కూడా ఏమీలేదు. అప్పుడప్పుడు జ్వరం వస్తోంది"

"ప్రేమ జ్వరమా?"

"చలి జ్వరమేమోనని అనుమానంగా ఉందే''

"నీ మొహం. ఏ వయసులో అయినా ఒంటరితనాన్ని మించిన మానసికరోగం మరొకటి ఉండదు. అన్నట్లు నువ్వు శుభలేఖలు తెస్తావని మనవాళ్ళంతా ఎదురు చూస్తున్నారు. ఇంకా మనమెక్కడ గుర్తుంటామని శాంత దెప్పుతోంది కూడాను"

"పెళ్ళిలేదు, పెటాకులులేదు. మనం సరదాగా జోక్స్ వేసుకుంటాంగదా. వచ్చేటప్పుడు మీతో ప్రాక్టికల్ జోక్ ఒకటివేసి వచ్చాను. అంతే" అని నవ్వింది పావని-చవితినాటిచంద్రుడిలాబలహీనంగా.

"కాయ్ కాయ్ ... కాబోయే శ్రీవారు నిన్ను వెతుక్కుంటూ వచ్చి, శ్రీమతిగారు నడిస్తే కాలు ఎక్కడ కందిపోతుందోనని పాతవేటు మార్గంలోనున్న హోటలుకు ఆటోలో తీసుకెళ్లటం కూడా ప్రాక్టికల్



కేనా?"

పావని మాట్లాడలేకపోయింది.

పద్మలత గుచ్చి గుచ్చి అడిగింది.

"అఫ్‌కోర్స్...ఇది నీ వ్యక్తిగత విషయం గనుక నేను అడగకూడదనుకో. కానీ, నీ మొహం చూస్తుంటే ఏదో బెడిసికొట్టిందన్న విషయం స్పష్టంగా తెలుస్తోంది. ఇన్నాళ్ళపాటు అతి సన్నిహితంగా మసులుతూ, మనసులు విప్పి మాట్లాడుకుంటూ తిరిగిన స్నేహితురాలిగా కష్ట సమయంలో సానుభూతి చూపించాల్సిన కనీసధర్మం నాకుందిగదా"

అంతగా అడుగుతుంటే పావని జరిగింది చెప్పకుండా ఉండలేకపోయింది. అతను రావటం, చూడటం, పొగడటం, పెళ్ళిదాకా వెళ్ళటం, రాజీనామా చేసేదాకా అతను పోరటం, ఈలోపే ఆ అవసరం లేకుండా ఉద్యోగం ఊడటం...అన్నీ చెప్పింది.

"ఉద్యోగం సంగతి సరే... ఇది కాకపోతే మరొకటి. కానీ అంత చిన్న విషయానికి నువ్వెందుకింత మొండితనం చూపించావో నాకు అర్థంకావటంలేదు" అంది పద్మలత అంతా విని.

"అది చిన్న విషయమా ?" అని ఆశ్చర్యపోయింది పావని.

"లేకపోతే ఏమిటే? అతను నిజంగానే నిన్ను చేసుకునేవాడేమో ? అర్థంలేని నీ మొండితనంతో కాళ్ళదాకా వచ్చిన అవకాశాన్ని కాలదన్నుకున్నావేమో ననిపిస్తోంది"

"నాకలా అనిపించటంలేదు. మోసం చేసి పోతాడేమోనన్న అనుమానమే వచ్చింది" అన్నది పావని.

"అలాంటివాళ్లు కొరని నేను అనటం



లేదు. కానీ అందరూ అదేరకం అన్న అభిప్రాయం సరైనది కాదంటాను. కోరిన పడతి పొందుకోసం సామ్రాజ్యాల్ని సైతం తృణప్రాయంగా కాలదన్నిన సలీమ్‌లూ ఉన్నారు. అందుబాటులో ఎన్నివున్నా, అందని పార్వతికోసం జీవితాన్ని కాగితంలాకాల్చి మసిచేసుకున్న దేవదాసులూ ఉన్నారు..."

"కావచ్చు కానీ..." ఏదో చెప్పాలను కున్నా, ఏమీ చెప్పలేక పోయింది.

"నీ ముందుజాగ్రత్తను నేను కాదనటం లేదు. కానీ ఇష్టంవున్నా లేకున్నా, కాలం తెచ్చే కొన్ని మార్పులతో మనం కొంత వరకూ రాజీపడక తప్పదు"

"అంటే?"

"మనవి మధ్యతరగతి కుటుంబాలు. ఇంకా వివరంగా చెప్పాలంటే - తిండికి జరిగీజరగని కుటుంబాలు మనవి. మనం ఒకరోజు జీతంతేవటం ఆలస్యమైతే విల విల్లాడిపొయ్యే బతుకులు. మొన్న నెల రోజులు సమ్మెచేస్తే చెవులవీ, చేతులవీ నగలు అమ్ముకుని తిన్నాం - ఇదీ మన పరిస్థితి. అలాంటప్పుడు పెద్దవాళ్లు మన కోసం వేలుధారబోసి కట్నాల మార్కెట్‌లోకి వెళ్లి వేలంపాడి ఏ హీరోనోతెచ్చి మన మెళ్లో పుస్తె కట్టిస్తారని పగటికలలు కనటం మన ఆరోగ్యానికి మంచిదికాదు"

"అందుకని...?"

"ఆకలితో ఉన్నవాడు ఎక్కడా దొరక్కపోతే దొంగతనం చేస్తాడు. అది వాడి తప్పు అని తీర్పుచెప్పి శిక్ష విధించే జడ్జిగారుకూడా నాలుగురోజులూ పస్తులుపడుకుంటే ఆయన ఆలోచనాతీరూ మారిపోతుంది. అందుకని కడుపునిండిన వాళ్లు చెప్పే కబుర్లు, అక్కరలేనివాళ్లు తీరుబడిగాచేసిన కట్టుబాట్లు మనకు పనికి రావు.మనమార్గాలు మనంవెతుక్కోవాలి"

"......"

"మనకు మిగిలింది అందం ఒక్కటే! ఈ అందంకూడా చాలావరకు వయసుతో వచ్చిందే. ఇంకో నాలుగేళ్లుపోతే యవ్వనం జారుకున్నాక, కన్నవాళ్లే మనల్ని ఈటెల్లాంటి మాటలతో గుండె తూట్లు పడేలా పొడుస్తారు...తెల్సా? ఆ పరిస్థితి రాకముందే, సమయం చెయ్యిజారిపోక ముందే కళ్లుతెరవాలి..." అని ఆగి పోయింది పద్మలత.

"ఇంతకీ నువ్వు చెప్పదల్చుకున్న దేమిటో సూటిగా చెప్పవే ?" అని అడిగింది పావని.

"అస్సాంలో ఉన్నవాడు తేయాకు వ్యాపారంచేస్తే, కేరళలో ఉన్నవాడు కొబ్బరిపీచువ్యాపారం చేస్తాడు. ఎవరి దగ్గర ఏంవుంటే దాన్నే పెట్టుబడిగా పెడతాడు. ఒకడు జబ్బబలంతో నెట్టు కొస్తే, మరొకడు బుద్ధిబలంతో నెగ్గు కొస్తాడు. సోమచ్‌సో...నేను చెప్పదల్చు కున్నది ఒక్కటే- నీ అందాన్ని ఎరగా వేసి, చిక్కిన చేప చెయ్యిజారిపోకుండా మూడుముళ్లూ వేయించుకో! దానితో మన జన్మ ధన్యమైనట్లేగదా...ఇటు కోరినవాడూ దొరుకుతాడు. దమ్మిడీ ఖర్చులేకుండాను కొంగుముడి వేస్తాడు. అచ్చటా ముచ్చటా తీర్చలేకపోయినం దుకు, అతనికన్నా ఎక్కువగా మనం బాధపడిపోయినట్లు కనిపించామనుకో ఇంక మన అంత మంచిది అతనికి కంచు రాగవాసేసి వెతికినా కనిపించదు. ఇంతకీ ఈ ప్రేమించుకోవటాలూ, పెళ్ళిచేసు కోవటాలూ, ఇచ్చిపుచ్చుకోవటాలూ-అన్నీ మనసును కుదుటపర్చుకోవటంలోనే ఉన్నాయి" అంది పద్మలత.

 

"నువ్వు చెప్పింది నిజమేననిపిస్తోందే" అంది పావని దూరంగా చూస్తూ, దీర్ఘంగా ఆలోచిస్తూ.

"ఈ థియరీని నేను ప్రాక్టికల్స్‌లోకి దింపాను..." అని నవ్వింది పద్మలత.

"అమ్మదొంగా...? చెప్పవేం మరి? ఎవరే ఆ లక్కీఫెలో...?"

"పెళ్ళికిముందు అంతా లక్కీఫెలోసే. పెళ్ళయిన నాలుగేళ్ళకుగాని తెలియదు ఎవరి లక్ ఎంతలో ఉందో! ఇంతకీ అతను మా కాంపౌండులోనే ఒకరూంలో అద్దెకుంటున్నాడు. అదే నువు రాచ్చిప్ప అన్నావే అతనే! ముందు చూపులు కల్సినాయి. తర్వాత మాటలు కల్సినాయి. ఒకరోజు చేతులు కల్సినయి. ఒక వెన్నెల రాత్రి తనువులు కల్సినాయి...అయిన వాళ్ళనూ, ఆస్తిపాస్తులనూ, పాతికవేల కట్నాన్నీ—అన్నిటినీ వదులుకుని వచ్చి ఇప్పుడు నన్ను పెళ్ళిచేసుకుంటున్నాడంటే నువ్వు నమ్మగలవా...?"

పావని నిశ్చేష్టయై నిలబడిపోయింది.

"నేనేం తప్పుచేయలేదే...తప్పనిసరి పరిస్థితుల్లో కొంచెం సాహసంచేశాను... కనుకనే నా జీవితం బాగుపడింది. జరిగిన దానికినేనుసిగ్గుపడటంలేదు.గర్వపడటమూ లేదు.మన బతుకులింతే! వచ్చే బుధవారం రాత్రిఏడు ముప్పయి రెండు నిముషాలకు మా పెళ్ళి. పెద్దగా ఎవర్నీ పిలవటంలేదు. ఇదయినా కేవలం సాక్ష్యం కోసం. అతని స్నేహితులూ, నా స్నేహితులూ... అంతా కలిపి పదిమంది కన్నా ఎక్కువమంది ఉండరు. బీదవాలి పెళ్ళి కదా... అతనికి బట్టలు కుట్టించుకోమని రెండొందలుకూడా ఇవ్వలేకపోతున్నాను" అంటూ పద్మలత కంటతడి పెట్టుకుంటే పావనికి దుఃఖం ఆగలేదు. దగ్గరకు లాక్కుని కౌగిలించేసుకుంది.

ఇద్దరూ ఒకరి భుజం మీద మరొకరు తిరిగిపోయి కన్నీరు కారుస్తూనే ఉన్నారు.

రెండు నిముషాల తర్వాత తేరుకుని కన్నీరుతుడుచుకున్నాక పద్మలత అంది— "ఇదే పిలుపు. బుధవారం సాయంత్రం నువ్వు రావాలి. భోజనాలు కూడా పెట్టుకోలేదు. టీ, బిస్కట్ ఇచ్చి పంపిస్తాం. దండల పెళ్ళి కదా... ఆడంబరాలకు డబ్బు లేదని నేను బాధపడితే, ఆదర్శ వివాహం ఇలాగే ఉండాలంటాడాయన"

"నిజంగా నువ్వు గొప్ప అదృష్టవంతురాలివే! నాకు చాలా చాలా సంతోషంగా ఉంది" అంది పావని.

"నాకన్నా ముందు నువ్వే వచ్చి పెళ్ళికి పిలుస్తావనుకున్నాను. కానీ ఇలా జరుగుతుందనుకోలేదు" అని విచారపడింది పద్మలత.

"దేనికైనా ప్రాప్తం అనేది ఒకటి ఉండాలిగా"అంటూ పావని వేదాంతాన్ని గుర్తుచేసింది.

సాగనంపటానికి గుమ్మందాకా వచ్చాక పద్మలత చెప్పింది— "అన్నట్లు చెప్పటం మర్చిపొయ్యాను. త్యాగరాజగాన సభలో వచ్చే ఆదివారం మీ ప్రోగ్రాం ఉందిట. మూర్తిగారు నీతో చెప్పమన్నారు. రేపు వాళ్ళింట్లో రిహార్సల్స్ ఉన్నాయి రమ్మన్నారు... వెళ్తావా?"

"థాంక్స్... తప్పకుండా వెళ్తాను. ఇంత కారు చీకటిలోనూ నాకు మిగిలిన ఆశాజ్యోతి పాడటం ఒకటే. ఆ అవకాశాన్ని ఎలా వదులుకుంటాను?"అన్నది పావని.

* * * *

ఆదివారంనాడు ప్రోగ్రాం అయ్యాక వస్తుంటే గుమ్మంలో శేఖర్ ఎదురైనాడు.

"నమస్కారమండీ!" అన్నాడు.

"ఓ... మీరా! నమస్కారమండీ" అంది.

"ఆటో తెమ్మంటారా?" అని అడిగాడు.

"అక్కర్లేదండీ...నడిచివెళ్తాను, బస్ స్టాప్ దాకా"

"నేనూ వస్తాను... మీకు అభ్యంతరం లేకపోతే"

"అభ్యంతరం ఏముందండీ... రోడ్డు నా ఒక్కదానిదీ కాదుగా"

ఇద్దరూ నడుస్తున్నారు. చల్లగాలి వీస్తోంది. వాన వచ్చేటట్లుంది. ఉండుండి ఒక్కో చినుకూ రాల్తోంది.

"మీరేమీ అనుకోనంటే ఒక విషయం చెబుతానండీ...ఇవాళెందుకో మీరు అంత బాగా పాడలేదనిపించింది. అంటే మామూలు ప్రేక్షకుడికి బాగానే ఉంటుంది. మిగిలినవాళ్ళకన్నా బాగానే పాడారు కూడా. కానీ మీరు ఇంకా బాగా పాడగలరు. ఏదో అన్యమనస్కంగా, యాంత్రికంగా పాడరనిపించింది"

"మీరు చెప్పింది కరెక్టేనండి" అంది పావని.

"ఏమండీ... ఆర్టిస్ట్ కూడా మనిషే. అతనికీ కష్టాలుంటాయి, బాధలుంటాయి, చచ్చేసన్ని సమస్యలుంటాయి... అవన్నీ మీ పర్సనల్. కానీ ఆడిటోరియమ్‌లో కూర్చున్న అన్నివందలమందికీ మీ గొడవలేమిటో అక్కర్లేదండి. వాళ్ళకు మీ పాట మాత్రమే కావాలి. దాని కోసమే శ్రమపడి, మిగిలిన పనులుమానుకుని వచ్చారు. అందుచేత మీ పాట వినటం కోసం వచ్చిన అన్ని వందలమందినీ సంతృప్తిపరచటం కోసం, ఆ కాసేపూ మీ సమస్యలన్నీ టీవీ స్టేజికి ఇవతలే విడిచి పెట్టెయ్యాలండీ.మైక్ ముందున్నకాసేపూ పాట ఎంత చక్కగా పాడాలా అన్న ధ్యాస తప్ప, మరో ధ్యాస ఉండకూడదండి. మీకు తెలియదని కాదుగాని, ఎందుకో ఈ విషయం మీకు గుర్తుచేయాలనిపించిందండీ'' అన్నాడతను ఎంతో సిన్సియర్‌గా.

"చాలా థాంక్స్'' అంటూ పావని పైటకొంగు తలపైదకు కప్పుకుంది– చినుకులు పడనారంభించటంతో.

సెంటర్లో హోటలు దాకా వచ్చాక ఆగిపోయ్యారు. జల్లు తగ్గేలోపల కాఫీ తాగటం కోసం లోపలికెళ్ళారు.

"మీకు సంగీతంలో ప్రావీణ్యం ఉందా?''

"పెద్ద ప్రావీణ్యం లేదు.కానీ ఇంటరెస్టు ఉంది. ఈ ఇంటరెస్టు మా ఇంట్లో అందరికీ ఉంది''

"అంటే మీ శ్రీమతికీ, పిల్లలకూ...''

అతను వెంటనే చెప్పాడు– "నాకు పెళ్ళికాలేదండి. కనుక పిల్లలు కూడా ఎవరూ లేరండి. మా పేరెంట్స్, సిస్టర్స్ అందరికీ సంగీతం పట్ల అభిమానం ఎక్కువ. బాలమురళీ కృష్ణ, బాలసుబ్రమణ్యం దగ్గరనుంచీ ఎక్కడే మ్యూజికల్ ప్రోగ్రాం ఉన్నా మిస్‌కానండి. సింగర్స్‌ని కలుసుకుని నిర్మొహమాటంగా నా అభిప్రాయం చెప్పటం బహుశా, నా వీక్‌నెస్ అనుకుంటానండి"అన్నాడతను కాఫీతాగుతూ.

"మీరెక్కడుంటారు?" అనిఅడిగింది పావని.

"కాలనీలోనండి...మీరెందుకో ఇంకా పరాగ్గా ఉన్నారు. నేను సంగీతంగురించి చెబుతుంటే, మీరు నాఇంటి గురించి అడుగుతున్నారు ... మీకేదన్నా ఇల్లు





కావాలా, ఫర్వాలేదు చెప్పండి ప్రయత్నం చేస్తాను"

"నాకు ఇల్లు అక్కర్లేదండి. ఏదన్నా ఒక చిన్న ఉద్యోగం ఇప్పించగలరా?''

"అదేమిటి...మీరు సెక్రటేరియట్‌లో..."

"లేదు ఆ ఉద్యోగం పోయింది. అందుకే...?"

''మీరు చేయగల ఉద్యోగాలు దొరకాలంటే, కొంచెం వెతకాలి. టైంపడుతుంది. తిరిగితే దొరక్కపోదండి. మాకు శలవు దొరకదండి. అదే నా వీక్‌నెస్"

"ఎంత చిన్న ఉద్యోగం అయినా ఫర్వాలేదు...చేస్తాను"

"చిన్న చిన్న ఉద్యోగాలు మీరు చేస్తామన్నా మేం చెయ్యనివ్వం. ఎందుకంటే, చిన్న ఉద్యోగాలు చేసేవాళ్ళకే చాకిరీ ఎక్కువ ఉంటుంది. ఈ రొటీన్‌లో పడిపోతే, మీ గొంతు దెబ్బ తింటుంది'' అన్నాడు శేఖర్.

''గొంతు దెబ్బ తింటుందని చేతులు ముడుచుకుని కూర్చుంటే ఎలాగండి? నాలుగు మెతుకులు నోట్లోకి పోయే మార్గం కూడా చూసుకోవాలిగదా" అంది పావని.

"అదీ నిజమేననుకోండి ... అందుకే ఈ దేశం అంటే నాకు చెడ్డ చిరాకండి. మనకు ఏది ఇష్టమో అది చెయ్యటానికి వీలుండదు. ఇష్టంలేని వెధవ పనులన్నీ చెయ్యాల్సి వస్తుంది వెధవ జీవితం కోసం. మనవాళ్ళంతా వట్టి వెధవలండీ. కానీ, ఈ మాటంటే ఒప్పుకోరండి ఎవరూ. నేను ఉన్నది ఉన్నట్లు ఒప్పుకుంటానండి. అదే నా వీక్‌నెస్" అన్నాడతను.

"మీకు చాలా వీక్‌నెస్‌లు ఉన్నట్లున్నాయే" అని నవ్వింది పావని.

"ఉన్న లోపాలు కప్పిపుచ్చుకోవటం, లేని గొప్పదనాన్ని ఆపాదించుకోవటం నాకు అసలు చేతగాదండి. అది అసలు వీక్‌నెస్"

''మీకెన్నయినా వీక్‌నెస్‌లుండొచ్చుగాని, నాకు వీలైనంత త్వరలో ఎంత చిన్నదైనాసరే, ఓ ఉద్యోగం ఇప్పించారంటే మీ అంత గొప్పవారు లేరని ఒప్పుకుంటాను''అంది పావని.

''తప్పకుండా ప్రయత్నిస్తానండి" అన్నాడు.

పావని తన అడ్రసు ఇచ్చింది. ఓ వారం రోజుల్లో తప్పకుండా వచ్చి కల్సుకుంటానన్నాడు. వాన తగ్గింది. బస్సు ఎక్కారు.



4

మన్నాడు–

కవిత సినిమాకి వెళ్దాం రమ్మంది. తను రాలేనంది పావని.

''పోనీ, ఎత్తుకుని తీసుకెళ్తాను"

"అలాంటి పని చెయ్యకు. ఇద్దరికీ నడుములు విరుగుతాయి"

''మరి మర్యాదగా బయల్దేర"

"వెధవ సినిమాలు బోరుగా ఉంటాయే''

"అబ్బే....ఇది అలాంటి సినిమా కాదు. గొప్ప ప్రబోధాత్మక చిత్రం. హాల్లోనుంచి బయటకొచ్చేటప్పటికి ప్రేక్ష

కులు బోధి వృక్షం కిందినుంచి ఇవతలి కొచ్చిన బుద్ధభగవానులే అయిపోతారట. పద..." అని చెయ్యి పట్టుకుని లాగింది కవిత, మంచంమీద పడుకున్న పావనిని.

"అయితే అసలు రాను. నాకుజీవితం మీద బోలెడంత ఆశ ఉంది. భవిష్యత్తు మీద చచ్చినంత నమ్మకం ఉంది. ఇప్పుడే సన్యాసం స్వీకరించాలని లేదు"

"అలా అయినా నువ్వీ చిత్రం చూడాల్సిందే. కామిగానివాడు మోక్షగామిగాడు అని చెప్పటం కోసం ముందంతా అయిదు నిముషాలకోసారి సెక్సు తారలతో శృంగారం వలకబోస్తార్లే...లే" అని బలవంతం చేసింది కవిత.

థియేటర్ దగ్గరకు వెళ్ళేటప్పటికి జనం కిక్కిరిసి ఉన్నారు. బుకింగ్‌లో టిక్కెట్లు పట్టుమని పదిమందికి కూడా ఇవ్వలేదు. మూసేశారు. ఫర్వాలేదు వెళ్ళిపోదామని పావని అన్నా కవిత ఊరుకోలేదు. మళ్ళీ ఇంకోరోజు ఇంత శ్రమపడి రావాలంటే కష్టం గదా అంటూ కవిత రెండు టిక్కెట్లు బ్లాకులో కొన్నది.

సీట్లు వెతుక్కుంటూ వెళ్ళి కూర్చున్నారు. సినిమా మొదలైంది. ఇద్దరు హీరోలు, ఇద్దరు హీరోయిన్లు, చెరోడాన్సు, చెరో ఫైటింగు, చెరో సెంటిమెంటు సీన్సు...ఇలా పంచుకుంటూ వెళ్ళారు. ఇద్దరూ అన్నదమ్ములే. కానీ ఒకణ్ని దొంగలెత్తుకుపోతారు. వాడు దొంగల నాయకుడు అవుతాడు. రెండోవాడు పోలీసు ఆఫీసరు. ఒకర్ని చంపాలని మరొకరు ప్రయత్నిస్తుంటారు. ఇద్దరికీ తల్లి అంటే ఎంతో ప్రేమ. తరుము కొస్తున్న పోలీసువాళ్లను తప్పించుకోవటం కోసం దొంగవాడు పోలీసు ఆఫీసరు ఇంట్లోకే వస్తాడు తల్లికి అతన్ని చూడగానే మాతృప్రేమ పెల్లుబుకుతుంది. ఇలా సాగిపోతోంది కథ.

ఇంటర్వెల్ రాగానే పెద్ద రిలీఫ్ వచ్చినట్లు ఫీలయినారు. వాళ్ళపక్కన కూర్చున్న మగవాళ్ళు లేచి బయటకెళ్లారు.

"ఎలా ఉందే సినిమా?" అనిఅడిగింది కవిత.

"అది అడక్కు. ఏదో మూడుగంటల సేపు తలుపులు మూసి తెరలమీద బొమ్మలు చూపించి పంపిస్తారు. ఇందులో ఒక్క సంఘటన అయినా, నిజంగా జరుగుతుందా అన్న ప్రశ్నవేస్తే సమాధానం దొరకదు...అవునుగానీ, ఇప్పుడు వింటున్న పాట దేనిలోదే, ఎక్కడో విన్నట్లుంది?" అని ఆలోచనలో పడింది పావని.

"నీ జ్ఞాపకశక్తికి నా జోహార్లు. ఈ పాట ఇందులోదే. ఇంటర్వెల్ ముందరే అయింది. అంత పరాకేమిటే తల్లీ?'' అని అడిగింది కవిత.

"పరాకు కాదే...పక్కన కూర్చున్న వాడెవడోగాని, ఊరికే మీదకు వాలిపోతున్నాడే....వీడి గోలతో ఏం చూస్తున్నానో బుర్రకెక్కటంలేదు" అంది పావని.

"చెప్పవేం? అలాంటి క్రానిక్ కేసులకు నా దగ్గర బోలెడు మందులున్నాయి. నువ్విటు కూర్చో" అంది కవిత.

ఇద్దరూ సీటు మారారు. మళ్ళీ సినిమా మొదలైంది. దీపాలు ఆరి పది నిముషాలు అయ్యాక అతను ఆటోమేటిక్‌గా ఆమె భుజం మీదకు ఒరిగిపోయ్యాడు. కవిత ముందుకు జరిగి కూర్చుంది. ఇంకో పది నిముషాల తర్వాత ఆమె చెయ్యిమీద అతని చెయ్యి వేశాడు. కొద్ది నిముషాలు కవిత చెయ్యికదలకుండాఅలాగే ఉంచింది.




అతనికి బోలెడంత ధైర్యం వచ్చి చేతిని నొక్కాడు. వెంటనే షాక్ కొట్టినట్టు చెయ్యి వెనక్కి లాగేసుకున్నాడు 'అబ్బా' అని కేక పెట్టి. ముందూ, వెనకా,పక్కనా ఉన్నవాళ్ళు కొందరు తలతిప్పి చూశారు. అతను తేలుకుట్టిన దొంగలా అయి పొయ్యాడు.

"ఏంచేశావే?" అని అడిగింది పావని.

"పిన్నీసుపెట్టి కసుక్కున గుచ్చి గీరాను. దానికి తుప్పు కూడా పట్టి ఉంది; సెప్టిక్ అయినా అవుతుంది"అంది కవిత.

కవిత ధైర్యం పావనికి ఎప్పుడూ ఆశ్చర్యంగానే ఉంటుంది. ఆ అమ్మాయి పెరిగిన వాతావరణం, ఇంటి పరిస్థితులు, ఆర్థిక స్థితిగతులు కవితను ఒక అంతస్తు పైనే నిలబెట్టాయి. ఆ అమ్మాయి ఏం చేసినా సాహసంతోనే చేస్తుంది.

బయటికొచ్చాక, హోటలులోకి వెళ్ళి ఐస్ క్రీం తింటుంటే పావని జాలిపడింది.

"పాపం కదుటే?... ఏదో చక్కని ఆడది పక్కన దొరికింది కదాని వాడు వెర్రివేషాలు వేశాడనుకో..ఇలా ఒంటరిగా సినిమాకెళ్ళటం, వాళ్ళపక్కన కూర్చోవటం మనమే తగ్గించుకుంటేపోలా?" అంది పావని.

"నథింగ్ డూయింగ్. ఈపిచ్చివేషాలు నాకు నచ్చవు. ,దమ్ముంటే ధైర్యంగా ముందుకొచ్చి అడగమను, ఏంకావాలనుకుంటున్నాడో. సమాధానం చెప్పి పంపిస్తాను" అని చెప్పింది కవిత.

కవిత ఎంత మంచిదో, ఎదుర తిరిగితే అంత చెడ్డది కూడా. ఆ విషయం పావనికి తెలియకపోలేదు. అందుకని పావని మాట మార్చింది.

"నాకో చిన్న ఉద్యోగం చూసి పెట్టమని అడిగాను. దాని సంగతి పట్టించుకున్నట్లులేదు"

"ఇప్పుడా వెధవ ఉద్యోగం చేయకపోతే వచ్చిన నష్టం ఏమిటి? మాతోపాటే తిందువుగాని, ఉందువుగాని"

"కానీ ఎన్నాళ్ళు ఇలా?"

"నీకు ఇష్టమైనన్నినాళ్ళు ఉండవే, ఇప్పుడు ఎవరు కాదన్నారు?"

"మీరు కాదంటారని కాదు. నాకేలోటూ లేకుండా చూస్తున్నారు. అదీ కాదనటంలేదు. కానీ చివరకో సినిమాకు వెళ్ళాలన్నా, హోటలుకు వెళ్లాలన్నా ఇబ్బంది పడాల్సి వస్తుంది" అంది పావని సంకోచంగానే.

"అయితే నీకూ నెల నెలా కొంత పాకెట్ మనీ ఇప్పిస్తాను"

"నాకు పాకెట్టేలేదు. పాకెట్ మనీ ఎందుకు?"

"పోనీ జాకెట్ మనీ ... అది ఉంది గదా?"

"ఉందిలేగానీ, నాన్నగారితో చెప్పి చూడవా?" అని మళ్ళీ జాలిగా అడిగింది పావని.

ఆ రాత్రి కవిత తండ్రికి గుర్తుచేసింది పావని ఉద్యోగం గురించి.

"చెప్పాను కదమ్మా ...మా ఫ్రెండ్ అంటే ఆ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు ఊళ్లోలేడు. రాగానే ఉద్యోగం వస్తుంది" అన్నాడాయన.

"ఈమాట చెప్పి వారం రోజులైంది. ఈలోగా ఆయన నాలుగుసార్లు వచ్చి నాలుగుసార్లు వెళ్ళిపోయి ఉంటాడు. రేపు గుర్తు పెట్టుకుని ఫోను చేయాలి" అంది కవిత.

"అలాగే" అన్నాడాయన.

కానీ మర్నాడు వాళ్లిద్దర్లో ఎవరికీ ఈ విషయమే గుర్తులేదు.

మూడోరోజు శేఖర్ ఆమె ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు.

పావని అతన్ని ఆదరంగా ఆహ్వానించింది.

"తేలికగా కనుక్కోగలిగారా ఇల్లు?" అని అడిగింది.

"ఆ, ఆ...కనుక్కున్నానండీ..." అని నీళ్లు నమిలాడు.

అతను కాఫీతాగాక పావని అడిగింది. "చెప్పండి. ఎంతోపని ఉంటేనేగాని మీరు ఇంతదూరం నన్ను వెతుక్కుంటూ రారు. నా ఉద్యోగం సంగతేమైనా కనుక్కున్నారా?"

"కనుక్కున్నానండి. మీరు ఎంత చిన్నదయినా ఫర్వాలేదన్నారు కదాని



ధైర్యంచేసి చెబుదామని వచ్చాను. కానీ ఈ ఇంటినీ, మీ హోదానుచూశాక తెల్సింది- నన్ను కేవలం ఫూల్‌ను చెయ్యడానికే మీరు అలా అడిగారని. ఫర్వాలేదు. నేను దాన్ని స్పోర్టివ్‌గానే తీసుకుంటాను..." అన్నాడతను బాధనుకాఫీతోబాటుమింగేసి.

"ఈ ఇల్లు నాదికాదు. మీలాగే వాళ్ళు నాపట్ల ఆదరంచూపి తలదాచుకోవటానికి ఇంత నీడనిచ్చారు. అదిచూసి నా హోదా, స్థితి గొప్పదని మోసపోవద్దు. అదేమాట మళ్ళీచెబుతున్నాను. ఎంత చిన్న ఉద్యోగమైనా చేయటానికి సిద్ధంగా వున్నాను, చెప్పండి..." అన్నది ఆత్రంగా.

"ఒక షాపులో సేల్స్‌గర్ల్‌గా ఇస్తామన్నారు. మీకిష్టమైతే రేపువచ్చి జాయిన్ కావచ్చు. జీతం ప్రస్తుతం నాలుగొందల యాభై..."

"అలాగే. రేపు ఎక్కడికిరాను?"

"పదింటికి లక్‌డీకాపూల్ బస్‌స్టాప్‌లో మీకోసం ఎదురుచూస్తుంటాను" అని లేచాడు శేఖర్.

"చాలా థాంక్స్" అని సాగనంపింది. అతను వెళ్ళిపొయ్యాక కవితఅడిగింది

"ఎవరే ఆ భకుడు?"

"నా ఫాన్‌లే. వీరాభిమాని...నాకు ఉద్యోగం కుదిర్చాడు. అదే చెప్పటానికి వచ్చాడు" అంది పావని సంతోషంగా.

"ఎక్కడా?"

"ఏదో షాపులో సేల్స్‌గర్ల్ ఉద్యోగం. నాఒక్కదానికి ప్రస్తుతానికిసరిపోతుందిలే" అని తృప్తిపడింది.

"సిగ్గులేకపోతేసరి. నువ్వు సేల్స్‌గర్ల్‌గాచేరు. నేనువచ్చి నీదగ్గర సరుకులు బేరంచేసికొంటాను. నువ్వు వాటిని పట్టుకొచ్చి కార్లో పెట్టు... ఈ మాట చెప్పటానికి నీకు నోరెలా వచ్చిందే? ఇంత చదువుకుని, అంత గొప్ప గాయనివైవుండి, పౌడరు డబ్బాలు,పాలపీకలూ అమ్ముతూ కూర్చుంటావా? బుద్ధి ఊళ్ళేలతానంటే గ్రహచారం గాడిదలు కాస్తానందిట..." అని చెడామడా చీవాట్లు పెట్టింది కవిత.

"నా బాధ నీకు అర్థంకాదే" అంది పావని.

"నోర్మూయ్యవే. ఎక్కడికీ రమ్మంటే రానంటావు. పోనీఇంట్లో హాయిగా పాటలువింటూ, పాడుకుంటూ కాలక్షేపం చేయమంటే అదీ చెయ్యవు. పుస్తకాలు, రేడియోలు, కాసెట్లు, టి.వి.లు, సినిమాలు, ఫ్రెండ్స్ ఎన్నో వున్నాయి జాలీగా కాలం గడపటానికి. ఇవన్నీ ఏంపట్టించుకోకుండా అశోకవనమున సీతలాగా ఎంతసేపూ షేక్స్‌పియర్ మొహం పెట్టుకూర్చుంటావు...వెధవ వుద్యోగం, వెధవ పాకెట్ మనీ నువ్వూను. ఓహో పాకెట్ లేదు రాబోలు జాకెట్‌మనీ అంటూ ఒకటే ఏడుపు. అసలు నీ జాకెట్లన్నీ పోగుచేసి తగలెట్టేస్తాను...అ స్త మా నం డబ్బు డబ్బు... అదితప్ప రెండోయావలేదు.పోనీ ఎంతకావాలో తీసుకో అంటే అక్కర్లేదు మళ్ళీ. సేల్స్‌గర్ల్‌చేసి, చెరుకురసంఅమ్మి, మిరపకాయ బజ్జీలమ్మి రోజుకు రెండో మూడోగడిస్తే అది గొప్ప అన్నమాట... అక్కడికేదో కష్టపడి స్వార్జితంతో పైకొచ్చి ఆదర్శప్రాయమైన జీవితాన్ని వెలగబెట్టినట్టు. డాడీలక్షలుసంపాదించారు. కానీ ఏం ప్రయోజనం? గట్టిగా నోటికి ఇంపుగా తినటానికిలేదు. చప్పిడికూరలూ, చపాతీలుతినేసలేచిపోతున్నారు... ఎవరి కోసమే ఇదంతా... మనకోసమేకదుటే" అంది ఆవేశంగా కవిత.

"అదికాదే..." అని ఏదో అడ్డు చెప్ప బోయింది పావని.

"ఇంక నువ్వు నాకేం చెప్పకు. యు ఆరే బిగ్‌యాస్..." అనేసి కవితఅక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఈ ఇంట్లోనివాళ్ళంతా అంతులేని ప్రేమను తనమీద ఒలకబోస్తున్నారు. నిజమే....కాదనలేదు. కానీ ఎప్పటికయినా తను పరాయిదే. వాళ్ళ మంచితనానికి పాత్రురాలైందన్న ఒకేఒక్క అర్హతతప్ప తనకు మరో యోగ్యత ఏముంది? ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక మిషమీద తను దూరం కావాల్సిన మనిషే. అందులో సందేహంలేదు. అయినాఇప్పట్నించే వీళ్ళ మనసును గాయపరచటం మంచిది కాదు-అనినిశ్చయించుకుందిపావని. ప్రస్తుతానికి ఉద్యోగ ప్రయత్నం విరమించుకోవటం మంచిదనుకుంది. అయితే పాపం శేఖర్ అక్కడ తనకోసం ఎదురు చూస్తుంటాడు. కాబట్టి వెళ్ళి అతనికి తన అశక్తతను చెప్పి రావటం కనీస కర్తవ్యంగా భావించింది.

పావని మర్నాడు తొమ్మిదిగంటలకు బయటకు వెళ్ళటం చూసిన కవితకు మరింత కోపం వచ్చింది. ఆ ముష్టి ఉద్యోగంలో చేరటానికే వెళ్తోందని అను





కుంది. ఎంత చెప్పినా తనమాట కాద న్నందుకు కవితకు గొంతువరకూ ఉక్రోషమూ వచ్చింది.

పావనిని చూడగానే శేఖర్ ముఖం విప్పారింది.

"రండి. ఇప్పుడు కూడా వెళ్ళి అడి గొచ్చాను. తీసుకు రమ్మన్నారు. జీతం సంగతే నాకూ తృప్తిగా లేదు. అయినా రెండు నెలలు చూశాక పెంచుతామని అన్నారు" అన్నాడతను ఉత్సాహంగా.

"సారీ శేఖర్‌గారూ ... నేను మీకు చాలా శ్రమనిచ్చాను. ఈ ఉద్యోగానికి మా ఇంట్లోవాళ్లు ఎంతమాత్రం ఒప్పుకోవటం లేదు. చాలా నిష్ఠూరంగా మాట్లాడుతున్నారు. ఏం చెయ్యాలో తెలియటంలేదు" అంది పావని.

"అలాగా...అయితే మీ ఇష్టం మరి" అన్నాడతను నీరుగారిపోయి.

"వాళ్ళమాట కాదంటే నేను చాలా అవస్థలు పడాల్సివస్తుంది" అని సంది గ్ధంగా ఆగిపోయింది.

"సర్లెండి. నేనే ఏదో సర్ది చెప్పేస్తాను. మీరు అవస్థపడటం ఎందుకు?" అన్నాడు.

మరోసారి క్షమాపణలు చెప్పుకుని వచ్చేసింది పావని.

కానీ కవిత పావనితో మాట్లాడటం మానేసింది. దెప్పటం మొదలెట్టింది.

పావని వినేటట్లుగా తల్లిని అడిగింది కవిత "అమ్మా... ఈ నిమ్మకాయలు ఎంతకు కొన్నావే?"

"రూపాయకు రెండుట"

"అదే ఆ సేల్స్ గర్ల్ మనకు బాగా తెల్సివుంటే రూపాయకుమూడు ఇస్తుంది" అంది కవిత.

ఆరోజు రాత్రి కవిత తండ్రితో చెప్పింది, "డాడీ....ఈ పూట నుంచీ నేను భోజనం చేయటం లేదు"

"అదేమిటమ్మా? ఏమైంది?"

"నా కడుపు నిండిపోయింది"

"విషయం ఏమిటి?" అని ఆరా తీశాడాయన.

"ఏం లేదు. మీకు నామీద బోలెడంత ప్రేమ ఉంది, చాలు. కడుపు నిండిపో యింది. ఇంత తిండి కూడా ఎందుకు? దండగ" కూతురి వ్యంగ్యం తండ్రికి అర్థమైనా, కారణం తోచలేదు.

"నన్నిలా క్రాస్ ఎగ్జామిన్ చేయ కుండా పాయింటుకురా"

"నేను ఒకళ్ళకు ఉద్యోగం ఇప్పించ మన్నాను. మీరు ఇప్పిస్తామన్నారు. కానీ మర్చిపొయ్యారు. ఎన్నిసార్లు గుర్తు చేసినా ఇదుగో, అదుగో అంటున్నారు. అద్సరేగానీ డాడీ...మీకు గడ్డం చేసుకునే బ్లేడులు కావాలా?" అని అడిగింది కవిత మాటమార్చి.

"అదేమిటి సడెన్‌గా బ్లేడ్ల మీదకెళ్ళి పొయ్యావ్?"

"ఏంలేదు. ఒక్కసారే నలభై పాకెట్లు తీసుకుంటే అయిదు పైసలు తగ్గిస్తాం ... నువ్వెలాగూ ఉద్యోగం ఇప్పించలేవుగదాని నేను ఇంటింటికి తిరిగి బ్లేడ్లు, అగరొత్తులు, అప్పడాలు అమ్ముదామనుకుంటున్నాను" అంది కవిత. పావని నవ్వుకుంది.

"నీకంత ఖర్మేం పట్టిందమ్మా? ఇంత పెద్ద ప్లీడరుగారి కూతురివి... అప్పడాలు, వడియాలు అమ్మటమేమిటమ్మా" అని తెగ ఫీలయిపోయాడాయన.

"నీకు తెలియదు నాన్నా... ఆత్మ గౌరవం అని ఒకటి ఉంటుంది. ఆ జబ్బు ఉన్నవాళ్లు మనం ప్రేమగా ఏమన్నా

ఇస్తే పుచ్చుకోరు. పెడితే తినరు. అంతా స్వయం శక్తి అంటారు. అంటే నువ్వు మామిడికాయ తెచ్చావనుకో, నేను తినను. ఎక్కడెక్కడో తిరిగి చీకి పారేసిన టెంక సంపాదించి, దాన్ని పూడ్చి పెట్టి, అది పెద్ద చెట్టు అయి కాయలు కాసేదాకా నోరు తెరుచుకు కూర్చుని, అప్పటి దాకా బతికుంటే ఆ చెట్టుకాయలు తింటానన్న మాట. ప్రతిదీ అంతే... అందులో కొండంత తృప్తి,ఆనందం ఉంటాయి.అవన్నీ మీకు తెలియదులే...ఇంతకీ విషయం ఏమిటంటే, ఈ పూటనుంచీ నేను అన్నం తినటం లేదు. నారుపోసి, నీరుపోసి కోత కోసి, ఆ వడ్లు స్వయంగా దంచుకుని, ఆ బియ్యం వండుకుని తింటే అదే నాకు తృప్తి. అంతవరకు నో మీల్స్..." అని కంచంముందు నుంచి లేచిపోయింది కవిత.

"ఏమిటే ఇదిలా మాట్లాడుతోంది?" అని ప్లీడరుగారు ఆశ్చర్యపోతే, పావని చెప్పింది.

"అదంతా నామీదకోపం. నేను ఏదో చిన్న ఉద్యోగందొరికితే, అందులోజేరతానన్నానని ఈ విసుర్లు విసురుతోంది" అని చెప్పింది పావని.

అప్పటికిగాని ఆయనకు అసలుసంగతి తెలియలేదు. మర్నాడు పావనికి మంచి ఉద్యోగం ఇప్పిస్తానని ఆయన ఎంత చెప్పినా వినకుండా కవిత పస్తుపడుకుంది.

మర్నాడు పొద్దున్నే కాఫీకూడా తాగలేదు.

"నన్ను నీలగిరి పంపించండినాన్నా! అక్కడ కాఫీతోటల్లో పనిచేసి గింజలు తెచ్చుకుని పొడిచేసుకుని కాఫీ తాగుతాను..." అంది కవిత.

"నేనుపావనికి ఇవ్వాళే ఇంకోగంటలో మంచి జాబు ఇప్పిస్తాను"అని నచ్చచెప్పి కాఫీ తాగించారు.

సత్యనారాయణగారు రెండు మూడు పెద్ద కంపెనీలకు లీగల్ అడ్వైజర్ కూడా.అందుకని ఆయనమాటఆ కంపెనీ వాళ్లు కాదనలేకపోయ్యారు. ఆమెకోసం పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుపోస్టు ఒకటి సృష్టించి పదిహేనువందల రూపాయల జీతంమీద నియమించారు.

పావని ఆరోజే పనిలోచేరింది. అప్పటికప్పుడే కవితకు ఫోనుచేస్తే 'కంగ్రాట్స్' చెప్పి "పార్టీఇవ్వాలమ్మాయ్" అని గుర్తు చేసింది.

ఆసాయంత్రమే పనిగట్టుకుని శేఖర్‌కు ఫోన్‌చేసి, పిలిచిమరీ పార్టీ ఇచ్చింది పావని.




ఆ వేళ పద్మలత పెళ్ళి. సాయంత్రం ఆఫీసునుంచిరాగానే స్నానంచేసి బయల్దేరుతుంటే కవిత అడిగింది ఎక్కడికని.

"ఒక స్నేహితురాలిపెళ్ళి, ఇక్కడే, దగ్గరే.. తొమ్మిదింటికల్లా ఇంటికొచ్చేస్తాను..." అంది పావని.

"పెళ్ళికి అలాగేనా వెళ్లేది? నా పట్టుచీర కట్టుకెళ్లు..." అంది కవిత.

"వద్దే, వాళ్లే చాలా నిరాడంబరంగా చేసుకుంటున్నారు. పెళ్ళికూతురుకూడా పట్టుచీర కొనుక్కోలేదు. నేను కట్టుకెళ్తే

ఏంబావుంటుంది చెప్పు?" అని చెప్పి బయల్దేరింది.

పావని వెళ్లేటప్పటికి అక్కడ పెద్ద హడావుడేంలేదుగాని, నలుగురు అయిదు గురు అతని ఫ్రెండ్స్ కాబోలు బయట కుర్చీల్లోకూర్చుని మాట్లాడుకుంటున్నారు. పావనిని చూడగానే పెళ్ళికొడుకేలేచి పెళ్ళికూతుర్ని పిల్చాడు.

"లతా... ఎవరొచ్చారో చూడు" అంటూ.

పద్మలత లోపలినుంచి బయటకొచ్చి పావని చెయ్యిపట్టుకుని సాదరంగా ఆహ్వా నించింది. కాబోయేభర్తను పావనికి పరిచయం చేసింది. అతను పచ్చగా, బక్కపల్చగావున్నా అందంగానేఉన్నాడు. ఆప్యాయంగా నవ్వుతూ, వినయంగా మాట్లాడుతున్నాడు. అక్కడ కూర్చున్న వాళ్లందర్నీ కూడా పరిచయంచేసి, 'వీళ్లంతా నా కొలీగ్స్' అన్నాడు. అందులో ఒకామెపేరు భవానీ.. అందర్నీ ఆకర్షించేటట్టు మాట్లాడుతోంది. భాస్కర్ అనే మరో ఫ్రెండును మాటలతో చిత్తు చేస్తోంది.

పద్మలత పావనిని లోపలికి తీసుకు పోయింది. అక్కడ శాంత, మిగిలిన ఫ్రెండ్సూ ఎదురైనారు. వాళ్లను చూడ టానికి పావని ఎందుకో కొంచెం గిల్టీగా ఫీలయింది. కానీ వాళ్లెవరూ పావని పెళ్ళి గురించిన ప్రస్తావన ఎత్తలేదు. ముందు గానే పద్మలత ఆ జాగ్రత్తపడిందని పావనికి అర్థమైంది.

"ఇప్పుడేం చేస్తున్నావు, ఎలా ఉన్నావు?" అనిమాత్రం అడిగింది శాంత. ఉద్యోగంసంగతి తెలిసి అదృష్ట వంతురాలన్నారు అందరూ ఏకగ్రీవంగా.

ఒక పావుగంట తర్వాత అంతా ఆరుబయట కూర్చున్నారు. అక్కడున్న నాలుగువాటాల్లో ఉన్న పెద్దతలకాయ ఒకాయనపెళ్ళికి సారథ్యం వహించాడు. పూలదండలు మార్పించి, తాళికట్టించాడు. అందరూ అక్షింతలువేశారు. ఒకఅయిదు నిముషాలు ఆయనే అబ్బాయి మంచితనం గురించి, అమ్మాయి నెమ్మదిగురించీ పొగిడాడు.

"ఇక్కడున్న మిగిలినవాళ్లంతా గూడా వీళ్ల అడుగుజాడల్లోనే నడిచి నా మాటవిని ప్రేమించి పెళ్ళిళ్లుచేసుకుంటే వరకట్నసమస్య పరిష్కారం అవుతుంది ..." అని ఆయన సూచనచేయగానే భవానీ అంది.

"ఇక్కడున్నవాళ్లల్లో కొందరికి ఇదివరకే పెళ్ళి అయిందండి. వాళ్లను కూడా ఫ్రెష్‌గా ప్రేమించి పెళ్ళిళ్లు చేసు కోమంటారా?"

అందరూ ఫక్కున నవ్వేశారు.

అతనిస్నేహితుడు భాస్కర్ ఫొటోలు తీశాడు. వాళ్ళు ఏ పోజుల్లో నిలబడాలో భవానీ డైరెక్షన్స్ ఇచ్చింది.

"మీరిద్దరూ చేతులుపట్టుకు నిలబ డండి" అంది భవానీ కొత్త దంపతులతో.

"ఎవరి చెయ్యి పైనుండాలి?" అని అడిగాడు భాస్కర్.

"మా ఇద్దర్లో లతదే పైచెయ్యి" అని ఒప్పేసుకున్నాడు పెళ్ళికొడుకు. మళ్ళీ అంతా నవ్వారు.

"అయినా ఇకనుంచీ నేను మీ చెయ్యి పట్టుకునే నడవాలిగదా" అంది పద్మలత.

"ఎందుకొచ్చినగొడవ... చేతులుపడ కుండా తియ్యండి" అంది భవానీ భాస్కర్‌తో.

"అలాగే. అసలేంపడకుండానేతీస్తాను లెండి" అన్నాడు కెమేరా సర్దుకుంటూ.

''మీరు ముందుకు పడతారు జాగ్రత్త" అని చెప్పింది భవానీ.

అక్కడున్నవాళ్ళందరికీ ఓ స్వీటూ, బిర్యానీ, కూల్ డ్రింక్స్ సర్వ్ చేశారు పావని, శాంత.

"డ్రింక్ కావాలి నాకు" అంది భవానీ పావనితో.

"మీరుకూడా తాగుతారా!" అన్నాడు భాస్కర్ భవానీతో.

"ఎందుకు తాగను? నిక్షేపంగా తాగుతాను"

"కూల్‌డ్రింక్సేనా, హాట్‌డ్రింక్స్ కూడానా?"

"ముందు అసలు నేను హాట్‌డ్రింక్స్ తోనే మొదలెట్టాను. ఇప్పటికి నిద్దర లేవగానే ఫస్ట్ హాట్‌డ్రింక్‌తోనే మన రొటీన్ మొదలవుతుంది"

"అయ్యబాబోయ్..."

''కాఫీ అంటే నాకంత ఇష్టం"

"రక్షించారు"

భాస్కర్ సిగరెట్టు ఆఫర్ చేస్తే పెళ్ళికొడుకు తాగనన్నాడు.

"పద్మలతకి సిగరెట్టు వాసన గిట్టదు. అందుకని మానేశాను" అన్నాడతను.

"మొగుడంటే అలా ఉండాలి. మీరూ ఉన్నారు? అరమైలు దూరంలో ఉండగానే పొగాకు బేరన్లు వాసనంతా మీ దగ్గరే ఉంటుంది" అంది భవానీ భాస్కర్‌తో

"ఇప్పుడేగదా పెళ్ళయింది. అప్పుడే వాసన గిట్టకపోవటందాకా వెళ్లారా?" అని అడిగాడు భాస్కర్.

"మీరు మరీనూ...వాసన గిట్టకపోతే పెళ్ళి ఎలా అవుతుందనుకున్నారూ" అని మందలించింది భవానీ.

తర్వాత వెళ్ళబోతూ భవానీ పద్మలత దగ్గరకొచ్చి అన్నది. "చూడండి...మగపెళ్ళివాళ్ళ తరపున వచ్చిన ఆడశాల్తీని నేనొక్కదాన్నే కనుక మీరేమనుకున్నా సరే నే చెప్పవల్సిన అప్పగింతలు చెబుతున్నాను. మీ ఆయనకు ఆఫీసులో పని ఎక్కువగా ఉంటుంది. హెవీ సీటు. మార్చుకున్నా మార్చరు. ఇక్కడే మో ఇంట్లో కొత్తగా పెళ్లయిన రోజులు... ఎలా నెగ్గుకొస్తారో ఏమిటో?" అంది లేని పెద్దరికం ఆపాదించుకుని.

"ఇంతకీ ఇంటా బయటా నలిగిపోకుండా చూడమంటారు ? అంతేగదా" అన్నాడు భాస్కర్.

"ఆడవాళ్లవిషయాలుమీకెందుకండీ?" అని కోపం తెచ్చుకుంది భవానీ.

ఏదో చెప్పబోతున్న భాస్కర్‌కు భవానీ అడ్డుపడింది.

"పదండి, పదండి ... మా హాస్టల్ గేటు మూసేసే టైం అయింది"

"మీ వర్కింగ్ వుమన్స్ హాస్టల్ గేటు మూసేసినా భయంలేదు. మా బాచిలర్స్ హాస్టలుకు వచ్చి మాతో ఉండొచ్చు. మాలాగా పాంటూ, షర్టూ వేసుకున్నారంటే దిగుల్లేదు. ఎవరికీ అనుమానం రాదు"

"అనుమానం వస్తే మరీ మంచిది. మనకు బోలెడంత మర్యాద చేస్తారు'' అంది భవానీ.

మరోసారి అందరిదగ్గరా శలపు తీసుకుని వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

తర్వాత పద్మలత పావనితో చెప్పింది ''వాళ్లిద్దరూ మావారి ఆఫీసులో పని చేస్తున్నారట. ఇద్దరూ పోస్టుగ్రాడ్యుయేట్స్. మూడునెలలే అయిందిట ఆ అమ్మాయి జేరి... వచ్చే నెల్లో పెళ్లి చేసుకోబోతున్నారు. ఇంతకీ నేను చెప్పొచ్చిందేమిటంటే అర్థంలేని సిద్ధాంతాలతో




మన చుట్టూ గిరి గీసుకుని కూర్చుంటే, పనిగట్టుకునివచ్చి ఎవరూ మన సమస్యను పరిష్కరించరు. లోకం తీరు ఎలా ఉందో చూడు. పరిగెత్తే కాలంతో పాటు మనమూ కల్సినడవాలి. మన తండ్రులకు ఏది మంచిదో అదంతా మనకు మంచిదికాదు. అని ఇంగ్లీషు సామెత ఒకటి ఉంది. తరాలు మారేకొద్దీ వారిమధ్య అంతరాలు ఏర్పడకుండా ఉండవన్నది మనకు తెల్సిన విషయమే... అయినా ఎవరో వస్తారనీ, మనల్ని ఉద్ధరిస్తారనీ ఎదురుచూస్తూనే యవ్వనాన్ని గడిపేస్తే, ఆ తర్వాతమనకు మిగిలేది మనస్తాపమే. అనుకున్నప్పుడల్లా అవకాశాలు కల్సిరావు. ఆకాశంలోమెరిసే నక్షత్రాలు ఎంత అందంగా ఉన్నా అవి మనకు అందవు. అందనివాటికోసం అర్రులు చాస్తూ, కాళ్లముందున్న వాటిని కాలదన్నుకోవటం మంచిదికాదు పావనీ"

పావనికి కూడా వాళ్ల అన్యోన్యత బాగా నచ్చింది. పద్మలత జంటే అనుకుంటే, భవానీ జంట మరీ బావున్నారు. జీవితంలో చీకూ చింతా అన్నదే తెలియనట్లూ, ఆనందం వాళ్ల హక్కుభుక్తమైనట్లూ ఎప్పుడూ సరదాగా, కేరింతలతో ఉండగలగటం ఎంత అదృష్టం! అసలు వాళ్లిద్దరూ పెళ్లికానివాళ్లులాగా లేరు. ఎన్నాళ్లో కల్సికాపురం చేసిన వాళ్లలాగా ఉన్నారు.

పొద్దుపోయిందని శాంతకూడా వెళ్లిపోయింది. పావని బయల్దేరే ముందు చెప్పటానికి వెళ్లినప్పుడు పద్మలత మొగుడు అన్నాడు.

"చాలా థాంక్స్ అండీ... ఈ వీధవాళ్ల ఆహ్వానాన్ని మన్నించి వచ్చి, మీ ఆశీస్సులు అందించారు"

"ఎందుకలా ఫీలవుతారు? ఈ పెళ్లివల్ల మీ ఇద్దరి జీవితాలకూ ఎంతో నిండుదనం లభించింది. ఇవాళ పాతికవేల కట్నాన్ని మీరు పోగొట్టుకుని ఉండొచ్చు కానీ తర్వాత కాలంలో లక్షలూ, కోట్లూ పోసినా కొనుక్కోలేని అన్యోన్యతనూ, అనురాగాన్ని అందించే అర్థాంగినీ పొందగలిగారు. అదిచాలదా?" అందిపావని.

"నిజమేనండీ, నేనూ మీతో ఏకీభవిస్తాను" అన్నాడతను.

"అప్పుడప్పుడూ వస్తూండు" అంది పద్మలత పావనితో.

"ఇప్పుడప్పుడే వచ్చిమిమ్మల్ని డిస్టర్బ్ చేయనులే" అంది పావని నవ్వుతూ.

అక్కడినుంచి వచ్చాక గూడా పావని వాళ్లగురించే ఆలోచిస్తూ కూర్చుంది. తను చాలా పెళ్లిళ్లు చూసింది. ప్రతిచోటా ఎంతో హంగు, ఆర్భాటం, పటాటోపం కనిపిస్తాయి. వందలమంది మందగా చేరతారు. వీళ్లందరి ముందు ఆ అమ్మాయి ఘోరమైన నేరం చేసినదానిలా తలదించుకుని కూర్చుంటుంది. ఆ అబ్బాయి ఏదో సాధించిన వాడిలా విజయగర్వంతో చూస్తుంటాడు. వచ్చినవాళ్లంతా ఎవరి గొప్ప వాళ్లు ప్రదర్శించుకుంటుంటారు. కానీ పద్మలత పెళ్లిలో పందిళ్లూ, బాజాభజంత్రీలు, పట్టుచీరలు, సెంటువాసనలూ లేకపోయినా, ఎంతో హాయిగా ఉంది. వచ్చిన నలుగురికీ ఆప్యాయత పంచిపెట్టారు. ఆహ్లాదాన్ని అందించారు. ఇదెందుకో తనకు బాగా నచ్చింది.

పద్మలత అదృష్టవంతురాలు అనుకుంది పావని.

ఆమె ఇచ్చిన సలహాను మర్చిపోలేకపోతోంది తను. ముఖ్యంగా భవానీ చలాకీతనం, చురుకుదనం మగవాళ్లలోకూడా లేదనిపిస్తోంది. ఆపాటి చొరవతీసుకుంటేనే





గాని ఈనాటి ఆడపిల్ల నెగ్గుకురాలేదేమో నన్న సందేహమూవస్తోంది.

ప్రసాద్ గుర్తొచ్చాడు. ఆనాటిహోటల్ రూంలో సన్నివేశమూ మనసులో మెదిలింది. అతనికోరిక మన్నించి ఉంటేతనూ ఈపాటికి అతని ఇల్లాలు అయిపోయి ఉండేదేమో? అర్థంలేని మొండితనంతో అవకాశాలను జారవిడుచుకుందేమో? తనకు ఇదొక అనుభవం నేర్పిన పాఠం. దీన్ని మర్చిపోకూడదు అనుకుంది పావని.

పావనికి ఉద్యోగం వచ్చిందని తెల్సినప్పటినుంచి ఆమె తల్లిలోనూ, తండ్రిలోనూ మార్పువచ్చింది. మళ్ళీ పావనిని తమ ఇంట్లోకి రప్పించుకోవాలనే ప్రయత్నం చేశారు.

తండ్రి ఒకనాడు మేడ మీదకొచ్చి కూతురుతో అన్నాడు. "ఇంకా ఎన్నాళ్ళుంటావు వీళ్ళింట్లో? వాళ్ళ మంచితనాన్ని మరీ ఇంత ఇదిగా వాడుకోవటం మర్యాద కాదు. పద మనింట్లోకి" అన్నాడు.

"మనిల్లా? నాకు ఉద్యోగం లేనప్పుడు ఇంట్లోంచి బయటకు గెంటేశావుగా? అది మనిల్లు ఎలా అవుతుంది? మీ ఇల్లు అవుతుంది గాని" అంది పావని.

"నీ మొహంలే. గెంటటం ఏమిటే? సంసారమన్నాక సవాలక్ష గొడవలొస్తాయి. అంతమాత్రాన తెగదెంపులు చేసుకుంటామా ఏమిటి?"

"స్వార్థం మితిమీరినవాళ్ళతో తెగదెంపులు చేసుకోవటమే మంచిది"

"ఇందులో స్వార్థం ఏముందే? కన్న పిల్లకు మంచీ చెడూ చెప్పుకునే యోగ్యత కూడా లేదా మాకు?"

"నేను జీతం తేవటంలేదన్న రోజున, ఆడపిల్ల అన్న విచక్షణ కూడా లేకుండా

బయటకు పొమ్మన్నావు. ఇవాళ మళ్ళీ నాలుగు రూపాయలు తెచ్చుకుంటుంటే, ప్రేమ ఒలకబోస్తున్నావు. నీ ఇచ్చకాల కబుర్లు ఇంక చాలు. వెళ్ళు''

''అవునే... ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరక్కచస్తుంటే, నువ్వు ఉన్న ఉద్యోగం వదులుకోవటం తప్పు కాదూ...తర్వాత ఇంకో ఉద్యోగం దొరకాలంటే ఎంత అవస్థ పడాల్సి వచ్చింది? నీ మేలు కోరే వాళ్ళం గనుక ఒక మాటంటే అది తప్పా? అయినా పొమ్మంటే మాత్రం నువ్వెక్కడికి పోతావు? ఆ పోర్షనులో నుంచి ఈ పోర్షన్‌లోకి వచ్చావు. అంతేగా తేడా...అసలు ప్లీడరుగారు, సరస్వతమ్మ గారు మనపాలిటి పార్వతీపరమేశ్వరులు''

''స్తోత్రాలు ఆపు. అపుడయినా నేనేం కావాలని మానేశానా? సరే, నువ్వెన్ని చెప్పినా, నేను ఇంక నీ ఇంటి గడప తొక్కను. ఇది నా నిర్ణయం''అని ఖచ్చితంగా చెప్పేసి ఆయన ముందునుంచి వెళ్ళిపోయింది పావని-

తల్లి కూడా వచ్చి కూతురుకు నచ్చ చెప్పబోయింది. కానీ పావని వినలేదు. సరస్వతమ్మగారితో అంది పావని.

''పిన్నీ, నేను మీ ఇంట్లో ఉండటం మీకు భారంగా ఉంటే చెప్పండి. వేరే ఎక్కడికన్నా వెళ్ళిపోతాను''

''పిచ్చిదానా, ఎక్కడికెళ్తావు మమ్మల్ని విడిచిపెట్టి... నిన్ను పరాయి దానిలాగా మేం ఎప్పుడన్నా చూశామా? మా పెద్దపిల్లలాగానే భావించాం. నీ పెళ్ళి బాధ్యత కూడా మా మీదే ఉంది'' అన్నదామె నవ్వుతూ.

''కొంతమంది కన్నపిల్లలతో వ్యాపారం చేస్తారు. మరికొంతమంది ఏ సంబంధమూ లేకపోయినా అనుబంధాన్ని పెంచుకుంటారు. దేవుడెక్కడో లేడు పిన్నీ... మీలాంటి మంచివాళ్ళ గుండెల్లోనే గూడు కట్టుకుని ఉన్నాడు'' అంటూ పావని కన్నీళ్ళు నింపుకుంటే ఆమె వాటిని తుడిచింది.

* * *

ఆవేళ పావని ఆఫీసుకు బయల్దేరే టప్పటికే కొంచెం లేటు అయింది. గబగబా నడుస్తూ డిపో దాకా వచ్చింది. అప్పటికే బస్సులన్నీ వెళ్ళిపోయినయి. అయినా ఇంకా రెండు బస్సుల జనం ఉన్నారు. అందరికీ ఆఫీసులకు వెళ్ళేవేళ! వీలైనంత తొందరగా వెళ్ళిపోవాలనే ఆత్రంలో ఉన్నారందరూ.

ఒక ఆటోవస్తే ఒక్కసారిగా నలుగురయిదుగురు దాన్ని చుట్టుముట్టేస్తున్నారు. ఏదో ఒకరకంగా వెళ్ళిపోవాలన్న తొందరలో ఉన్న పావని దగ్గరకో ఆటోవచ్చి ఆగే సరికి చటుక్కున ఆమె అందులో కూర్చుంది. రెండో వైపునుంచి మరో అతను కూడా ఎక్కి కూర్చున్నాడు.

ఒకర్ని చూసుకుంటూ మరొకరు ఇద్దరూ నవ్వుకుంటూ దిగబొయ్యేలోపల ఆటో బయల్దేరింది.

''మీరెందాకా?'' అని అడిగింది పావని.

''నాంపల్లిదాకా?'' అన్నాడు శేఖర్.

''నేనూ అక్కడికే'' అందామె.

''ఈ బస్సులతో పెద్ద ప్రాబ్లంగా ఉందండీ-జనాభా పెరిగిపొయ్యారుగదండీ ఎన్ని బస్సులు వేసినా చాలటంలేదండీ'' అన్నాడతను.

''మరేనండి'' అంటూ ఆమె బయటకు చూస్తూ ఉండిపోయింది. అతను కూడా మాటలు మానేసి రెండో వైపునకు చూస్తున్నాడు.




ఒక లారీని ఓవర్‌టేక్ చేయడంవల్ల, అతను కొంచెం ఆమెవైపు వాలాడు.

"సారీ అండీ"

"ఫర్లేదండి"

"ట్రాఫిక్ హోప్‌లెస్‌గా ఉందండి... కానీ నేను మీ మీదకు తూలితే, మీరు అనవసరంగా నా శీలాన్ని శంకించే ప్రమాదం ఉందండి" అన్నాడతను సంజాయిషీగా.

"మీకు కూడా ఆ భయం ఉందా?" అని నవ్వింది.

"ఎందుకుండదండీ?...కొద్దో గొప్పో పరువుగా బతుకుతున్నాను కదండి"

ఇంకోరోజుకూడా అదే పరిస్థితి ఎదురయింది. ఆటో ప్రయాణం తప్పలేదు. ఈసారికూడా అతనే జతకలిశాడు. పాత చనువుతో ఆటో మాట్లాడాడు.

"మీరో స్కూటరు తీసుకోరాదా ఈ గొడవ తప్పుతుంది" అంది పావని.

"ఇదివరకు కొన్నాళ్లు సరదాపడి కొన్నానండి. కానీ లోకసంచారం చేయటంలో నారదుడి తర్వాత నేనేనండి. అందుచేత నా సంపాదన పెట్రోలుకే సరిగా దాలదన్న విషయం తెల్సిన మర్నాడే అమ్మేశానండి. కాని మీరు ఎంకరేజ్ చేస్తే మళ్ళీ కొంటానండి" అన్నాడు శేఖర్ పొంగిపోయి.

"ఎంకరేజ్‌మెంట్ కేమండీ... బ్రహ్మాండంగా చేస్తాను. అసలు మీకు మీ పర్సనాలిటీకి స్కూటర్లు, ఆటోలు లాభం లేదండి. కారు కొనాలండి. మీరు సొంతంగా డ్రయివ్‌చేస్తుంటే ఎంతో బావుంటారు"

"థాంక్సండీ... కారుకూడా కొంటున్నానులెండి. వచ్చేనెల ఇరవయ్యోతారీకున నాకు రెండుకోట్లు వస్తయ్యండీ"

"రెండుకోట్లా? ఎవరు విడిచిపారేసినవండీ?"

"అబ్బే..విడిచిపారేసిన కోట్లు కాదండి. రెండుకోట్ల రూపాయలు వస్తాయండీ లాటరీలో ఆ లక్కీ టిక్కెట్టు నాదగ్గరే వుంది...చూపించమంటారా?"

"వద్దండి. మీ మాటమీద నాకు నమ్మకముందండి"

"అది తగిలిందనుకోండి. దశ తిరిగిపోతుందండి. అప్పుడండీ...మన తిండి మనల్ని తిననివ్వరండీ, మన బట్టలు మనల్ని కట్టుకోనివ్వరండి"

"అయ్యో పాపం!"

"అంతా పనివాళ్ళే చూసుకుంటారండి"

"అవునవును ... పనివాళ్లుండకపోతే ఎలా?"

"స్కై-బ్లూ, పద్మినీప్రీమియర్ కొందామా కాంటెస్సా కొందామా అని చూస్తున్నానండి" అని ఆలోచనలోపడ్డాడు శేఖర్.

"రెండూ కొనండి. ఏ ఒకటి చెడిపోయినా రెండోదానికి తాడుగట్టి లాక్కెళ్ళవచ్చు" అని సలహాచెప్పింది పావని.

"వెరీగుడ్ ఐడియా. అన్నట్లు మీకు ఫ్రీ లిఫ్టు అండోయ్"

"మీ కార్లో నే వచ్చినాదాను. నాకొద్దా లిఫ్టు..."

"అదేమిటండి?"

"సగం దూరంతీసుకెళ్ళి చాదర్‌ఘాట్ బ్రిడ్జిమీద ఆపేసి చెడిపోయింది, తొయ్యమంటారు. నాకెందుకొచ్చింది వెధవగోల. ఓ అర్ధరూపాయిపారేస్తేబస్సులోపోవచ్చు"

"అదికాదండి..ఉన్ననాడూ,లేనినాడూ ఒకేలాగా వుండాలని నా ఆశయం. మీరు బస్సులోనూ, నేను కార్లోనూ వెళ్ళిపోతే నా ఆశయం ఏం కావాలి?"



''మీరెప్పుడూ ఒకేలాగా ఉండాలన్న మీ ఆశయం నెరవేరాలంటే, అప్పుడూ ఇలాగే బస్సులో వెళ్ళటం క్షేమం. ఇది వరకు కాశీకిపోయినవాడు కాటికిపోయిన వాడూ సమానం అనే వాళ్ళు. ఇప్పుడు హైదరాబాదులో స్కూటరు మీద పోయిన వాడు కాటికిపోయినవాడూ సమానం అంటున్నారు. మళ్ళీ తిరిగొచ్చేదాకా నమ్మకంలేదండి'' అంది పావని.

''మొత్తానికి ఆడపిల్లననిపించారు''

"అనిపించటమేమిటండీ...నేను ఆడ పిల్లనేగదా''

''ఆడపిల్లలు కూడా ఝామ్మని తిరి గేస్తున్నారండీ స్కూటర్లమీద'' అన్నాడు.

ఈలోగా ఆమె చేతిమీద ఓ ఈగ వాలటంచూసి దాన్ని చేత్తోతోలేశాడు శేఖర్.

ఆమె నవ్వింది.

"మీమీద ఈగ వాలనివ్వనండీ" అన్నాడతను.

"చాలా థాంక్స్" అని నవ్వింది.

''మీరు నమ్మరేమోగానీ, నాకు నిజంగా లాటరీలో రెండు కోట్లువస్తే బాగుండునని ఉందండీ! ఎందుకంటే అవి పెట్టి నాలుగు సిన్మాలు తీసేద్దామనుంది" అన్నాడు శేఖర్.

"నాలుగు సినిమాలే...?" ఆశ్చర్య పోయింది పావని.

''అవునండీ! మీ పాటలు దేశమంతా మార్మోగాలంటే నాలుగన్నా తీయకపోతే ఎలా?" అన్నాడు శేఖర్.

నాంపల్లిలో దిగాక చెరోవైపు వెళ్ళే టప్పుడు పావని చెప్పింది-

"రేపు ఆఫీసుకు వచ్చేముందు ఎనిమి దిన్నరకు రేడియో వినండి"

"ఏం...ఎవరన్నా టపా కట్టేస్తు న్నారా?రేపు మనకు శలవు ఇస్తున్నారా?" అని అడిగాడు ఆత్రంగా.

"టపా కడుతున్నారో, టపా విప్పు తున్నారో వినండి...మీకే తెలుస్తుంది. కానీ మర్చిపోకూడదేం?" అని నవ్వేసి వెళ్ళి పోయింది.

మర్నాడు బస్స్టాపులోకి వస్తున్న ఆమెకు ఎదురెళ్ళాడు అతను. ఆటో దొరికింది. ఇద్దరూ కూర్చున్నారు.

''ఎలా ఉంది నా వాయిస్" అని అడిగిందామె.

''ఒకటే మాట చెబుతున్నాను. మీరు తొందరలోనే పైకి పోతారండి..."

"అంటే ఇంక నాకు భూస్మిద నూకలు చెల్లిపొయ్యాయంటారు?" అంది చిరునవ్వును దాచుకుంటూ.

ఆమె సంగీత సాధన గురించి వివరాలు అడిగాడు.

''నాకు చిన్నప్పటినుంచీ సంగీతం మీద మోజు ఉండేది. పదేళ్ళ వయసులో ఉండగా మా ఇంటి పక్కన మ్యూజిక్ టీచరు ఉండేవాడు. ఆయనే నాకు కొంత కాలం నేర్పాడు. తర్వాత అంతా నా అంతట నేనే ప్రాక్టీసు చేస్తూ వచ్చాను"

''కళాకారులంటే సాటి మనుషులే కాదండీ...భగవంతుడూ ఎంతగానో ఇష్ట పడతాడట. అందులోనూ శ్రావ్యంగా పాడేవారి పాటల్లోనే దేవతలు మురిసిపోతుంటారట ... అందుచేత దేవతలే మీ స్నేహం కోరి వస్తారు'' అన్నాడు శేఖర్.

"చాల్లెండి మరీ మునగచెట్టు ఎక్కించకండి. కొమ్మ విరిగి పడగలను" అంది పావని.

''ఫర్వాలేదండి. పట్టుకోవటానికి నేనున్నాను. మీరు టి.వి.లో పాడటం లేదా?"




"లేదు. నాకెవ్వరూ తెల్సినవాళ్లు లేరు''

"నా ఫ్రెండు ఒకడున్నాడు. రేపు వెళ్దామా, ఒక గంట పర్మిషన్ పెట్టి రండి...చాలు. అసలు మీ అంతట మీరే చొరవ తీసుకుని వెళ్ళాలి"

"ఎక్కడికన్నా ఒక్కదాన్నీ వెళ్ళాలంటే కొంచెం భయం. కొన్నాళ్ళ కిందటి మాట. బయట పాడాలనే కోరికతో ఒకాయన దగ్గరకు వెళ్ళాను. ఆయన చాలా పెద్దవారు. తండ్రిలాంటివాడు. పాడి వినిపించమన్నాడు. పాడాను. బాగా పాడావమ్మా అని భుజం తట్టాడు. కానీ ఎంతకీ భుజంమీదనుంచి చెయ్యి తీయడే? మీ అమ్మ ఎవరు, నాన్నెవరు, ఎక్కడుంటారు, ఏం చేస్తారు-అని వీపు నిమిరటం మొదలెట్టాడు. ఆయన గొప్ప సంగీత విద్వాంసుడన్న అభిప్రాయంతో వెళ్ళాను. వాడొట్టి దగుల్బాజీ వెధవ అన్న అభిప్రాయంతో తిరిగొచ్చాను. అప్పట్నించీ ఒక్కదాన్నీ తెలియనివాళ్ళ దగ్గరకి వెళ్ళాలంటే భయం. ఎక్కడ భుజం తట్టి, వీపు గోకి అభినందిస్తారోనని" అంది పావని.

శేఖర్ పగలబడి నవ్వాడు. "కానీ మా ఫ్రెండ్ అలాంటివాడు కాదులెండి. నోటితోనే అభినందిస్తాడు. చెయ్యి వేసుకోడని హామీ ఇస్తాను" అని అభయం ఇచ్చాడు.

మర్నాడు శేఖర్ పావనిని తనతో తీసుకెళ్ళి ఫ్రెండుకు పరిచయం చేశాడు. అతను ఇదివరకే ఈమె పాట విన్నాడట. అందువల్ల ఆమె పాడటం గురించి పెద్దగా చెప్పాల్సిన అవసరం లేకుండానే ప్రోగ్రాం ఇచ్చాడు. వారం రోజుల తర్వాత రికార్డింగ్ డేట్ ఇచ్చాడు.

"నాకోసం చాలా శ్రమపడ్డారు... కృతజ్ఞతలు" అందామె కాఫీ తాగుతున్నప్పుడు.

"అబ్బే....మీలాంటి అందమైనవాళ్ళ కోసం శ్రమపడటంలో ఎంతో ఆనందం ఉంటుందండి. ఇక్కడికే కాదు, ఇకనుంచీ మీరు ఎక్కడికి రిహార్సల్స్‌కు వెళ్ళినా, రికార్డింగ్‌కు వెళ్ళినా నేను ఎస్కార్ట్ ఇస్తాను...ఓకే"

"మీరు అంతగా తిప్పుతామన్నా తిరిగే ఓపిక నాకు లేదు. పెళ్ళి అయ్యేదాకా ఆడపిల్లలు బయట తిరగ కూడదండి'' అని గుర్తుచేసింది.

"ఎవడండీ, ఆమాట చెప్పిన వెధవ? పెళ్ళికాకముందే బయట తిరగాల్సిన అవసరం ఉంటుందండి. పెళ్ళి అయ్యాక ఇంక అన్నీ మొగుడు తెచ్చిపడేస్తే ఇంట్లోనే దొరుకుతాయిగదండీ. అప్పుడింక బయట తిరగాల్సిన అవసరం ఏముంటుందండి?" అని శేఖర్ అంటే ఆమె హాయిగా నవ్వేసింది.

వాళ్లకు కొంచెం దూరంలో ఇంకో జంట కూర్చున్నారు. అతను ఆమె భుజం మీద చెయ్యివేసి మరీ మరీ దగ్గరకు హత్తుకుంటుంటే పావని చూసీచూడనట్లు చూసింది. శేఖర్‌కూడా చూసి అన్నాడు-

"ఇక్కడ ఎవడి లోకం వాడిదండి. మీరు చూసినా ఫర్వాలేదు. వాళ్లు మన లోకంలో లేరు"

"ఇక్కడెందుకూ ఇవన్నీ? కొత్త దంపతులకు ఇంట్లో ప్రైవసీ దొరకదా?"

"భలేవాళ్ళే మీరు. అతనామెను అంతగా ప్రేమిస్తున్నాడంటే ఆమె ఖచ్చితంగా పరాయివాడి పెళ్లాం అయి ఉంటుంది" అన్నాడు శేఖర్ అక్కడి నుంచి లేస్తూ.



* * *

మొదటిసారిగా టెలివిజన్ తెరమీద తన ప్రోగ్రాం చూసుకున్న రోజున చాలా సంతోషపడింది పావని. అందరూ ఆమె గాత్రాన్ని మెచ్చుకుంటుంటే ఆమెకు శేఖరే గుర్తొచ్చాడు.

ఓ హోటల్‌కి వెళ్ళి కూర్చున్నప్పుడు తనకు లభించిన ప్రశంసల గురించి చెబితే అతను అన్నాడు-

"సమ్ లవ్ మ్యూజిక్ ... ఐ లవ్ విత్‌ఔట్ ఇట్ ఆల్సో..."

శేఖర్ తదేకంగా తన మొహంలోకే చూస్తూ కూర్చుంటే, ఏమిటలా చూస్తున్నారు-అని అడిగింది.

"దేవుడు మీకు అందాన్ని ఇచ్చాడు. ఆ అందాన్ని చూడమనే నాకు నేత్రాలను ఇచ్చాడు. నేనిలా చూడలేదనుకోండి ... భగవంతుడు బాధపడతాడు .... మీ అందమూ, నా దృష్టీ నిరర్ధకమైపోతున్నాయని"

"చాలాదూరం వెళ్తున్నారు" అంది పావని నవ్వును దాచుకుంటూ.

"ఎందుకండీ అంతలేసి అబద్దాలాడతారు? మీకు దూరంగా వెళ్ళమన్నా వెళ్ళలేను. మీ చుట్టూనే తిరుగుతూ ఉండాలనిపిస్తోంది. ప్రాణంలో ప్రాణంగా ఉన్న మిమ్మల్ని వదలి వెళ్ళాలంటే నిజంగా ప్రాణంపోయినంతపనవుతోంది" అన్నాడు శేఖర్.

"మీరు నాణానికి ఒకవైపున మాత్రమే చూస్తున్నారు. నేను పాటలు పాడవచ్చు. కంటికి ఇంపుగా కనిపించవచ్చు...కానీ నిరుపేదను"

"ఫర్వాలేదు. నేను పెద్ద కోటీశ్వరుణ్ని కాకపోయినా సుఖంగా జీవితం గడపగల స్తోమతు ఉంది. ఇంక మీకెందుకు భయం? వెళ్ళి మీ అమ్మా నాన్నలతో మాట్లాడమంటారా మన పెళ్ళి విషయం?" అని అడిగాడు శేఖర్.

"నా పెళ్ళి విషయం మా అమ్మా నాన్నలతో ఎందుకు మాట్లాడాలి?" అంది పావని గంభీరంగా మొహంపెట్టి.

"అవున్లెండి. వాళ్ళు పెళ్ళి చేసుకున్నప్పుడు మీ పర్మిషన్ తీసుకునే చేసుకున్నారా ఏమిటి? మీకు మాట మాత్రం చెప్పకుండా వాళ్ళ పెళ్ళి వాళ్ళు చేసుకున్నప్పుడు, మీ పెళ్ళి మీ ఇష్టప్రకారం చేసుకునే హక్కు మీకుంది. సుప్రీంకోర్టుకు వెళ్ళినా దీనికి తిరుగులేదు. ఇంకేం కావాలి?" అని అడిగాడు శేఖర్.

"నాకు ఐస్‌క్రీం కావాలి" అంది.

తెప్పించాడు.

"మీరు మంచి జోక్ వేశారుగాని ఎవరికీ అర్థంకాదు" అని తన అభిప్రాయం చెప్పేసిందామె.

"ఐన్‌స్టీన్‌నుకూడా మొదట్లో ఎవరూ అర్థంచేసుకోలేదట. ఇప్పుడు నన్నూ ఎవరూ అర్థంచేసుకోవటంలేదు. అంచేత ముందు ముందు నేనూ ఆయనంత గొప్పవాణ్ని అయిపోతానేమోనని భయంగా ఉంది''

"ఇంతకీ ఐన్‌స్టీన్ ఎవరు?''

"ఆయన చాలా గొప్పవాడులెండి. అంతకన్నా ఆయన గురించి నాకూ తెలియదు''

వీళ్ళిద్దరూ ఇలా మాట్లాడుకుంటుండగానే ఎదురు వరసలో ప్రసాద్ వచ్చి కూర్చున్నాడు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు. పలకరించాలా అక్కర్లేదా అన్న మీమాంసలో పడిపోయ్యారు.

శేఖర్ చెయ్యి కడుక్కోవటానికి వెళ్ళినప్పుడు ప్రసాద్ ఆమెవైపు





నడిచాడు.

"నామీద ఇంకా కోపం పోలేదనుకుంటాను'' అన్నాడు.

''అదేంలేదు. నేనా విషయం అప్పుడే మర్చిపోయ్యాను"

''నేను నీతో చాలా విషయాలు మాట్లాడాలి. నా రూంకు రావటం నీకు అభ్యంతరం అయితే మరెక్కడైనాసరే...కాసేపు నీతో మాట్లాడే అవకాశం కావాలి"

"నాకు భయమేంలేదు. మీ రూంకే వస్తాను. ఎక్కడ దిగారు?"

చెప్పారు. మర్నాడు తప్పకుండా రమ్మనిచెప్పి, వెళ్లిపోయ్యాడు.

బయటికొచ్చాక పావని పాన్ కావాలంది. అతను ఆమెకు మాత్రం తెచ్చిచ్చాడు.

"మీకు ఏ అలవాట్లూలేవా? లేక నా ముందు ఇవన్నీ ఆషాడభూతి వేషాలా?" అని అడిగింది.

"ఆ ఆషాడభూతి ఎవరో నాకు తెలియదండి. మీ తోడండి. నిజంచెప్పాలంటే- నాకు ఏ అలవాటూలేదు. డ్రింక్స్ అలవాటులేదు. సిగరెట్టు అలవాటులేదు." అని చెప్పుకున్నాడతను.

"ఒక్క చెడ్డ గుణమైనా లేకపోతే భరించటం కష్టమే. మీరు ఏ నిషా అలవాటులేని తానిషా అన్నమాట"అంది.

"అలా అంటే, అతిగా ప్రేమించటాన్ని మించిన నిషా మరొకటి ఏముందండీ..."

"కానీ మీకు ప్రేమపరీక్ష ఎదురవుతోంది.ఎడబాటు అనివార్యం అవుతోంది" అని సూచించింది.

"ఎందుకని?"

"ఇవాళ మూర్తిగారు ఫోన్‌చేశారు. ఢిల్లీలో కల్చరల్ ప్రోగ్రాం ఉందిట. డ్రామా ఫెస్టివల్స్‌లో ఒక డ్రామా కూడా వేస్తున్నారట. కనుక మన గాన మాధుర్యాన్ని ఢిల్లీకి మోసుకెళ్తున్నాం. ఈ నాలుగురోజులు రిహార్సల్స్. శని వారం రైలు ఎక్కుతున్నాం...." అని చెప్పింది పావని.

"పోన్లెండి. ఇంకా నాలుగురోజులు టైంవుందిగదా" అని గాలి పీల్చుకున్నాడు.

"ఈ నాలుగురోజులూ సాయంత్రాలు మీకు కలవను. రిహార్సల్స్‌కు వెళ్లాలి"

అతను దీర్ఘంగా నిశ్వసించాడు.

"మళ్లీ రావటం ఎప్పుడు?" అని అడిగాడు.

"డ్రామా ఫెస్టివల్స్ అయ్యేదాకా అంతా అక్కడే వుంటాం. పదిహేను రోజులుపైనే పడుతుంది"అన్నది పావని.

"ఇవి ఒక నాలుగురోజులు, అవి ఒక పదిహేనురోజులు, మొత్తం ఇరవైరోజులు మీరు బిజీ అన్నమాట. ఈలోగా జరగవల్సింది కాస్తా జరిగిపోతుంది"

"అంటే?"

"శేఖర్ అనే ప్రేమపక్షి ఎడబాటు వడదెబ్బకు గుర్రై చచ్చిపోతాడు..."

"ఈ మాత్రానికేనా?" అని నవ్వి టాటా చెప్పింది.

* * * *

పావని అభిప్రాయాలూ, ఆలోచనలూ క్రమంగా ఒకదారికి వస్తున్నాయి. పద్మలతను, భవానీని తల్చుకుంటే ఆమెకేదో తెలియని ఆవేశం, ఉత్సాహం శరీరంలో ఉరకలు వేస్తున్నట్లే ఉంటోంది. వాళ్లకన్నా తను ఏ విధంగానూ తక్కువకాదు. ఇంకా చెప్పాలంటే ఎంతో మంది అమ్మాయిలకన్నా కూడా చక్కగా పాడగల టాలెంటు తనకు ఉంది.





ఇక మీదట ఎదురయ్యే ఏ ఒక్క అవకాశాన్నీ ఆమె జారవిడవదల్చుకోలేదు. శేఖర్ కూడా తనంటే పడిచస్తున్నాడు. అయినా వీళ్లిద్దర్లో ప్రసాదే ముందు తారసపడ్డాడు. ఇతనెవరో తెలియకముందే మనసు ప్రసాద్ వైపు మొగ్గుజూపింది. ఆ హోటల్ రూంలో ఆ రోజు అలా తాగి కనిపించకపోతే ఈసరికే ఎంతో కథ నడిచి ఉండేది- అనుకుంటూ ఆ రోజు రిహార్సల్స్ అయ్యాక అతను ఉంటున్న హోటల్ రూంకు వెళ్ళింది. అప్పటికే ఏడున్నర అయింది సాయంత్రం.

''వెల్ కం టు యు, మేడమ్... కూర్చోండి. ఇంతలేటు అయింది ఇంకా రాలేమోననుకుంటున్నాను...''

''వేరేపనిమీద-అంటే మరేం లేదు... రిహార్సల్స్ చూసుకుని వస్తున్నాను''

ఏమి రిహార్సల్స్ అని అడిగాడు. వివరాలు చెప్పింది. విని అభినందించాడు. ఆనందించాడు. ఈసారి ఆమె పాటలు పాడితే, కాసెట్ లో రికార్డుచేసుకుని వెళ్తా అన్నాడు.

''అంత గొప్ప గాయనినేం కాదు లెండి'' అంది మొహమాటపడుతూ.

''అవునో కాదో చెప్పవల్సింది నువ్వు కాదు...మేము. రోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు నీ పాటలు రెండు వినిపడుకుంటాను. మంచి మంచి కలలు వస్తాయి. పొద్దున్నే నిద్దర లేవగానే వింటాను. బోలెడంత ఉత్సాహం వస్తుంది''

''ఇందుకేనా పిల్చారు?''

''కాదు. పిల్చిన పని వేరే వుంది''

''ఇంతకీ ఎప్పుడొచ్చారు?''

''నిన్ననే''

ఇద్దరి మధ్యా కొద్దిసేపు మౌనం చోటు చేసుకుంది. ఇద్దరి అభిప్రాయాల్లోనూ

మార్పు వచ్చింది.ఆనాటి సన్నివేశం అలా జరిగినందుకు ఎవరిమటుకు వాళ్లు ఫీల్ అవుతున్నారు. రెండోవాళ్లతో చెప్పుకుని రాజీపడాలనే తాపత్రయంలో ఉన్నారు. కానీ ఎలా మొదలుపెట్టాలో తెలియక ఆగిపొయ్యారు.

ఈలోగా అతను బెల్ కొట్టి బాయ్‌ను పిలిపించి ఆమెకేం కావాలోతెప్పించి అతిథి మర్యాదలు చేశాడు. తర్వాత నెమ్మదిగా మొదలుపెట్టాడు.

"ఆరోజు నువ్వలా వెళ్లిపొయ్యాక నేను చాలాసేపు బాధపడ్డాను. నిజమే. నేను చాలా తొందరపడ్డాను. దానికి తోడు కాస్త డోసుమీదున్నాను. అందుకే ఏదేదో వాగాను. తెలుగుదేశం నడిబొడ్డున పుట్టి పెరిగిన ఒక అమ్మాయిగా, నీవు ఆమాత్రం రక్షణను కోరుకోవటం సరైనదే! నీ తప్పు ఎంత మాత్రంలేదు. అసలు నువ్వు అలా ఎదురు తిరిగి వెళ్లిపోయిన తర్వాత నీ మీదున్న గౌరవం నాకు మరీ బాగా పెరిగింది. నీ వ్యక్తిత్వం నాకు నచ్చింది... నా మీద నాకే కోపం వచ్చి అసహ్యం వేసింది. ఇన్నేళ్లు ఆగినవాడిని, ఇంకొద్ది రోజులు ఎందుకు ఆగలేకపోయానా అన్న ప్రశ్న వేసుకుంటే సమాధానం రాలేదు. సున్నితమైన నీ మనసును నా మూర్ఖత్వంతో గాయపర్చాను. ఆ వేళే అప్పుడే క్షమించమని కోరాలనుకున్నానుగాని, ఆ ఆవేశంలో నువ్వు వినిపించుకునే స్థితిలో లేవు. ఇప్పుడైనా కాస్త శాంతంగాఆలోచించి నన్ను క్షమించగలవా?" అని అడిగాడు ప్రసాద్.

కొంచెంసేపు మౌనంగా ఆలోచిస్తూ ఉండిపోయిన పావని నెమ్మదిగా మొదలెట్టింది—

"ఆ సంఘటన మిమ్మల్ని ఎంతగా కదిలించివేసిందో నన్నూ అంతగా క్షోభ పెట్టింది. యవ్వనంలో కోరికలు గుర్రాల వంటివి అని అంటారు. ఆనందోత్సాహాలతో ఉరకలు వేసే ఆగుర్రాలు మనిషినీ, మనసునీ కుదురుగా ఉండనివ్వవు. ఆవేశం ఆవహించినప్పుడు కొంచెం ముందడుగు వేయటమూ తప్పుకాదు. విశ్వామిత్రుడంతటివాడు ఆడదాన్ని చూసి చలించి పొయ్యాడు. మామూలు మనుషులం మన సంగతి చెప్పుకోవాల్సిందేముంది? ఇక పెళ్లి అయితే ఆడదానికి రక్షణ ఉంటుంది. లేకపోతే లేదు అన్న నా ఆలోచనా సరి కాదేమో! సాక్షాత్తూ అవతార పురుషుడైన రాముడి భార్యకే రక్షణలేకపోయింది. పోనీ ఆమె కారడవుల్లో ఒంటరిగా ఉంటే ఎత్తుకెళ్లాడని అనుకుందాం. బలపరాక్రమాలకుమారు పేరు అయిన పాండవుల భార్యను నిండు కొలువులో వలువలు ఊడ దీస్తుంటే అంతా చూస్తూ ఊరుకున్నారు. మహాముని భార్య అహల్యకీ తప్పలేదు శాపం...పోనీ పురాణాలు వదిలెయ్యండి. ఇవాళ్టి పరిస్థితి ఎలావుంది? రోజూ పేపర్ నిండా ఎన్ని మానభంగాలు, హత్యలు, దోపిడీల గురించి రాస్తున్నారు? ఆపద సమయంలో ఆదుకోవాల్సిన రక్షకభటులే ఆడదాని మీదపడి ఘోరంగా పరాభవిస్తున్నారు. తల్చుకుంటే ప్రపంచాన్నంతా ధ్వంసం చేయగల అమెరికా అధ్యక్షుడికి నిజానికి ఎంత అంగబలం ఉండాలి? ఆయన్నీ నడిబజార్లో పిట్టను కాల్చినట్టు కాల్చి చంపారు. పరిస్థితులు ఇంత దారుణంగా ఉంటే, అతి సామాన్య కుటుంబంలో పుట్టిన ఒక అమ్మాయి సంగతేమిటి?'' పావని చెబుతుంటే ప్రసాద్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఆవేశాన్ని ఆపుకోవటానికా అన్నట్లు




ఆగిన పావని కొంచెం గాలిపీల్చుకుని కిటికీ బయటకు చూస్తూ నెమ్మదిగా అంది-

"అయితే, నా పరిస్థితులు మరీ దయనీయంగా ఉన్నాయి. అందరి పిల్లల్నీ తల్లిదండ్రులు కంటికి రెప్పలా కాపాడతారు. యవ్వనోద్రేకంలో పిల్లలు ఎక్కడ తప్పుదారిన తప్పటడుగులు వేస్తారో అని వేయికళ్లతో కనిపెట్టి చూస్తారు. కానీ మావాళ్లకు మేం ఏమైపోయినాఫర్వాలేదు. మాకూ వయస్సుతోపాటు కోర్కెలుంటాయనీ, మిగిలినవాళ్లలా పెళ్లి చేసుకుని భర్తతో కాపురం చేయాలనీ, బిడ్డాపాపనీ ఎత్తుకోవాలనే సహజ వాంఛలుంటాయన్న ఆలోచనే రాదు. ఇంటికీ, ఆఫీసుకూ మధ్య గడియారం ముళ్లతోపాటు గానుగెద్దులా తిరుగుతూ నెలనెలా జీతం తెచ్చి వాళ్ల చేతుల్లో పొయ్యాలి మేము. ఇది మోడు వారిన వృక్షం. ఎన్నటికీ వసంతం రాదు. ఈ చెట్టు చిగురించదు. చివరకు ఏ స్నేహితుని అనురాగ స్పర్శకూ పరామర్శకూ నోచుకోదు"

నిశ్శబ్దంగా ఆమె కళ్లనుండి నీళ్లు జారాయి. ప్రసాద్ ఆమెభుజం మీద చెయ్యి వేశాడు. పావని తల తిప్పిచూసింది. ఆమె నేత్రాలనిండా కురుస్తున్న మేఘాలే తారాడుతున్నాయి. చెంపలమీదుగా జీవనదులే పొంగి పొర్లుతున్నాయి. గుండె సుడిగుండాల్లో సుళ్ళు తిరుగుతూ గొంతునిండా నిండిపోయిన బాధ బయటకురాకుండా ఉండాలని కాబోలు రెండు పెదాలనూ పళ్ళబిగువున ఓగించి పట్టుకుంది.

ప్రసాద్ తన చేత్తో ఆమె కన్నీటిని తుడిచాడు. "ఊరుకో" అన్నాడు ఊరడిస్తూ.

ఈమాత్రం ఆదరానికికూడా ఎన్నడూ నోచుకోని పావని, ఆపుకోలేని ఉద్వేగంతో మంచంమీద వాలిపోయింది. దిండులో తల దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. కరుడుగట్టిన ఆవేదనంతా కరిగి కన్నీరై కాలిపొయ్యేదాకా అలాగే ఉండిపోయింది.

కొద్దిసేపటికి తేరుకున్న తర్వాత ప్రసాద్ అన్నాడు. "శోక దేవతలాఉన్న నీ మొహాన్ని నేను చూడలేను బాత్‌రూం లోకి వెళ్ళి మొహం కడుక్కునిరా"

ఆమె మొహం కడుక్కుందామని బాత్‌రూంలోకి వెళ్ళింది చల్లటి నీళ్లు పడుతుంటే ఎంతో రిలీఫ్‌గా ఫీలయింది. చీర తడిసేసరికి ఏకంగా స్నానమే చేద్దామని బట్టలు విప్పసాగింది.

ఆ సమయంలో టవలు బాత్‌రూంలో పెట్టటంకోసం అతను తలుపు తోశాడు. ఇద్దరూ రెండు నిముషాలు అలాగే శిలాప్రతిమల్లా నిలబడిపోయ్యారు. కనరాని అందాలు కనగానే అతను గాలిలో తేలుతున్న అనుభూతి పొంది ఆ గాలిలో తేలుతూనే ఇవతలికొచ్చాడు. పది నిముషాల తర్వాత బయటికొచ్చిన పావని తడిసిన చీర ఆరేసి చాలీచాలని బట్ట పట్టుకుని అద్దం ముందు నిలబడింది పౌడరు రాసుకుంటూ. దువ్వెనకోసం వెతుకుతుంటే "మేఐహెల్ప్‌యు" అంటూ అతను ఆమె దగ్గరకు వచ్చాడు. సమ్మోహనంగా నవ్వింది పావని.

అతను అదే గొప్ప అదృష్టంగా భావించి చేతిని అందుకుని మృదువుగా ముద్దెట్టుకున్నాడు.

ఆ ఒక్కదానితో ఇద్దరి మధ్యా అడ్డంగానున్న పలచని సంస్కారపు తెరలు తొలగిపోయినాయ్! స్పర్శతోనే తనువెల్ల పులకలు మొలకలెత్తాయి. మంచందాకా ఆమె నడుంచుట్టూ చెయ్యి చుట్టి నడిపించాడతను.



6

ఓగంట తర్వాత లేచివెళ్ళిపోతానంటే, అతను అన్నాడు "ఎంత దయలేనివాళ్ళు మీ ఆడవాళ్ళు!"

"మీ దయే మాకుకావాలి" అని గుర్తు చేసింది పావని.

"దానికేం భాగ్యం? రేపొక లారీ దయ మీ ఇంటికి పంపించనా?"

"లారీలకొద్దీ మాకొద్దు. తమరే ఓసారి స్వయంగా దయచేస్తే చాలు" అంది పావని.

"అలాగే" అన్నాడు ఆమెకు వీడ్కోలు చెబుతూ.

ఆ మరునటి మూడు రోజులు కూడా అతని దగ్గరకు వెళ్ళకుండా ఉండలేక పోయింది పావని.

"రేపు నేను ఢిల్లీ వెళ్తున్నాను" అంది ఆ రోజు.

"నేను స్టేషనుకొస్తాను" అన్నాడు ప్రసాద్.

"మా ఇంటికి వస్తామన్నారు. రానే లేదు" అని గుర్తుచేసిందామె.

"పగలంతా ఏదో ఒక పనితో తీర టమేలేదు. అయినా మళ్ళీ త్వరలోనే ఎలాగూ రావాలి. అప్పుడు తప్పకుండా వస్తాను...ఇంతకీ నేను ఎవరితో మాట్లా డాలి? ఏం మాట్లాడాలి? అదికూడా నువ్వే చెప్పు" అని అడిగాడు.

"ప్లీడరుగారితోను, ఆయన భార్యతోనే మాట్లాడండి. వాళ్ళ కడుపున పుట్టక పోయినా, నాకు వాళ్ళే తల్లీతండ్రీను. నన్ను ఎంతో అభిమానంగా, ఆదరంగా చూస్తారు. వాళ్ళ అమ్మాయి మీద వాళ్ళకు సహజంగానే అమితమైన ప్రేమఉంటుంది. అందులో ఆశ్చర్యం ఏమీలేదు. కానీ నన్నూ కవితతో సమానంగానే చూస్తారు. స్నేహబంధం తప్ప మరే సంబంధమూ లేని నన్ను వాళ్ల అంత అభిమానంగా చూస్తుంటే మావాళ్ళు మాత్రం డబ్బు సంపాదించిపెట్టే యంత్రంలా చూస్తు న్నారు. మీరు నన్ను చేసుకోబోతున్నారని తెలిస్తే ఈ పెళ్ళి ఆపుచేయటానికి మా ఇంటిల్లిపాదీ ఏకమై అడ్డుపడతారు. వాళ్ల నోటిదగ్గర కూడు పోతోందే అని బాధపడతారుతప్ప, నా బాగోగులు వాళ్లకు అక్కర్లేదు. అందుకనే పొర పాటున కూడా మావాళ్ల దగ్గరకు వెళ్ళ కండి. వెళ్లినా వాళ్లు చెప్పే మాటలేవీ నమ్మకండి" అని చెప్పింది పావని ముందు జాగ్రత్తకోసం.

"మీ నాన్నగారు ఏం చేస్తారు?"

"తాగుతారు"

"అద్సరే...అసలు ఉద్యోగం ఏమీ లేదా?"

"తాగటమే ఆయన ఉద్యోగ ధర్మంగా, కర్తవ్య నిర్వహణగా భావిస్తారు. కొంత మార్పుకోసం పేకాడతారు. రేసులకు వెళ్తారు..."

"మీ అన్నయ్యలు, చెల్లెళ్లూ, అక్కయ్యలూ?..."

"ఒక సహోదరుడున్నా వాడు తండ్రిని మించిన తనయుడు. అంతకన్నా ఇంకేం చెప్పలేను" అంటూనే చెప్ప గూడని విషయమే అతనికి చెప్పింది.




అతని మనసులో అనుకోకుండానే సత్యనారాయణగారి కుటుంబానికి, కుటుంబరావుగారి కుటుంబానికి మధ్య పోలిక ప్రారంభమైంది.

* * *

ఢిల్లీ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ బయల్దేరటానికి ఇంకో అరగంట టైం ఉంది. నాటకాల బృందానికి, గాయనీ గాయకులకు, ట్రూపు మొత్తానికి ముందే రిజర్వు చేయించుకున్న బెర్తుల దగ్గర సర్దుకున్నారు. ఆ బృందంలో పావని గాక మరో ముగ్గురు లేడీస్ కూడా ఉన్నారు.

కొందరు కంపార్టుమెంటులో కూర్చుని జోక్స్ వేసుకుంటుంటే, మరికొందరు ప్లాట్‌ఫారంమీద తిరుగుతున్నారు.

పావని ప్రసాద్‌తో మాట్లాడుతోంది. పత్రికలు, పూలు, పండ్లు కొనిచ్చాడు ఆమె వద్దంటున్నా.

ఇంతలో శేఖర్ కూడా ఆమెను వెతుక్కుంటూ వచ్చాడు.

''ఎంతసేపయింది మీరొచ్చి?'' అని పలకరించాడు పావనిని.

"ఇప్పుడే పది నిముషాలయింది" అంది పావని.

అతనూ ఆమెకోసం ఏవో పట్టుకొచ్చాడు. ఆమెబెర్త్ ఎక్కడో తెలుసుకుని అక్కడ పెట్టి కిందికొచ్చి నిలబడ్డాడు.

పావనికి ఇద్దరూ చెరోవైపునా నిలబడి ఒకరినొకరు ఇబ్బందిగా చూసుకుంటున్నారు. అందుకని పరిచయం చేయక తప్పలేదామెకు. కరచాలనంచేసుకున్నారు. మళ్ళీ మౌనం. ప్లాట్‌ఫారంమీద రద్దీపంక చూస్తున్నాడు శేఖర్.

''లాంగ్ జర్నీ. బాగా బోర్‌కొడుతుందేమో'' అన్నాడు ప్రసాద్.

''కంపెనీ ఉన్నారుగా. అందుకని అంతగా బోర్ కొట్టకపోవచ్చు'' అంది పావని.

''అయినా అసలు మీకు ఎప్పటికీ బోరుకొట్టే సమస్యే లేదు. ఏమీ తోచనప్పుడల్లా కూనిరాగాలుతీస్తుంటారుగదా'' అని అందించాడు శేఖర్.

''దానికేముంది? కూనిరాగాలు మీరూ తీయవచ్చుగదా'' అంది పావని.

''కానీ అవి ఖూనీరాగాలైపోతున్నాయండి. అదీ ప్రాబ్లం'' అనగానే శేఖర్‌తో పాటు వాళ్ళిద్దరూ కూడా నవ్వేశారు.

ప్రసాద్‌కు ఇంకా ఏమో చెప్పాలనుకుంది పావని. కానీ శేఖర్ ఉండటంవల్ల ఏమీ చెప్పలేకపోయింది.

శేఖర్ పావనికి ఏవేవో చెప్పాలనుకున్నా అతనూ మౌనంగానే ఉండిపొయ్యాడు.

రైలు బయల్దేరబోతుండగా పావని ప్రసాద్‌ను అడిగింది,''వైజాగ్‌నుంచి మళ్ళీ ఎప్పుడొస్తారు?'' అని.

''ఖచ్చితంగా చెప్పలేను. నెల రోజుల లోపలే...'' అన్నాడు.

"రాగానే మా ఆఫీసుకు ఫోను చెయ్యండి" అని చెప్పింది.

"ష్యూర్''

''మీరాక ఎప్పుడు?'' అని అడిగాడు శేఖర్ పావనిని.

"రెండు వారాలు పట్టవచ్చు. రాగానే మీకు ఫోన్ చేస్తా''

''ఎదురుచూస్తుంటాను''

రైలు నెమ్మదిగా వెళ్ళిపోయింది. కనపడినంతవరకూ పావనికి ఇద్దరూ చెయ్యి ఊపి సాగనంపారు.

బయటకొచ్చాక ప్రసాద్ బలవంతం చేసి శేఖర్‌ను తనతోపాటు తీసుకెళ్ళాడు.

రూంలో రిలాక్స్ అయ్యాక ప్రసాద్

అడిగాడు. "పావని మా రిలేషన్. ఆ చుట్టరికానికి తోడు మంచి గాయని కూడా అయినందువల్ల ఆమె అంటే మాకు అందరికీ ఎంతో ఇష్టం... ఆ చొరవకొద్దీ అడుగుతున్నాను. మీ ఇద్దరి పరిచయం ఎలాంటిదో చెప్పండి. మరేంలేదు. నాకు చేతనైన సాయం చేద్దామని"

"మా పరిచయం చాలా చిత్రంగా జరిగిందండీ... రోజూ కొంచెం ఇంచుమించు ఒకే వేళకు బస్సుస్టాపుల్లో కల్సుకునేవాళ్లం. మాటలు కల్సాయి. ఆమె పాటలు విన్నాను. టి.వి.లో పాడించాను. చేతనైన ప్రోత్సాహం అంతాఇస్తున్నాను" అని ఆగిపొయ్యాడు శేఖర్.

"వెరీగుడ్. ఆమెనుంచి మీరేం కావాలని కోరుకుంటున్నారు? నేను మీ శ్రేయోభిలాషిని. నా దగ్గర మీరు మొహమాట పడాల్సిన పనేంలేదు" అని ప్రసాద్ అసలు విషయం రాబట్టటానికి ప్రయత్నించాడు.

"ఇందులో మేం దాచుకోవాల్సింది కూడా ఏమీలేదు. మేం ప్రేమించుకుంటున్నాం. త్వరలోనే పెళ్ళి చేసుకోబోతున్నాం" అని చెప్పాడు శేఖర్.

"పెళ్ళికి పావని కూడా అంగీకరించిందా?"

"పావని ఇష్టంలేకపోతే అసలు ప్రేమించుకోవటం ఎలా సాధ్యమవుతుంది?"

"నా పాయింటు అదికాదు. ఇద్దరూ స్పష్టంగా పెళ్ళి విషయం చర్చించుకున్నారా అని"

"అవును, చర్చించుకున్నాం. ఆమె తల్లిదండ్రుల్ని అడగాల్సిన అవసరం లేదంది. నా మటుకు నాకూ ఆ అవసరం లేదు. అటువాళ్ళూ, ఇటువాళ్ళూ ఇష్టపడకపోయినా మా పెళ్ళి జరిగి తీరుతుంది" అని చెప్పాడు శేఖర్.

ఇంకొంచెంసేపు ఇతర విషయాలేవో మాట్లాడుకున్నాక శేఖర్ వెళ్ళిపొయ్యాడు.

* * *

మర్నాడు ప్రసాద్ సత్యనారాయణ గారింటికివెళ్ళాడు. సాయంత్రం ఏడుగంటలు అవుతోంది.ఎవరో వచ్చారని చెబితే సరస్వతమ్మగారు బయటకు వచ్చి చూసింది.

"ఎవరు మీరు?"

"నేను నిరంజనరావుగారి అబ్బాయిని. వైజాగ్‌నుంచి వచ్చాను" అనగానే ఆమెకు అంతా అర్థమైపోయింది.

"రండి" అని లోపలికి ఆహ్వానించింది పైటకొంగు రెండో భుజంమీదకు నిండుగా కప్పుకుంటూ.

అతనికి సోఫా చూపించింది. కూర్చున్నాడు. ఆమె ఎదురుగా కూర్చుంది.

"ఎప్పుడొచ్చారు?" అని అడిగింది.

"నేనొచ్చి నాలుగురోజులైంది. వేరే పనిమీద వచ్చాను. మీ ఇంటికివెళ్ళి రమ్మని మా నాన్నగారు ఒకటికి రెండుసార్లు రాశారు. అప్పుడప్పుడు వచ్చి వెళ్తున్నా వీలు కుదరటంలేదు"

"బొత్తిగా రాకపోకలు లేకపోవటంవల్ల ఇలా దూరమైపోయినాంగానీ మీకూ మాకూ దగ్గర చుట్టరికమే ఉంది"

"అవునట"

"మీ నాన్నగార్ని కూడా తీసుకురావాల్సింది...చాలా కాలమైందిచూసి"

"ఆయన బాగా పెద్దవారైపొయ్యారు. ఎక్కడికీ కదలటంలేదు"

"మీకు చెల్లెలు ఒకమ్మాయి ఉండాలి గదూ?"

"చెల్లెలుకాదు. అక్కయ్యే. పెళ్ళి





అయింది. వాళ్ళు భిలాయ్‌లో ఉంటు న్నారు"

"అలాగా! మీ అమ్మగారు కులా సానా?"

"బాగానే ఉందండి"

ఇప్పుడే వస్తానని ఆమె లోపలకు వచ్చి కవితకు విషయం చెప్పింది. కూతుర్ని తొందరగా ముస్తాబు చేసింది. ఈలోగా అతనికి చేయవల్సిన మర్యాదలు చేశాక, కవితను తీసుకొచ్చి పరిచయం చేసింది.

"మా అమ్మాయి కవిత" అని ఆమె చెప్పగానే ప్రసాద్ ఆమెను చూశాడు. కవిత 'నమస్కారం' అంది.

"మీకు గుర్తుందో లేదో ఒకసారి బందరులో పెళ్ళికొచ్చినప్పుడు కల్సారు. అప్పటికి మీరిద్దరూ బాగా చిన్నపిల్లలు" అనిసరస్వతమ్మగారు చిన్ననాటిజ్ఞాపకాలు గుర్తుచేయబోయింది.

"నాకు గుర్తులేదండి" అని ఒప్పు కున్నాడు.

ఒక అరగంటసేపు ఆమె ఏవేవో కబుర్లుచెబుతుంటే వింటూ కూర్చున్నాడు. ఇంక వెళ్తానని లేస్తే ఆమె కదలనివ్వలేదు.

"ఎలాగూ వచ్చారు. ఆయన కూడా వచ్చేదాకా వుండండి. మాట్లాడి వెళ్ళవచ్చు. ఈలోగా కాసేపు పైకివెళ్ళండి. చల్లగాలి వేస్తుంది. కవితా... తీసుకెళ్ళమ్మా" అని పంపించింది.

వాళ్ళు పైకి వచ్చేటప్పటికే పైన కుర్చీలు వేసివున్నాయి. వాటిలో కూర్చున్నారు. పేర్లు, వివరాలూ ఇందాకనే అయి పోయ్యాయిగనుక ఇప్పుడేం సంకోచం లేకపోయింది.

"సూటిగా అడుగుతున్నందుకు ఏమీ అనుకోకండి. నిర్మొహమాటంగా మాట్లాడ డం నా అలవాటు" అంది కవిత.

"ఐ లైకిట్" అన్నాడు ప్రసాద్.

"నేను బావున్నానా?"

"మీకేమండీ, బ్రహ్మాండంగా ఉన్నారు. మరి నేను నచ్చానా?" అని అడిగాడు.

"మనిషివరకూ నచ్చారు. మనిషి కని పించినంత స్పష్టంగా మనసు కని పించదుగా" అని నవ్వింది ఆమె.

"మీరు నవ్వితే మరీ బావుంటారు"

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్"

"అసలు కొందరు అందమైనవాళ్ళు నవ్వకపోయినా నవ్వుతున్నట్లే ఉంటా రండి. అలాంటివాళ్ళ మొహాన చిరునవ్వు చిందించటంలాంటివ్యర్థమైన పని మరొకటి లేదండి"

"బాగా స్టడీచేశారు. చెప్పండి" అని ప్రోత్సహించింది.

"ఆడదిచూసే చూపుల్లో, అదిరే అధరాల్లో, చేతులచేతల్లో అసలు ప్రతి కదలికలోనూ గొప్ప సౌందర్యం వుంది. భాషకందని భావమూ వుంది"

"మీరు మా గురించి ఇంత తనిఖీలు మొదలెడితే చచ్చామన్నమాటే. అందాకా ఎందుకు? ఇందాక మీరొచ్చారని చెబితే ఏ చీర కట్టుకోవాలి, ఎలా కట్టుకోవాలి అన్నదే నాకో పెద్దసమస్య అయింది" అంది కవిత.

"మీకో రహస్యం చెప్పనా?

ఆమెను కట్టుకోబోయేవాడికి ఆమె ఏ చీర కట్టుకున్నా నచ్చవచ్చునండి"

"చూడగా చూడగా మీరీ సబ్జెక్ట్‌లో రిసెర్చి చేసినట్టున్నారు" అంది కవిత.

"అవునండి. ఇప్పుడేకదా సెర్చి పూర్తయింది. ఇంక రిసెర్చి మొదలు పెట్టాలి" అన్నాడు ప్రసాద్.

వాళ్ళు కిందికొచ్చేటప్పటికి గేటు చప్పు డయింది. సత్యనారాయణగారు వచ్చా



రేమోనని చూశాడు ప్రసాద్. కుటుంబరావుగారు తూలుకుంటూ తిన్నగా లోపలికొచ్చాడు. అతని పరిస్థితి కని పెట్టిన కవిత

పోతే వాళ్ళే చెడిపోతారు. కానీ యాజ్ ఫాదర్ నాకొ్కంత బాధ్యత వుంది కాబట్టి బాధపడుతున్నానంతే."



ఆయనకు గుర్తుచేసింది 'మీ ఇల్లు వెనకాల వేపు' అని.

అయినా ఆయన వచ్చి తిష్టవేశాడు. "నాకు తెల్సునమ్మా. అదీ నా ఇల్లుకాదు. ఇదీ నా ఇల్లుకాదు. అందరం అన్ని ఎక్కడివక్కడ వదిలేసి వెళ్ళిపోతాం ఆ టైంవస్తే. ఏమంటారు?" అని అడిగాడు కుటుంబరావుగారు ప్రసాద్‌ను. ఆయన నోరువిప్పితే గుప్పున కంపుకొడుతోంది.

"నిజమేనండి" అని ఒప్పుకున్నాడు.

"చూడమ్మా.. మా అమ్మాయి పావని ప్రవర్తన నాకు నచ్చటంలేదు. ఎందుచేతంటే. నా మాట వినటంలేదది. వినక

ఎవరూ ఏం మాట్లాడలేదు. మళ్ళీ ఆయనే అందుకున్నాడు.

"నేను తాగుతున్నానని ఒక చే ఏడుపు. ఎందుకు తాగుతున్నానో ఎవరూ అర్థంచేసుకోరు. తాగకపోతే ఆత్మ క్షోభిస్తుంది. ఆత్మ క్షోభిస్తే పరమాత్మ క్షోభిస్తాడు. పరమాత్మను క్షోభ పెట్టటానికి మనమెవరమండీ....? ఏమంటారు?'' అని ప్రసాద్‌ను నిలదీశాడాయన.

ఆ తాగుబోతు మాటల్ని ఎవరూ పట్టించుకోకపోయినా ఆయన వదలటం లేదు.

"ఇవాళ నా డబ్బు పోయిందండి" అన్నాడు కుటుంబరావుగారే.

"ఎక్కడ?"

"రేస్‌కోర్స్‌లో... అయినాఫర్వాలేదు. అక్కడే దొరుకుతుంది నాకు. ఆదేం



పెద్ద ప్రాబ్లంకాదు... అన్నట్టు మీ దగ్గరో హండ్రెడ్ ఛేంజ్ ఉందా?'' అని అడిగితే ప్రసాద్ కాదనలేక ఇచ్చాడు వంద రూపాయలకూ ఛేంజ్. ఆయన వాటిని జేబులో పెట్టుకుని లేచాడు. వందనోటు కోసం జేబులు తడుముకుంటుంటే కిటికీ దగ్గర కొచ్చి ఆయన భార్య పిలిచింది.

సరస్వతమ్మగారే ఆవిణ్ని పంపించింది.

"మన వైఫ్‌లెండి ... ప్రపంచంలోని విషాదమంతా ఆవిడ మొహంలోనే ఉంటుంది. మళ్ళా ఏం కష్టం వచ్చిందో కనుక్కుంటూ ఉండండి. మీరు ఉంటారు గదా, హండ్రెడ్ మీకు పంపిస్తా'' అంటూ తూలుకుంటూ వెళ్లిపోయ్యాక సరస్వతమ్మగారు వచ్చింది.

ఆయన పరిస్థితి గురించీ, చితికిపోయిన సంసారం గురించీ, పావని గురించీ సరస్వతమ్మగారు ప్రసాద్‌తో చెప్పింది.

"ఈ సంసారాన్నంతా ఆ పిల్లే భరిస్తోంది. ఆ అమ్మాయి మొహంచూస్తే జాలేస్తుంది. ఈ న్యూసెన్సు అంతా ఆ పిల్లకోసమే సహించి ఊరుకుంటున్నాం'' అంది.

"పోన్లెండి. మీ మంచితనం ఎక్కడికి పోతుంది?'' అని సర్దిచెప్పాడు.

ఇంతలో కాపుదిగి ప్లీడరుగారు రానే వచ్చారు. ప్రసాద్‌ను చూపించి ఫలానా అని చెప్పగానే ఆయన చాలా సంతోషించారు. ఆయన చిన్నప్పటి విషయాలెన్నో గుర్తుచేశారు.

"మీకు అభ్యంతరం లేకపోతే మా అమ్మాయిని చేసుకోమని మీ నాన్నగారికి రాశాను. ఆయనా వెంటనే రిప్లయ్ ఇచ్చారు. పిలున్నప్పుడు కుర్రాణ్ని పంపిస్తామని రాశారు. మళ్లీ దానికి నేనూ సమాధానం రాశాను''

సత్యనారాయణగారు కలుపుగోలుగా, గంభీరంగా మాట్లాడుతుంటే ప్రసాద్ ముగ్ధుడైపోయ్యాడు.

ఆయన బలవంతంమీద ప్రసాద్ వాళ్లతోనే భోజనం చేశాడు. ఆ తర్వాత తీరిగ్గా కూర్చున్నప్పుడు ఆయనఅన్నారు.

''అదుగో అమ్మాయిని చూశావుగదా. అందచందాలు, చదువుసంధ్యలూ కనిపిస్తూనే ఉన్నాయి. ఇక నా ఆస్తిపాస్తుల గురించి కూడా నువ్వు తెల్సుకోవటం అవసరమే. నాకున్న ఇళ్ళు, స్థలాలు, పొలాలు అన్నీ కలిపితే పాతిక లక్షల పైనేఉంటాయి. ఇవాళ కాకపోతే, రేపైనా ఇవన్నీ అమ్మాయికి చెందేవేనని వేరే చెప్పక్కర్లేదు. అసలు ఉన్న ఆస్తులన్నీ అమ్మాయి పేరా, వాళ్లమ్మ పేరనే ఉన్నాయి. ఇప్పుడు కట్నం ఒక లక్ష ఇవ్వదల్చుకున్నాం. నువ్వు ఊ అంటే రేపే యాభైవేలకు చెక్ ఇస్తాను'' అన్నారాయన.

''పిలైనంత తొందరలో ముహూర్తాలు పెట్టించమని మా నాన్నగారు చెప్పమన్నారు'' అన్నాడు ప్రసాద్.

"అలాగే'' అన్నారాయన. అనటమే కాక అప్పటికప్పుడు పురోహితుడికోసం కబురంపారాయన!

కుటుంబరావుగారు తీసుకున్న వంద రూపాయలు అతను వద్దంటున్నా సరస్వతమ్మగారు అతనికి ఇప్పించింది.

ఒకే ఇంట్లో ఉంటున్నా ఆ రెండు కుటుంబాలవారివీ రెండు వేర్వేరులోకాలని అతనికి అర్థమైంది. తన ఇంట్లో ఇమడలేక పావని ఇంట్లోనుంచి బయటకు రావచ్చు కానీ అంత తేలికగా వాళ్ళు ఆమెను వదిలేస్తారని అనుకోవటానికి





వీల్లేదు. తెంచుకుంటే తెగిపొయ్యేది కాదు రక్తసంబంధం.

మరి తమ సంబంధం సంగతేమిటి? తను చేస్తున్నది తప్పుకావచ్చు. కానీ తప్పనిసరిఅవుతోంది. కుటుంబరావు కుటుంబం కుదుపుగా ఉండదు. సమస్యల ఊబిలో కూరుకుపోయినవాళ్ళు పావనినీ అందులోకి లాగక మానరు. ఆమెను చేసుకున్న నేరానికి ఆమె భర్తకీ మనశ్శాంతి ఉండదు. దానికితోడు పరువు మర్యాదల మాటే మర్చిపోవాలి-అని స్వగతంలో అనుకున్నాడు ప్రసాద్.




పావని ఢిల్లీ నుంచి తిరిగొచ్చేటప్పటికే శుభలేఖలు పంచటం అయిపోయింది. పెళ్ళి ప్రయత్నాలన్నీ భారీ ఎత్తున జరుగుతున్నాయి.

కవిత పెళ్ళి వార్త వినగానే పావని మొదట చాలా సంతోషించింది. కానీ ఆమెను చేసుకోబొయ్యేది ప్రసాద్ అని తెలియగానే నిలువునా పాతాళానికి కుంగిపోయింది.

ఏమిటిది? ఏం జరుగుతోంది? తను అనుకున్న దేమిటి...అయిందేమిటి?

పద్మలత, భవానీలను ఆదర్శంగా తీసుకుంది. అక్కర తీరినవాళ్లు తీరిగ్గా కూర్చుని చేసిన కట్టుబాట్లు మనకి పనికి రావనుకుంది. మారే కాలంతో మారాలని, అందాన్ని చూసి ఆదర్శవంతుడు పమ్మిరె

ఖర్చులేకుండా కొంగుముడి వేస్తాడని అనుకుంది. ఆలోచిస్తే అందులోనా [illegible] లేదనిపించింది. వాళ్లనమ్మిన సిద్ధాంతాన్ని ఆచరించి చూపించి విజయం సాధిస్తే, తనూ గత్యంతరంలేక ఆ మార్గాన్నే వెళ్లింది. కానీ ఏమైంది ఇప్పుడు? ఎంత దారుణంగా మోసపోయింది?

"నీకూ్కడా ఏదన్నా సంబంధం కుదిరితే బావుండును...పనిలో పని ముడి పెట్టెయ్యవచ్చుననుకుంటే కల్సి రావటం లేదు" అంది సరస్వతమ్మగారు.

పావని ప్రయాణపు బడలికతీర లేదంటూ గదిలో పడుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. గుండెల్లో రగిలే ఈ దావాగ్నికి ఆహుతి కావాల్సిందే తప్ప నోరు విప్పి ఎవరితోనూ చెప్పుకోలేదు.

తనకు ద్రోహం జరగటం ఒక ఎత్తు. తనకింత ద్రోహం జరిగిందని అనుకోవటానికి కూడా వీల్లేకపోవటం మరోఎత్తు.

లోలోపల దుఃఖం ఎంతకీ తగ్గని తుఫానులా కన్నీటిని కురిపిస్తూనే ఉన్నా, పైకి మాత్రం చెరగని చిరునవ్వును తగిలించుకుని తిరగాల్సి వచ్చింది.

ఎంతో ఆర్భాటంగా కవిత పెళ్లి జరిగిపోయింది. చాలా యాంత్రికంగా తిరుగుతూ, వీలున్నంతవరకూ తప్పించుకుంటూ పావని ఉన్నట్లూ, లేనట్లూ మసులుకుంది.

"మూడునిద్రలు చేయటానికి కవితతో పాటు దాని అత్తవారింటికి నువ్వూ వెళ్లు" అని సరస్వతమ్మగారు పావనిని ఎంత బలవంతం చేసినా వినలేదు.

ఒంట్లో బాగుండటంలేదని చెప్పింది. పావనిలో కనిపించినమార్పును ఆమె గమనించకపోలేదు. డాక్టరుకు చూపించు

కోమని సలహా ఇచ్చి ఆమె కూతురుతో వెళ్లిపోయింది

పెళ్లివారంతా ఎక్కడివాళ్లు అక్కడ వెళ్లిపోయాక ఆ ఇంట్లో పావని, సత్యనారాయణగారు ఇద్దరే మిగిలారు. ఆయన ఆప్యాయంగా,

"ఇంట్లో పనులతో బాగా అలసిపోయినట్లున్నావు. ఈ నాలుగు రోజులూ రెస్ట్ తీసుకోమ్మా" అన్నారు భోజనం వడ్డిస్తున్నప్పుడు.

"నాకింక రెస్ట్ గాక వేరేపనేముంది?" అని నవ్వింది నిర్లిప్తంగా.

ఆమె ఉద్యోగం గురించి, ప్రోగ్రామ్స్ గురించీ అడిగాడాయన. అన్నీ మామూలుగానే ఉన్నాయని చెప్పింది.

"నువ్వే మామూలుగాలేవు" అన్నారు ఆయన.

"నేను బాగానే ఉన్నాను బాబాయ్" అని అంతటితో ఆ సంభాషణ తుంచేసి ప్రసంగం మార్చింది.

కవిత, ప్రసాద్, సరస్వతమ్మగారు తిరిగి వచ్చారు.

సరస్వతమ్మగారికి అల్లుడు ఎంతగానో నచ్చాడు. తను నచ్చేలాగా చూసుకోవడంలో అనుభవజ్ఞుడు అతను.

కవితకు ఈ కొత్త జీవితం తృప్తిగానే ఉంది.

కూతురూ, అల్లుడూ చూడముచ్చటగా వున్నారని అందరూ అంటుంటే ముఖ్యంగా భార్యా, కూతుళ్ల మొహాల్లో కొత్త వెలుగేదో గోచరిస్తుంటే సత్యనారాయణగారూ బరువుదించుకున్నందుకు తేలికగా నిట్టూర్పు విడిచారు.

ఎటొచ్చీ ఒక్క పావని మాత్రం ఈ మార్పును ఏమాత్రం భరించలేకపోతోంది. ఎంత అపుకుందామన్నా ఆగని ఆవేశం గుండె లోతుల్లోనుంచి తన్నుకుంటూ వస్తోంది. ఆమెదో విచిత్ర పరిస్థితి!

ఆమె ప్రసాద్‌కు ఎదురు పడటంలేదు. పడితే మాత్రం చూపులు బాకుల్లా గుచ్చుకుంటున్నాయి. మాటల్ని ఈటెలుగా చేసి పొడుస్తోంది. ఎవరూ లేకపోతే వాడిగానే గుచ్చుతోంది!

పొద్దున్నే బ్రష్‌తో మొహం తోముకుంటోండగా అతన్ని చూడగానే ఘాండ్రించి ఉమ్మేసింది బేసిన్‌లో. దానిలోని భావం అతనికే అర్థమైంది.

అతను స్నానానికి బాత్‌రూంలోకి వెళ్తున్నాడు. పావని కుక్కకు మిగిలిపోయిన అన్నం పడేస్తూ దానితో అంది-

"మనుషులకన్నా నీవే నయం. ఎంగిలి మెతుకులు విదిల్చినా విశ్వాసం చూపిస్తావు"

పనిమనిషి రాలేదని సరస్వతమ్మగారు సణుక్కుంటుంటే పావని ఆమెతో అంది ప్రసాద్ వినేటట్లు. "నువ్వు ఎంత బాగా చూసినా జన్మతః వచ్చిన నీచబుద్ధి ఎక్కడకు పోతుంది? ఇదుగో ఇవాళ వస్తున్నాను, ఇవాళ రావటం లేదు, నాకీ ఇబ్బంది వచ్చింది అని చెప్పిచావొచ్చుగా ముదనష్టపు పీనుగ ... ఎన్ని అన్నా అను దున్నపోతుమీద వానచినుకే అనుకో. సిగ్గూ సెరమూ ఉండి ఏడిస్తేగా..."

పావని పనిమనిషిని తిడుతోందని సరస్వతమ్మగారు అనుకుంటే తననే తిడుతోందని ప్రసాద్‌కు అర్థమైంది.

భోజనాల దగ్గర అందరూ కూర్చున్నారు. సత్యనారాయణగారికి పంటికింద రాయి తగిలింది.

"వెయ్యి కళ్లు పెట్టుకుని వెతికినా, ఇంకా బియ్యంలో రాళ్లు వస్తూనేవున్నాయి.





అదీ ఆయనకే వస్తాయా రాళ్లు" అన్నది సరస్వతమ్మగారు.

"అసలు బియ్యంలోరాళ్ళు కలిపేందు కొక మిషను కనిపెట్టారండి. రాళ్లను కూడా బియ్యం సైజులోనే కట్ చేసి కలుపుతారట'' అన్నాడు ప్రసాద్.

"డబ్బు సంపాదించేందుకు ఒక్కొ కడు ఒక్కో మార్గం అవలంబిస్తాడు. అసలు మానాభిమానాలు చంపుకోవాలి గానీ డబ్బు సంపాదించటం, గొప్పవాళ్లుగా చెలామణీ కావటం ఎంతసేపు?" అంది పావని.

''ఏమిటేవ్, సంఘంమీద ఒక్క సారిగా నీకు ఆవేశం పెరిగిపోయింది?" అంది కవిత.

''పెరగక ఏం చేస్తుందే? ఎటుచూసినా దగా, మోసం. ఎవరిమీదనైనా రవ్వంత నమ్మకం ఉంచి వెనక్కి తిరిగామనుకో, మనవెనకో పెద్ద గొయ్యి తవ్వేసి అందు లోకి తోసేస్తారు. ఈ విద్యలో చదువు కున్న ఘరానా దొరలదే పైచెయ్యి. పేద వాళ్ల శాపాలకు సామ్రాజ్యాలే కూలి పోయినయ్! వీళ్లో లెక్కా? పోతారు మట్టి గొట్టుకుని" అంది పావని ప్రసాద్‌వంక ఓరకంట చూస్తూ.

"నువ్వు కొంచెం ఆవేశం తగ్గించుకో వాలమ్మా పావనీ... ఈ కూర బావుంది, వేసుకో'' అని ఆయనే వడ్డించారు.

''థాంక్స్, బాబాయ్" అంది పావని.

అంతా సోఫాల్లో కూర్చుని తాంబూలాలు వేసుకుంటుంటే కరెంటు పోయింది. ఉక్క మొదలయింది.

''ఈ ఎండకు తోడు ఫాన్‌కూడా లేకపోతే చచ్చామే. నరకం అనుభవించా ల్సిందే" అంది కవిత.

''అవునే, ఇంతవరకూ స్వర్గంలాంటి ఇల్లు ఇది. చూశావా, క్షణంలో నరకంగా మారిపోయింది మనకు" అంది పావని వ్యంగ్యంగా.

''మళ్లా వస్తుందిలేమ్మా'' అన్నారు సత్యనారాయణగారు.

''ఏ సాయంత్రమో వస్తుంది. అప్పటి లోగా యమయాతనగదా'' అంది కవిత.

"పోనీ, ఫోన్‌చేసి చూడండి'' అని సలహా ఇచ్చింది సరస్వతమ్మగారు.

"చేస్తే మాత్రం ఏంలాభం? వాడికి మన ముక్కూ మొహం తెలీదుగదా" అని ఊరుకున్నారాయన.

"అందరి ముక్కులు,అందరిమొహాలు కొంచెం ఇంచుమించుగా ఒకటిగానే ఉంటాయి. కానీ కొందరి మొహాలు కొంద రికి కొన్ని సమయాల్లోనే అందంగా కని పిస్తాయి. అందుకు అసలు కారణం వీళ్ల ముక్కు మొహాల్లో కన్నా, వాళ్లు చూసే దృక్కుల్లోనే ఉంటుంది'' అంది పావని.

''లాభం లేదు...నాన్నా ఇదిలా శరపరంపరలుగా నీతిసూత్రాలు వల్లె వేస్తున్న తీరుచూస్తే, దేశానికి ఏంకాదు గాని ఇదేమైపోతుందోనని భయంగా ఉంది'' అంది కవిత.

''నేనేమైనా ఫర్వాలేదు. చుట్టూఉన్న కుళ్లును కడిగెయ్యాలి'' అంది పావని.

''నిన్ననే ఫినాయిల్తో కడిగించామే బాబూ. ఇప్పుడు నువ్వాపని పెట్టుకోకు" అని సమాధానపరచింది కవిత.

సాయంత్రం కొత్తదంపతులిద్దరూ ఆరుబయట కూర్చుని ఉన్నారు. పావని కాఫీ అందిస్తూ అతని బట్టలమీద ఒలి కించింది. లేనినవ్వు తెచ్చుకుని, ''మీ చొక్కా మీద మరక పడినట్లుంది. ఆ మాయని మచ్చను అలాగే ఉండనివ్వండి నా గుర్తుగా'' అంది.

ప్రసాద్ సూటిగా చూశాడు. కింద పెదవిని పిండుకుంటూ వెళ్ళిపోయింది పావని.

మాటల్లో మాటరాగా కవిత భర్తను అడిగింది. "ఏమండీ....మా పావనికి మీ ఇలాకాఏదైనా మంచి సంబంధం ఉంటే చూడండి, పెళ్ళి చేసేద్దాం''

వెంటనే పావని సమాధానం చెప్పింది. ''ఎందుకే పెళ్ళి? శుద్దదండగ. పెళ్ళి చేసుకుని ఏం సాధించాలి? మగాణ్ని సాధించాలి. అంతేగా? ఆ పని ఇప్పుడూ చెయ్యవచ్చు..."

''మొగుణ్ని సాధించటానికి కాదే పెళ్ళి.... జీవితంలో ఆడది సాధించుకోవల్సినవి కొన్ని ఉన్నాయి. పెళ్ళి అయితేనే గాని అవి సాధ్యంకావు'' అని చెప్పింది కవిత.

''బజార్లో పాలు దొరుకుతుంటే బర్రెను కొనుక్కోవటం ఎందుకని గొప్ప అనుభవం మీద చెప్పారెవరోగానీ! అలా బయటకు వెళితే మనకు దొరకనిదేం లేదు. ఆమాత్రం దానికి ఎందుకీ జంఝాటం?'' అంది పావని.

''నువ్వు మరీ బరితెగించి పొయ్యావే'' అంది కవిత మందలింపుగా.

"కాలమూ, పరిస్థితులూ ఎదురు తిరిగినప్పుడు పిల్లి కూడా పులిగా మారుతుంది. అలాంటప్పుడే మనుషుల్లో విప్లవం పుడుతుంది. కళ్లున్న గుడ్డివాళ్లు దాన్నిచూడలేరు. దగాపడిన వాళ్ల ఎదలోని రొద వినిపించుకోరు. కానీ అన్ని వేళలూ వాళ్లకే అనుకూలంగా ఉండవు. కాళ్ల కింద వెన్నెల పరిచిన కాలమే గురిచూసి గుండెల్లోకి కత్తులు విసురుతుంది..'' అని పావని చెబుతుంటే ప్రసాద్ తప్పుచేసినవాడిలా తలొంచుకున్నాడు.

''లాభం లేదే. నువ్వింక కథలు రాయాల్సిందే'' అన్నది కవిత.

"బతుకు బాధల్లో నుంచే కథలు పుట్టుకొచ్చేది. కనుక నాకా అర్హత ఎంతైనా ఉంది'' అని బలవంతాన నవ్వింది పావని.

మరో రెండు రోజులకన్నా ఎక్కువ ఉండలేకపొయ్యాడు ప్రసాద్. పావని ధాటికి తట్టుకుని నిలబడటం సాధ్యం కాదని తెల్సుకున్నాడు. వీలున్నంతవరకూ ఆమెను తప్పించుకు తిరగటమే భావ్యమనుకున్నాడు.

సరస్వతమ్మగారు, సత్యనారాయణగారు ఇంకో నాలుగురోజులు ఉండమని ఎంత బతిమిలాడినా వినకుండా ప్రసాద్ కవితను తనతో తీసుకుని వెళ్లాడు.

కవితను రైలెక్కించటానికి పావని కూడా స్టేషన్‌కు వెళ్ళింది. అక్కడ పావనికి శేఖర్ కనిపించాడు. నవ్వుతూ పలకరించాడు. ప్రసాద్ చూస్తుండగా ఆ కాసేపూ అతనితో ఎంతో ఆదరంగా మాట్లాడింది.

అతను వెళ్లిపోయాక కవిత అడిగింది. "ఏమంటున్నాడు నీ వీరాభిమాని?''

"ఏదోలేవే, ఈ గుడ్డి గడ్డిపువ్వును చూసి ఇష్టపడేవాళ్లూ ఒకరిద్దరున్నారని గుర్తొచ్చినప్పుడు కొంత ఊరట కలుగుతుంది'' అంది పావని.

ఆ మాటలు అంటున్నప్పుడు ప్రసాద్ ఆమెకు ఎదురుగానే ఉన్నాడు. వదిలే ఏ ఒక్క బాణమూ అతనికి తగలకుండా, గురితప్పి పోకుండా జాగర్త పడుతూనే ఉంది.

''నువ్వు కూడా మాతో రావే... సరదాగా నాలుగురోజులుండి వద్దువుగాని" అని ఆసక్తిగా అడిగింది కవిత.





"నన్ను ఆహ్వానించేముందు మీ ఆయన పర్మిషన్ తీసుకున్నావా ?" అని ఎదురు ప్రశ్నించింది పావని.

"ఆయన కూడా కాదనరు...కదండీ?" అని కవిత ప్రసాద్‌తో అంది.

"అవును..రండి మీ వీలు చూసుకుని. కొన్నాళ్లు మా ఇంట్లోనూ ఉందురుకాని" అని అన్నాడు తెచ్చిపెట్టుకున్న ఆదరంతో.

"మీవన్నీ పున్నమిరాత్రులు, నాకన్నీ చీకటి రాత్రులే. కనుక మీమధ్య నేనెందుకులెండి. అయినా మీరిద్దరూ అడిగారు గాబట్టి తప్పకుండా వస్తాను వీలు చూసుకుని" అంది పావని 'తప్పకుండా' అన్న మాటను గట్టిగా నొక్కుతూ.

మరో అయిదునిమిషాల తరవాత రైలు వెళ్ళిపోయింది వాళ్ళను తీసుకుని. పావని, సత్యనారాయణగారు, సరస్వతమ్మగారు వెనక్కి వచ్చేశారు.

* * *

ఆ వేళ సాయంత్రం పావని ఆఫీసు నుంచి బయల్దేరబోతుండగా శేఖర్ వచ్చాడు.

"కొంచెం లోపలికి రావచ్చాండీ ?" అని అడిగాడు గది గుమ్మంలో నిలబడి.

"అయ్యో అదేంమాట? పూర్తిగా లోపలికి రండి" అని ఆహ్వానించి, కుర్చీ చూపించింది.

"మీరు మరీ నల్లపూస అయిపోయ్యారు?" అని అడిగాడు.

"మీకు తెలీదేమో – నల్లపూసలు పెళ్ళి అయినవాళ్ళే వాడతారు. అందుచేత నాకు నిషేధం"

"మీరు అసలు కనిపించటం లేదు"

"అదేమిటి? ఎదురుగా ఇంత దగ్గరగా కూర్చుని మాట్లాడుతూ అసలు కనిపించటంలేదంటారు. ఇంత దృష్టి లోపం ఎప్పట్నించి?"

"మీరిలా నోరు మూయిస్తే, మీ నోరు ఎలా మూయించాలో నాకు తెల్సు. కానీ ఇది ఆఫీసు.బావుండదు అందుకని.." అని ఆగాడు శేఖర్.

"అయితే పదండి, పోదాంబయటకు"

ఇద్దరూ నడుస్తున్నారు. శేఖర్ పావనితో చెప్పాడు.

"త్వరలో మీకు ప్రమోషన్ రాబోతోంది. వస్తే నాకేం ఇస్తారు?"

"ఇదేమిటి? నిక్షేపంలాంటి ఉద్యోగం వదలి ఈ జోశ్యాలూ, జోతిష్యాలూ చెప్పుకుని బతుకుతున్నారేమిటి?" అని నిలదీసింది.

"ఆ ఉద్యోగానికేం ఢోకాలేదండి. ఎంచేతంటే అది నేను గాబట్టి చేస్తున్నాను. ఇంకొకడెవడూ చెయ్యలేడు. అదలా వుంచండి.మీకు ప్రమోషన్ రాబోతోందని అంటున్నాను" అని మళ్ళీ మొదటికొచ్చాడు.

"ఊరుకోండి, నాకు ప్రమోషనేంటి? వినేదాన్ని ఉన్నానుగదాని ఊరికే ఇలా అబద్ధాలాడితే రేపు వరసగా ఆడపిల్లలు పుట్టుకొస్తారు. అప్పుడు అవస్తపడతారు"

"ఫర్లేదులెండి. పుట్టేది మా ఆవిడకు. ఆవిడా, మీలాంటిదే. సత్యహరిశ్చంద్రుడి సొంత సిస్టరు. అబద్ధాలాడదు. కనుక పేచీ లేదు. ఇంతకీ విషయం ఏమిటంటే నేను కొన్ని ఏర్పాట్లు చేస్తున్నాను. త్వరలోనే పైకి పోయే సూచనలు కనిపిస్తున్నాయి"

"పైకి అంటే స్వర్గానికా? నరకానికా? నేను పడలేనా పాట్లు. నావల్లకాదు"

"అది కాదండీ...నాకో ప్రొడ్యూసర్ దొరికాడు"

"ఎవరు పారేసుకున్నారు?"



"అబ్బబ్బ.... నన్ను చెప్పనిస్తారా లేదా? నిన్న నాకో ప్రొడ్యూసర్‌తో పరిచయం అయింది. కొత్తగా సినిమా రంగంలోకి దిగాడు. కొత్త ముఖాల కోసం వెతుకుతున్నాడు. ఆర్టిస్టులూ, టెక్నీషియన్లూ అంతా కొత్తవాళ్ళే"

"ప్రేక్షకులు కూడా కొత్తవాళ్ళే కావాలేమో"

"ఆ అనవసరపు గొడవలన్నీ మీకెందుకు? రేపు నాతో రండి. మీకు సినిమా ఛాన్స్ తగులుతుంది" అని ఆమెను ఒప్పించటానికి ప్రయత్నించాడు.

"రావటానికి నాకేం అభ్యంతరంలేదు. పాట పాడమంటాడు పాడతాను. తర్వాత బాగా పాడావమ్మా అని అభినందిస్తూ భుజాలు, మెడలు అన్నీ సవరిస్తాడేమో?" అని సందేహం వెలిబుచ్చింది.

"అలాంటి సవరింపు కార్యక్రమాలు లేకుండా నేను జాగ్రత్తపడతాను. అంతగా ఆయన అభినందించదల్చుకుంటే, నన్ను అభినందించమంటాను, మిమ్మల్ని ఒప్పించి తెచ్చినందుకు... ఓకే?" అన్నాడు శేఖర్.

మర్నాడు వాళ్ళిద్దరూ ఆ కాబోయే నిర్మాత దగ్గరకు వెళ్ళారు. అక్కడ కాబోయే సినీ దర్శకుడు, కాబోయే సినీ రచయిత, ఇంకా ఏవేవో కాబోయేవాళ్ళు మరి కొంతమందీ ఆ గదిలో కూర్చుని టీ తాగుతున్నారు.

పావనిని చూడగానే అందరూ కింద నుంచి పైదాకా ఎగాదిగా చూశారు. ప్రొడ్యూసర్ కుర్చీలోనుంచి లేచొచ్చి శేఖర్‌కు షేక్‌హాండ్ ఇచ్చాడు. తనకు కూడా ఎక్కడ షేక్‌హాండ్ ఇస్తాడోనని భయపడి ముందుగానే సమస్కారం పెట్టేసింది పావని.

డైరెక్టర్ని, రైటర్ని, మిగిలినవాళ్లనూ

పరిచయం చేశాడు.

"ఫొటోలు తెచ్చారా?'' అని అడిగాడు డైరెక్టరు.

"ఇష్ట...ఆమె వచ్చింది యాసంకోసం కాదు... పాడుద్ది'' అన్నాడు నిర్మాత.

"ఓహో అలాగా...ఇదివరకు ఎందులోనన్న పాడారా?" అని అడిగారు దర్శకులుగారు.

"టి.వీ.లోనూ, రేడియోలోనూ పాడుతోందండి" అన్నాడు శేఖర్.

''వార్ని చెప్పనివ్వండి" అన్నాడు దర్శకులు.

"మేం వారి కోమలకంఠం వినాలి" అన్నాడు నిర్మాత.

''ఏదీ, ఒకటి అందుకో, ఇందాం" అన్నాడు రచయిత.

అన్నమాచార్యుని కీర్తన ఒకటి పాడింది. పాడినంతసేపూ మంత్రముగ్ధులై విన్నారు. ఆ పాట ఆగిపొయ్యాక, అప్పటిదాకా అక్కడ ప్రవహించిన తేనెల వాగు ఒక్కసారిగా ఇంకిపోయినట్లు అనిపించింది అందరికీ.

అయినా ఆమె బాగా పాడిందంటే తమ గొప్పదనానికి ఎక్కడ లోటు వస్తుందోనని నిర్మాత అన్నాడు, "బానే పాడింది గానీ, గొంతు ఇంకా పైకి ఎత్తాల...మైకులో సాల్దు"

బయటికొచ్చాక పావని శేఖర్‌పై కోపగించుకుంది. "ఇలాంటి దగుల్బాజీ వెధవల దగ్గరకు ఇంకెప్పుడూ తీసుకురాకు. సినిమాతీసే మొహాలేనా అవి? ఒక బోర్డు పెట్టుకు కూర్చున్నంత మాత్రాన వాడు సర్వజ్ఞుడై పొయ్యాడా? వాడి జన్మలో ఎప్పుడన్నా మైకుముందు నిలబడ్డాడా? వాడా నాకు పాట గురించి సలహాలివ్వటం" అని కోపగించుకుంది.

"సారీ, పావనీ... నువ్వు సినిమాల్లో పాడాలి. అదే నా కోరిక"

"పాడనంత మాత్రాన నష్టమేముంది? ఎన్ని వేలమంది ఆర్టిస్టులు లేరు? వాళ్ళం దర్నీ సినిమాలే ఉద్ధరిస్తున్నాయా? చాలు.. నాకీమాత్రం గుర్తింపుచాలు. ఆకాశానికి నిచ్చెనలు వేయటం మంచిదికాదు" అని ఆమె అంటే, శేఖర్ చటుక్కున ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని అరచేతిలోని రేఖలు చూడటం మొదలెట్టాడు.

"బ్రిల్లియంట్, ఎక్సలెంట్...యువిల్ రూల్ దిఫీల్డు...అనుమానంలేదు"అన్నాడు సంతోషంతో.

"నీది ఒక్క పిచ్చి కాదన్నమాట"

"అలాగే అనుకో...నువ్వొక గొప్ప గాయనీమణివి అయిపోతావు. ఇదిమాత్రం తప్పదు" అన్నాడు.

పదిరోజుల తర్వాత ఆమెను మళ్ళీ బలవంతంచేసి ఇంకో నిర్మాత దగ్గరకు తీసుకెళ్లాడు. ఆయన ఇదివరలో చాలా చిత్రాలు తీసినవాడూ, పేరున్నవాడూ కావటంవల్ల పావనికూడా మెత్తబడింది.

వీళ్ళు వెళ్ళగానే ఆయన కాఫీ ఇప్పించారు. తాగిన తర్వాత టేప్‌రికార్డరు తెచ్చి ఆమె ముందు పెట్టి పాడమన్నాడు. ఆమె పాడిన పాటను రికార్డుచేసి మళ్ళీ టేప్‌లో పాట విని వాయిస్ బాగానే ఉందన్నాడు. అయినా కొత్తవాళ్ళ చేత పాడిస్తే మార్కెట్ అవటంకూడా చూసుకోవాలిగదా అన్నాడు. అడ్రసు ఇచ్చి వెళ్ళమన్నాడు. అవసరమైతే కబురు చేస్తానన్నాడు.

ఆయన పిల్చి సినిమాలో పాడించుకుంటాడన్న ఆశలేకపోయినా, అంత గొప్ప నిర్మాత, మంచి అభిరుచిగల వ్యక్తి ఆ కాసేపూ అంత శ్రద్ధతో తన పాట




విన్నందుకు చాలా ఆనందించింది. పనికి రాకపోతే పనికిరావని మొహానే చెప్పగల వ్యక్తి ఆయన. అలాంటివాడు పూర్తిగా నిరాశ పరచకపోవటంతో, తను పని కొస్తుందన్న నమ్మకాన్ని ఏర్పరుచుకుంది.

అప్పటికే బాగా లేటు అయిపోయిందని ఇద్దరూ ఆటో ఎక్కారు.

డిపో దగ్గరకొచ్చాక చూస్తే అతనిదగ్గర యాభైరూపాయల కాగితమే ఉంది. ఆటో వాడు చిల్లర లేదన్నాడు. ఆమె దగ్గరా చిల్లర లేదు.

లాటరీ టిక్కెట్లు అమ్మే వాడు..అరుస్తు న్నాడు- 'రూపాయికి కోటి రూపాయలు, మీది అదృష్టం, మీ పెళ్ళాం అదృష్టం, పిల్లల అదృష్టం. ఒక రూపాయి లక్కీ టికెట్ తీసుకోండి... కోటి రూపాయలు అందుకోండి'

"చిల్లరకోసమన్నా ఒక లాటరీ టిక్కెట్టు తీసుకుందామా ?'' అని అడిగాడు శేఖర్.

''కోటి రూపాయలు మనమేం చేసు కుంటాం?'' అని అందామె.

"వస్తే సినిమా తీసపడేద్దాం. నువ్వే అందులో అన్ని పాటలూ పాడుదువుగాని. వెళ్ళి ఒక టికెట్టు తియ్" అన్నాడు శేఖర్.

''వద్దు..నేను తియ్యను. అది ఎలాగూ రాదు. అనవసరంగా నన్ను తిట్టిపోస్తావ్''

''రాకపోవటం నా ఆనవాయితీ. అదే నా అదృష్టం అని తేలిపోయింది... వాడు పెళ్ళాం, పిల్లల అదృష్టం అంటున్నాడు. కనుక నువ్వే ఒక టికెట్ తీసికో ... వాళ్ళనన్నా అదృష్టం పొందనిద్దాం'' అని ముందుకు తోశాడు శేఖర్.

ఆమె రెండు టికెట్లు తీసుకుని దానితో పాటు చిల్లర తీసుకుని అతనికిచ్చింది. "జాగర్త... ఒకటికాదు రెండుకాదు, కోటి రూపాయలు. వస్తే అందులోసగం నాకూ ఇవ్వాలి''

''సగం ఏమిటి? మొత్తం నీకే ఇస్తాను, రావాలేగాని. అంత అనుమానం అయితే టిక్కెట్టు నీ దగ్గరే వుంచుకో'' అని ఇవ్వ బోయాడు.

"వద్దులే. నా దగ్గర ఉండదు. ఎటో పోతుంది. నువ్వే దాచి, డబ్బు వచ్చాక నా పేర బ్యాంకులో వెయ్యి'' అంది నవ్వుతూ.

"అలాగే" అతను అంత నమ్మకం గానూ తలవూపాడు.

మళ్ళీ మర్నాడు కలుద్దాం - అని చెప్పుకుని చెరో దోవన వెళ్ళిపొయ్యారు వాళ్ళిళ్ళకు.

* * *

రాత్రి పదకొండు గంటలు అయింది. నగరమంతా నిద్రాదేవి ఒడిలో చేరి జోగుతోంది.

పావని మాత్రం నిద్రరాక మేడమీద ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తోంది. ఆ ఆలోచనలు ఆమెను అమితంగా భయ పెడుతున్నాయి. బయట ఎంత చల్లగాలి వీస్తున్నా పావనికి చెమటలుపోసున్నాయి. గుండెల్లో భయం, బోలెడంత దిగులూ పట్టుకుంది.

ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా దుఃఖం ముంచుకొస్తోంది. ఇంతలో ఎవరిదో చల్లని చెయ్యి భుజంమీద పడితే ఉలిక్కిపడి చూసింది. సరస్వతమ్మగారు!

"ఏంటమ్మా... ఒక్కదానివి ఇంత రాత్రిపూట ఇక్కడేంచేస్తున్నావు?" అని అడిగింది.

"ఏంలేదుపిన్నీ! కవిత వెళ్ళిపోయింది. ఒంటరిదాన్ని అయినానుగదా...చల్లగాలి

అయినా సేద తీరుస్తుందని" అంటూనే కళ్లు తుడుచుకుంది. ఆమె అంతవరకూ ఏడుస్తోందన్న విషయం ఆమెకు అర్థమైంది.

"నువ్వీమధ్య చాలా మారిపోయినావు. కొత్తగా, వింతగా మాట్లాడుతున్నావు... ఏమైందమ్మా?" అని అడిగింది.

''ఏదో నా బాధల్లో నాకు తెలియకుండానే ఆవేశం మాటల రూపంలో బయటికొస్తోంది. మిమ్మల్ని ఎవర్ని అయినా కష్టపెట్టివుంటే నన్ను క్షమించండి పిన్నీ"

''ఇంతకీ నీ బాధ ఏమిటో ఈ తల్లిగాని తల్లికి చెప్పకూడదనుకున్నావామ్మా?" అని ఆప్యాయంగా తల నిమిరింది.

"అదికాదు పిన్నీ..." అంతకన్నా మాట పెగల్లేదు. గొంతులోకి ఎగదన్నిన వేదన మాటల్ని మిగేసింది.

''లోలోపల నువ్వు కుమిలిపోతున్న విషయాన్ని నేను గమనించాను. మనసులోని బాధను ఉగ్గబట్టుకుంటే ఆ బాధ మరింత ఎక్కువ అవుతుందేగాని తగ్గదు. అయినా నాకు చెప్పటానికేమమ్మా... నీకు పెళ్ళికాలేదు, చెయ్యాలనేగదా! నేనూ ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. తగిన సంబంధం దొరకాలిగదా. నిన్ను మర్చిపోలేదమ్మా..కానీ అవకాశం కల్సిరాలేదు. అంతే!''

''అదికాదు పిన్నీ ... నాకు వొంట్లో బావుండటంలేదు. ఏదో అనుమానంగా వుంది" అంది సందేహిస్తూనే.

''అంటే ? ఇంకొంచెం వివరంగా చెప్పమ్మా"

"నేను మోసపోయినాను. చావుదెబ్బ తిన్నాను. తల్లిని కాబోతున్నానేమోనని అనుమానంగా వుంది" అంది నెమ్మదిగా.

ఆమె ఆశ్చర్యంలోనుంచి తేరుకోవటానికి కొంచెం సమయం పట్టింది.

"నువ్వు తెలివైనవాళ్లకుకూడా తెలివైన సలహాలు ఇవ్వగలదానివి. ఇంత తెలివి తక్కువ పని ఎందుకు చేశావమ్మా ?" అని అడిగింది.

"కొన్నిటికి కారణాలు కనిపించవు పిన్నీ! మనసుకు మాత్రమే తెల్సే విషయాలు కొన్ని వుంటాయి. ప్రేమలేని పెళ్ళి పరిమళంలేని పువ్వులాంటిదని అంటే నిజమేననుకున్నాను. తాళికట్టనంత మాత్రాన మనిషిని నమ్మకూడదా అనుకున్నాను. కానీ అక్కరతీరాక అతని ఆలోచనలు మారిపోయినాయి. నేనిలా మిగిలిపోయ్యాను..." అంది తల దించుకునే.

"అయిందేదో అయిపోయింది. రేపు డాక్టరు దగ్గరకు వెళ్దాంపద. రెండోకంటికి తెలియకుండా చేతులు కడిగేసుకుందువుగాని" అని ఊరడించి కిందికి తీసుకెళ్లింది ఆమె.

మర్నాడు డాక్టరుదగ్గరకు వెళ్ళారు. ఆమె పావనిని పరీక్షచేసింది.

"చదువుకున్నదానివి...నువ్వూ ఎందుకింత ఆలస్యం చేశావు? ఇప్పుడు అబార్షన్ చెయ్యటానికి వీల్లేదు" అందామె.

"ఎంత రిస్కు అయినా ఫర్వాలేదు. భరిస్తాను" అంది పావని.

"నీ ప్రాణానికే ముప్పు ఏర్పడుతుంది. నిన్ను కాపాడలేనప్పుడు, ఇంతాచేసి ప్రయోజనం ఏముంది?"

"నేను ఎలాగయినా చనిపోతాను. ఈ అప్రతిష్టను మోయటంకన్నా, ఎవరికీ తెలియకుండా చచ్చిపోవటమే మంచిది"

"ఆవేశంలోవున్న ప్రతివాళ్ళూ ఇలాగే





అంటారు. ఒక పొరపాటు జరిగినప్పుడు దాన్ని దిద్దుకునే ప్రయత్నం చేయాలిగాని మొండితనం పనికిరాదు" అని సలహా చెప్పింది.

సరస్వతమ్మగారూ ఆమెతో ఏకీభవించింది.

**ఇంటికి వచ్చాక ఆమె శ్రీధరుగారితో విషయమంతా చెప్పింది.** ఆయన పావని గదిలోకి వెళ్లారు. ఏడుస్తూ పడుకున్న పావనిని లేపి కూర్చోమన్నారు. ఆమెను **ఊరడించటం ఆయనకు** సాధ్యంకాలేదు.

"నా మొహం మీకెలా చూపించను?" అంటూ రెండు చేతుల్లో మొహాన్ని దాచుకుని రోదిస్తుంటే ఆయన బలవంతంగా ఆమెచేతుల్ని తొలగించి కన్నీరు తుడిచారు.

"నువ్వెంతో ధైర్యం గలదానివని, ఎలాంటి సమస్యలు వచ్చినా గుండెనిబ్బరంతో ఎదుర్కొంటావని నేను అనుకుంటున్నాను. కానీ నువ్వేమిటలా చిన్నపిల్లలాగా ఏడుస్తావు?" అన్నారాయన.

"మీఅందరికీకూడా తలవంపులు తెచ్చిపెట్టాను. నాలాంటిది బతకకూడదు. నేను చచ్చిపోతాను" అంది మొండిగా, కన్నీరు కురిపిస్తూనే.

"నువ్వు ఇలా అర్ధాంతరంగా చచ్చిపోతే అది మాకు మరింత తలవంపులు కాదా? ఎందుకు చచ్చిపోయిందో లోకానికి తెలియకుండా ఉంటుందా? ఒక తప్పుచేసి ఆ తప్పును పరిష్కరించుకోలేక, మరో పెద్ద తప్పు చేయడం మంచిదేనా? మాకు వున్న ఇద్దరు పిల్లల్లో ఒక పిల్ల అత్తారింటికి వెళ్ళిపోయి మాకు దూరమైంది. రెండో పిల్ల శాశ్వతంగా దూరమవుతానంటే మేం ఎలా ఊరుకుంటాం? ఈ సమస్యనుంచి ఎలా బయటపడాలో ఆలోచిద్దాం. నువ్వు ఇంకా తొందరపడి దీన్ని మరింత జటిలం చేయవద్దు" అని సలహా ఇచ్చారు.

"నాకు ఎటుచూసినా అంధకారమే కనిపిస్తోంది"

"కానీ చీకటిని చీల్చుకుంటూ వెలుగు వెల్లువలా వచ్చేస్తుంది. అందాకా కొంచెం ఓపికపట్టాలి."

"నేను ఎవరికీ ఏ అపకారమూ చెయ్యలేదు. అయినా దేవుడు నాకు అన్యాయం చేశాడు"

"సాక్షాత్తూ ఆ దేవుడే దిగివచ్చిమనిషి జన్మ ఎత్తితే ఆయనకీ కష్టాలు తప్పవు, బలహీనతలూ తప్పవు."

"నన్ను కన్న తల్లిదండ్రులు అసమర్థులు; అప్రయోజకులు. కన్నబిడ్డలకు తిండీ, బట్టా అయినా ఇవ్వలేని నిత్యదరిద్రులు. అందుకని నాపెళ్లి నేనే చేసుకోవాలనే తాపత్రయంలో పడ్డాను. వేలూ, లక్షలూ తెచ్చి, పెళ్లిళ్ల మార్కెట్టులోకి వెళ్లి పెళ్లికొడుకుల్ని కొనగల స్తోమతు లేదు. నాకున్న ఆస్తి అల్లా దేవుడిచ్చిన అందం. దాన్ని పణంగా పెట్టి మొగుణ్ని కొనుక్కోవాలని ఆశపడ్డాను. ఈ వ్యాపారంలో దారుణంగా మోసపోయ్యాను; దగా పడ్డాను. పైగా పర్యవసానాన్ని అనుభవిస్తున్నాను'' అని బావురుమంది.

"మనం అనుకున్నవన్నీ అనుకున్నట్లే జరిగితే, ఇంతగా అనుకోవాల్సిందేముంది? లోకంలో అంతా న్యాయంగా, ధర్మంగానే జీవిస్తుంటే నాలాంటి శ్రీధర్లు అంతా ఎలా బతకాలి?'' అని ఆమెను నవ్వించబోయ్యారు. అయినా పావని ధోరణి మారలేదు.

"నిప్పులాంటి ఈ నిజం దాచుకుంటే దాగేది కాదు. పెళ్లికాక ముందే తల్లి అయినానని తెలిస్తే ఈలోకం నన్ను బతక

నిస్తుందా? లోకులు కాకుల్లాపొడుస్తుంటే ఎంత నరకం అనుభవించాలి!'' అని బాధ పడింది పావని.

"ఈ చిన్న కష్టానికే నువ్విలా అయిపోతే ఇంతకన్నా ఎన్నో రెట్లు నరకం అనుభవిసున్నవాళ్ళంతా ఏమనుకోవాలి? పుట్టుకతోనే గుడ్డివాళ్లు అయినవాళ్లు ఎందుకు బతుకు తున్నారు? ఏ వెలుగును చూడాలని? నయంకానికుష్ఠుతో, కాన్సర్‌తో బాధపడుతూ రోజులు లెక్క పెట్టు కుంటున్న వాళ్లూ బతుకు మీద మమకారాన్ని చంపుకోలేకపోతున్నారు. ఆకలితో అలమటిస్తూ రోడ్డు పక్కన ముడుచుకుపడుకున్న ముష్టివాళ్లు ఎందుకు బతుకుతున్నారు? రేపోమాపో ఉరి తీయటం తప్పదని తెల్సినా, ఆ వ్యక్తి బతుకు మీద వ్యామోహాన్ని పోగొట్టుకో లేక పోతున్నాడు. వాళ్లందరి ముందూ నీదో బాధకాదు..చేపలు నీటిలోనే బతుకు తాయి. కష్టపడటం తప్పనివాళ్లు కష్టాల లోనే రోజులు గడుపుతారు''

పావని మౌనం వహించింది. ఆమెను మరికొంత సేపు ఊరడించి ధైర్యం చెప్పి భోజనానికి తీసుకొచ్చారు.

"ఇంతకీ అతనెవరో చెప్పమ్మా. నేను వెళ్లి బతిమిలాడో, భయపెట్టో తెచ్చి నీ మెళ్లో మూడుముళ్లూ వేయిస్తాను'' అన్నారు.

"ఇంక ఆ ఆశలేదు బాబాయ్"

"ఎవరమ్మా అతను?''

"నన్ను క్షమించు. ఈ ఒక్క ప్రశ్నకూ సమాధానం చెప్పలేను''

"ఎందుకని?''

నన్ను వత్తిడి చెయ్యవద్దు. నేను చెప్ప లేను. అంతే'' అంది.

ఈ విషయంలో సరస్వతమ్మగారు కూడా నాలుగు రోజులు ఎంతో బతిమి లాడి చూసింది. కానీ ప్రయోజనం లేక పోయింది. అతని గురించి చెప్పనంటే చెప్పనంది.

"మరి నీ జీవితం చక్కబడేదెలాగా?" అని అడిగిందామె.

"ఇంక నేను పెళ్లి గురించి, సంసారం గురించిమర్చిపోదల్చుకున్నాను.ఎత్తుకున్న బరువును దించుకోవటం ఎలాగని మాత్రమే ఆలోచిస్తున్నాను'' అంది పావని.

ఇంతలో కవిత దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ప్రసాద్‌కు భువనేశ్వర్ ట్రాన్స్ ఫర్ అయింది. టైం ఎక్కువ లేకపోవ టాన, అటునుంచి అటేవెళ్లి జాయినవు తున్నట్లు రాసింది.

సరస్వతమ్మగారికి ఓ ఆలోచన వచ్చింది "ఒక్కత్తి కొత్త చోట ఏం ఇబ్బంది పడుతుందో! పోనీ... నువ్వు..." అని ఆగిపోయింది.

"మీకూ, కవితకూ అభ్యంతరం లేకపోతే నేను అయిదారు నెలలపాటు దాని దగ్గరకెళ్లి డెలివరీ అయ్యేదాకా ఉంటాను. అక్కడంతా కొత్తచోటుకాబట్టి, ఏ గొడవా ఉండదు'' అని అందుకుంది పావని.

ఈ ఆలోచన బాగానే ఉన్నట్లు తోచింది. సత్యనారాయణగారితో చెబితే ఆయనా అంతకన్నా మరోమార్గం లేద న్నారు.

విషయం అంతా వివరిస్తూ ఆమె కవితకు ఉత్తరం రాసింది. కవిత దగ్గర నుంచి నాలుగోరోజే జవాబు వచ్చింది.

కొత్త చోటు కాబట్టి, ఎప్పుడొస్తున్నదీ ముందుగా టెలిగ్రాం ఇస్తే స్టేషన్‌కు వస్తానని రాసింది కవిత.

* * *




పావని కవిత దగ్గరకు వెళ్లటానికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి. రిజర్వేషన్ కూడా చేశారు. ఆరు నెలల పాటు ఉద్యోగానికి సెలవు పెట్టింది. మామూలుగా అయితే ఆ ఉద్యోగం ఇంకొకరికి ఇవ్వాలి. కానీ సత్య నారాయణగారి సిఫార్సుమీదఆమెకోసం ఆ పోస్టు సృష్టించారు. కాబట్టి ఆమె వచ్చేవరకూ దాన్ని అలా ఖాళీగానే ఉంచదలచారు. మళ్ళీ ఆమె ఎప్పుడు రావాలనుకుంటే అప్పుడు వచ్చి ఉద్యోగంలో చేరవచ్చు.

అందరిదగ్గరా శలవు తీసుకుని బయటకి వస్తుంటే శేఖర్ కనిపించాడు. అతన్ని చూడగానే పావని నవ్వుతూ అన్నది-

"వెతకబోయిన తీగ కాలికి తగిలింది"

"నేను తీగలాగా,మేకులాగా కనిపిస్తున్నానన్నమాట"

"అనుకోకుండా కల్సుకున్నాం కదూ" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

"మనసులు కలిసాక,మనుషులు అలా అనుకోకుండానే కలుస్తుంటారు"అన్నాడు శేఖర్.

"మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి... పదండి" అంది హోటల్లోకి దారి తీస్తూ.

"పెళ్ళికాని అబ్బాయితో ఒక అమ్మాయి ముఖ్యమైన విషయం మాట్లాడాలీ అంటే- అది ఆమె పెళ్ళిగురించే అయి ఉంటుంది'' అన్నాడు ఆమె వెనకాలే నడుస్తూ.

ఆర్డరిచ్చిన తర్వాత ఆమె వేరే విషయం చెప్పింది. "నేను ఇక్కడ్నించి మకాం ఎత్తేస్తున్నాను"

"ఇదేమిటి? ఉన్నట్లుండి బాంబు పేల్చారు"

"ఆరు నెలలపాటు భువనేశ్వర్ వెళ్తున్నాను"

"నేను శెలవు పెట్టి భువనేశ్వర్ వెళ్ళి ఒక ఆరునెలలపాటు ఉండి అక్కడి ప్రకృతి దృశ్యాలన్నీ పరిశీలించి రావాలని చాలా కాలంగా అనుకుంటున్నాను" అన్నాడు అతను హాస్యంగా.

"మీరు రావటనికి వీల్లేదు" అంది ఖచ్చితంగా.

"ఇదేమిటి? భువనేశ్వర్ అంతా మీరొక్కరే కొనేసినట్లు ఇంకెవరూ రాకూడదని శాసిస్తారేమిటి?'' అని రెట్టించాడు.

"నేకొనకపోయినాసరే .... మీరు రావటానికి వీల్లేదంతే"

"ఇదేమిటండీ.. నేనేమన్నా శత్రుదేశం వాడినా, ఎక్కడికీ కదలటానికి వీల్లేదని ఆంక్షలు విధించటానికి? ఈ దేశపు పౌరుడిగా భువనేశ్వర్‌లో ఆర్నెల్లు ఉండే హక్కు నాకుంది"

"అయితే మీరే వెళ్లండి. నేను ఇక్కడే ఉంటాను" అంది కోపంతో.

"ఇంతకీ దేనికి ఎడబాటు?" అన్నాడు రాజీకి వస్తూ.

"కవిత అని నా చెల్లెలు ఉందిగదా. దానికి పురుడు పోసిరావాలి"

"మీరు పురుడు పోస్తుంటే చూడాలని నాకెప్పట్నించో కోరిక"

"ఏమిటా వెధవ కోరికలూ మీరూను.. నేను రేపు వెళ్ళిపోతున్నాను"

"నా హృదయాన్ని ఇలా గాయపరచి వెళ్తున్నందుకు పోలీసు రిపోర్టు ఇస్తాను" అని లేచాడు.

"నా హృదయం మాత్రం గాయపడటం లేదా?" అని కూర్చోబెట్టింది

చెయ్యి పట్టుకుని లాగి.

"ఏమో... ఎప్పుడన్నా మీ హృదయాన్ని చూడనిస్తేగదా" అని నిట్టూర్చి మళ్ళీ తనే అన్నాడు–"వెళ్తే వెళ్లారుగాని, మీరు ఉండే ఇంటికి పక్క ఇల్లు ఖాళీగా ఉండేటట్లు చూడండి..." అని కోరాడు.

"ఏం?'

"ఏంలేదు. మనవాళ్లు పొరుగు వారిని ప్రేమించు అంటారుగదా. అక్కడ మీకు పొరుగువాళ్లు ఎవరన్నా ఉన్నారనుకోండి. ప్రేమించారనుకోండి. నేను అన్యాయమై



పోతాను"

"మీకా భయం ఏమీ అక్కర్లేదు. నేనిప్పటికే పది జన్మలకు సరిపడా ప్రేమించాను. కొత్తగా ప్రేమించే అవకాశం లేదు. హృదయం హౌస్‌ఫుల్ అయిపోయింది''

''అసలు నన్ను అడిగితే ఒకసారి ప్రేమించినవాళ్ళంతా మెళ్లో హౌస్‌ఫుల్ అని బోర్డు కట్టుకుంటే ఇతరులకు



సౌకర్యంగా ఉంటుందేమో'' అని సూచించాడు.

"అది మీతోనే ప్రారంభిస్తే బావుంటుంది'' అని ఉచిత సలహా ఉచితంగానే ఇచ్చింది పావని.

"వెళ్ళేముందు నాకో చిన్నమాట ఇవ్వాలి"

''ఏమిటది?''

"ఈ ఎడబాటు మన మధ్య ఆకర్షణను ప్రేమను పదింతలుగా పెంచాలిగానీ, మనల్ని శాశ్వతంగా దూరం చెయ్యకూడదు. రాగానే మనం పెళ్లి చేసుకోబోతున్నాం. దీన్ని మీరు నిద్రలో కూడా మర్చిపోకూడదు'' అన్నాడు ఎంతో సిన్సియర్‌గా.

కాదని చెప్పలేకపోయింది పావని.

పూలదండకన్నా మెత్తనైన ఆమె చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకున్నాడు చటుక్కున.

"దీన్ని ఏమంటారో తెల్సా?" అని అడిగాడు.

"ఏమంటారు?" అని ఎదురు ప్రశ్నించింది.

"పాణి అంటే చెయ్యి. పాణి గ్రహణం అంటే చేతిని స్వీకరించటం. మీ చెయ్యి పట్టుకున్నాను నేనిప్పుడు. కనుక పాణిగ్రహణం జరిగిపోయింది" అన్నాడు శేఖర్.

పావని నవ్వింది – "ఈ వరసన గాజులు తొడిగేవాడు రోజూ ఎన్నిసార్లు పాణిగ్రహణం చేస్తాడో" అని లేచింది.

"మీరు నవ్వేసినాసరే ... నా ఫీలింగ్ అది.మన పాణిగ్రహణం అయిపోయింది. నేను సీరియస్‌గానే చెబుతున్నాను"

"మగవాళ్ళ మాటలు నీటిమూటలు. ఇవాళ్టి మీ ఫీలింగ్ ఎన్నాళ్లుంటుందో నేనూ చూస్తాను"

"నేను బతికున్నంత కాలం వుంటుంది"

"ఇది మరో పెద్ద అబద్ధం"

"మిమ్మల్ని నమ్మించటానికి ఏం చెయ్యాలో చెప్పండి"

"మీరేమీ చెయ్యక్కర్లేదు. నామటుకు నాకే మనుషుల మీద నమ్మకం పోయింది. ఎవర్ని నమ్మినా నట్టేట ముంచేస్తున్నారు. నా మంచితనం చేతగానితనం కింద కనిపిస్తోంది. ఈ రోజుల్లో ఎవరన్నా మంచివాళ్ళు కావాలనుకుంటే ముందు అసమర్థులు అయిపోవాల్సి వస్తోంది" అన్నది పావని.

"ఎప్పుడో ఏవో ఒకటి రెండు చేదు సంఘటనలు జరిగి మనసు విరిగిపోవచ్చు. నమ్మకం తగ్గిపోవచ్చు. అంతమాత్రాన అందర్నీ ఒకటే గాటిన కట్టెయ్యటం న్యాయం కాదు. నమ్మకమే అడుగడుగునా మనల్ని నడిపిస్తోంది. జీవితాంతం ఆదుకుంటాడన్న నమ్మకంతోనే కన్నెపిల్ల నచ్చిన కుర్రాణ్ణి పెళ్లిచేసుకుంటోంది.అవసరానికి ఆసరాగావుంటారన్న ఆశతోనే పిల్లల్ని కని, పెంచి పెద్ద చేస్తున్నారు.అడిగినప్పుడు తిరిగి ఇస్తారన్న నమ్మకంతోనే డబ్బు బాంకుల్లో జమ చేస్తున్నారు. ఒకటో తారీకున జీతం ఇస్తారన్న నమ్మకంతోనే నెలంతా కష్టపడి పనిచేస్తున్నాం. క్షేమంగా గమ్యానికి చేరుస్తాడన్న నమ్మకంతోనే బస్సులూ,రైళ్ళూ ఎక్కుతున్నాం. ఇలా అడుగడుగునా ఎక్కడ చూసినా నమ్మకమే మన ఊపిరి. ఆ నమ్మకమే లేకపోతే ఈ వ్యవస్థ మొత్తం కుప్పకూలిపోతుంది" అన్నాడు శేఖర్.

ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది. అతను చెప్పింది నిజమేననిపించింది ఆమెకు కూడా.

"కనుక నా మాట నమ్మాలి.వీలైనంత త్వరగా తిరిగి రావాలి. అంతవరకూ నేనిక్కడ ఒంటరిగా ఉంటాను. ఈ రోడ్ల వెంట నిర్జీవంగా తిరుగుతుంటాను ఎంతో యాంత్రికంగా. ఎందుకింతటి అనుబంధం పెంచుకొన్నానో నాకే తెలియదు. ఒకరోజు నిన్ను చూడకపోతే, గుండె నిండా ఎంతో దిగులు. నువ్వు దూరంగా ఉంటే, పట్టపగలు కూడా నన్ను చిమ్మ చీకట్లు కమ్ముకునే ఉంటాయి. ఈ స్నేహబంధం ఇంత బలంగా పెనవేసుకుపోయాక ఇప్పుడు నువ్వు ఆరు నెలలపాటు దూరంగా వెళ్తానంటే నువ్వు మళ్ళీ కళ్ళముందు కనిపించేదాకా ఎంత నిరుత్సాహాన్ని, విచారాన్ని భుజాన మోసు





కుంటూ తిరుగుతుంటానో నీకు తెలియదు. నీ పలకరింపులు, చిరునవ్వుల చిలకరింపులు కురువకపోతే ఈ గుండె పగుళ్ళు విచ్చి బీటలు వారిపోతుంది. నీ స్నేహాన్ని, సామీప్యాన్నీ, ఆత్మీయతనూ మళ్ళీ ఎప్పటికి అందిస్తావోగానీ, అంతవరకు బతుకొక నరకంగా, ప్రతి దినమూ ఒక దుర్దినంగా గడుస్తుంది. కదలకుండా బండలా పడివుండే ఈ కాలాన్ని ఒంట్లోని శక్తినంతా వినియోగించి ఆ ర్నెల్లు ముందుకు తోసుకువెళ్ళే ప్రయత్నం చేస్తుంటాడీ పిచ్చివాడని మర్చిపోకు సుమా"

శేఖర్ అలా అంటుంటే పావని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

''ఎందుకింతటి బంధాన్ని పెంచుకుని నా కాళ్లకీ, చేతులకీ పెనవేసుకు పొయ్యావు?'' అని అడిగిందామె.

''ఎందుకో నాకు తెలిస్తేగదా నీకు చెప్పటానికి?"

''ఏముంది నా దగ్గర? నేనూ అందరి లాంటి రక్తమాంసాలున్న మనిషినేగాని"

''మనిషంటే అవేకాదు. అంతకు మించినవి వున్నాయి. వాటిల్లోనే వెతుక్కుంటాను నాక్కావల్సిన తృప్తినీ, సంతోషాన్నీ'' అన్నాడు శేఖర్ తీక్షణంగా చూపుల్లో చూపులు నిలిపి.

''కీడెంచి మేలెంచమన్నారు. కన్న కలలు నిజం కాకపోతే ఏం కావాలి?''

''కదిలే శిలగా మిగులుతాను. కానీ అప్పుడా శిలకూడా నీ గురించే కలలు కంటూ ఉంటుంది''

''మన ఆలోచనలకూ, ఆచరణలకూ మధ్య విధి కన్పించని లోయలు కల్పిస్తూ ఉంటుంది. అందుకే ఈ భయం''

''భయానికి నిర్భయమే విరుగుడు. కల్సుకోవాలన్న నిశ్చయమే మనకు ఉన్నప్పుడు ఏ అభ్యంతరాలు అడ్డుపడలేవు. ఎండలు మండినా, కుంభవృష్టి కురిసినా కాసేపే. మళ్ళీ మామూలుగా శీతల ప్రశాంత సమయం వస్తుంది మనల్ని వెతుక్కుంటూ... ఏమంటావ్?" అని అడిగాడు.

పావని ఏమీ అనలేక నీరసంగా నవ్వేసి ఊరుకుంది.

''జీవితం మనకేదో తవ్వితలకెత్తుతుందని ఆశపడటం, ఆశ నిరాశకావటం, ఆ నిరాశ కొసల్లో వేళ్ళాడే మరో ఆశను ఆలంబనంగా చేసుకోవటం అంతా వింతగానే కనిపిస్తోంది'' అని మాత్రం చెప్పింది.

''చదువుకుని, సంపాదించుకుంటూ ఈ మాత్రం స్వతంత్రంగా జీవించగల మనమే ఈపాటి తెగువ, చొరవా చెయ్యలేకపోతే గది గోడలమధ్య మరొకరి ప్రాపకం కిందపడి నలిగే హృదయాల గురించి చెప్పుకునేదేముంటుంది? వాళ్లతో పోలిస్తే మనకు అసలు అడ్డమేలేదు''

''కనిపించే అడ్డాలను ఛేదించటం తేలిక. కనిపించకుండా వచ్చి మీదపడే వాటిని తట్టుకోవటమే కష్టం'' అన్నది పావని.

చాలాసేపు అలాగే ఎవరి ఆలోచనలతో వాళ్ళు సతమతమవుతూ, ఎప్పటికో గానీ లేచి వెళ్లలేకపొయ్యారు.

* * *

పావని రైలు దిగేటప్పటికి కవిత వచ్చి రిసీవ్ చేసుకుంది. కవిత ఆప్యాయంగా పావనిని కౌగలించుకున్నంత పనిచేసింది.

సూట్ కేస్ కూలీకి అందిస్తూంటే– "సామానంతా ఇంతేనా?" అని అడిగింది.

"ప్రస్తుతానికి ఇంతే! పిల్లాపీచూ ఏమీ లేదుకదా" అని నవ్వలేక నవ్వింది పావని.

ఇంటికి చేరేదాకా దార్లో ప్రయాణం గురించి, అమ్మానాన్నల గురించి కవితకు చెప్పింది.

ప్రసాద్ స్టేషనుకు రాకపోవటం పావని గమనించకపోలేదు. కానీ ఆ విషయం అడగలేదు. అతని గురించి ఒక్క ముక్కకూడా పావని అడగక పోవటాన్ని కవిత గమనించకపోలేదు.

పావనిని పురుటికి తీసుకురావటం ప్రసాద్‌కు ఇష్టంలేదు. కవిత మొదట చెప్పినప్పుడు అతను వద్దనే అన్నాడు.

"మనకెందుకొచ్చిందా గొడవంతా? ఊరుకుందూ" అన్నాడు.

"అది నాకు అక్కలాంటిది. దాని బాధ ఒకటీ, నా బాధ ఒకటీకాదు. అదే మీ అక్కగాని, చెల్లెలుగాని ఇలాంటి అవస్థలో ఉంటే మనకెందుకని ఊరు కుంటారా? అయినా మీరేమీ వందలూ, వేలూ ఖర్చు చేయాల్సినపనిలేదు. అది సంపాదించుకుంటోంది. చాలదంటే మా డాడీ పంపిస్తారు. చాకిరీ చేయటానికి నేనున్నాను. మధ్యలో మీకేమిటి కష్టం? అదీగాక ఈ కొత్తచోట మీ దోవన మీరు ఆఫీసుకెళ్తే, నాకు కాలక్షేపం ఎలా అవుతుంది? కనుక దాన్ని నేను పిలిపించు కుంటున్నాను" అని కవిత ఖచ్చితంగా చెప్పటంతో అతనింక మాట్లాడలేక పొయ్యాడు.

పావని కావాలనే ఇక్కడికొస్తోందన్న విషయమూ అతనికి అర్థమైంది. ఆమెకు నిజంగా ఇష్టంలేకపోతే ఎవరెన్ని చెప్పినా వినకుండా మరో చోటు వెతుక్కునేదే. తనను ప్రశాంతంగా ఉండనివ్వరాదన్నదే ఆమె ఉద్దేశమని ప్రసాద్ అర్థంచేసుకుని చాలారోజులైంది.

తప్పదుకాబట్టి సాయంత్రానికి ఇంటికి వచ్చాడు. కనీసపు మర్యాద కోసమన్నా ఇద్దరూ పలకరించుకోకపోవటం కవితకు ఆశ్చర్యాన్ని కలిగించింది. వాళ్ళు బొత్తిగా కొత్తవాళ్ళేంకాదు.

ఎన్నడూ ఏ మగవాడికీ ఎదుట పడనిదేంకాదు పావని, ఇతన్ని చూడగానే బిడియపడటానికి. పదిమందిలోకి వెళ్ళి ఉద్యోగం చేస్తోంది. ఆయనా ఆఫీసులో అనేకమంది ఆడవాళ్ళతో సరదాగా మాట్లాడుతుంటాడని కవితకు తెలుసు. మరి వీళ్ళ వింత ధోరణి ఏమిటి?




రాత్రి ముగ్గురూ కలిసి భోజనాలు చేస్తుండగా కవిత కావాలనే ఈ ప్రస్తావన తెచ్చింది.

"దాన్ని పెళ్ళి చేసుకుంటాడని నమ్మించాడటండి ఒక వెధవ. మోజు తీరాక, దీని ఖర్మకు దీన్ని వదిలేసి వెళ్ళి పొయ్యాడట"

ప్రసాద్ మాట్లాడలేదు. తలొంచుకుని తింటున్నాడు.

పావని అందుకుంది – "నేను ఎందుకు బతకాలి? ఎవరికోసం బతకాలి? చచ్చి పోదామనే అనుకున్నాను. కానీ నాన్నగారే 'చేసిన పరువు తక్కువ పనికితోడు,

ఇంకా అది కూడా ఎందుకు' అని అడ్డుపడ్డారు"

"నువ్వెందుకు చావాలి? సాటి మనిషిని నమ్మటం మానవనైజం. పెళ్ళి చేసుకుంటా డని చెబితే, నిజమేననుకోవటం కన్న మనం చేసేదేముంది? అంతదాకా ఎందుకు? మా ఆయన్నే తీసుకో. నన్ను చూశారు. చేసుకుంటామనిచెప్పగానే కట్నం డబ్బులు ముందుగానే ముట్టజెప్పారు. ఆ డబ్బు ముట్టాక, చేసుకోనంటాడని ఎలా అను కుంటాం. అరెరే...మీరా తిండి తినటం ఏమిటండీ? కొత్తవాళ్లు ఎవరూ లేరు.... మొహమాటం లేకుండా తినండి" అంటూ మొగుడికి కూర వడ్డించింది కవిత.

"ఇంతకీ ఆ భ్రష్టుడెవడో చెప్పవన్న మాట" అంది కవిత మళ్ళీ.

"అమెరికాలో ఇప్పుడంతా పెళ్ళికి ముందే అన్నీ అనుభవించేస్తున్నారని కూడా అన్నాడేవాడు" అని గుర్తుచేసు కుంది పావని – అసలు ప్రశ్నకు జవాబు చెప్పకుండా.

"ఏడవలేకపొయ్యాడు. అమెరికాలో ఆడది ఇలా మోసంచేసి వెళ్ళినవాణ్ని ఏం చేస్తుందో వాడికి తెలియదేమో ? పిట్టను కాల్చినట్టు కాల్చి చంపేస్తుంది. నువ్వు కాబట్టి ఇంత అన్యాయాన్ని ఓపికగా సహించి ఊరుకున్నావుగాని నేనయితేనా, నిజంగానే షూట్ చేసిపారేసేదాన్ని వెధవని. పావని చేసిన సాంబారు బావుందిగానీ ఇంకొంచెం కలుపుకోండి'' అంది కవిత భర్తకు ప్రేమగా వడ్డిస్తూ. కానీ అతనికే ఎంతకీ ముద్ద మింగుడు పడటంలేదు.

"ఆ వెన్నముకలేని పిరికి వెధవ ఎవరో చెప్పవే. నేను వెళ్ళి వాడి అంతు చూసి వస్తాను'' అంది కవిత ఆవేశంగా.

"నాన్నగారు కూడా ఇదేమాట అన్నారు. ఎవడో చెప్పు. వాడికి ముష్టి ఎత్తుకున్నా మంచినీళ్లు దొరక్కుండా చేస్తానని అన్నారు. ఆయన అన్నంత పనీ చేసి తీరతారని నాకు తెలుసు.అందుకే వెంటనే వాడి పేరు చెప్పటానికి సందే హించాను. చెప్పే సమయం వస్తుంది.... అప్పుడు తప్పకుండా చెబుతాను" అంది పావని అతనివంక ఓచూపు విసిరి.

"నాన్నగారిదాకా ఎందుకు? నాతో చెప్పు. అంత మోసగాడు, దగాకోరు వాడెలా సుఖపడతాడో నే చూస్తాను. నా మెళ్లో గొలుసు అమ్మి అయినా సరే... నలుగురు గూండాలను పంపి, వాడి కాలూ చెయ్యి విరిపించేస్తాను, వెధవ మళ్ళీ మరో ఆడదానికేసి చూడకుండా" అంది కోపంతో మొహం కందగడ్డలా అయిపోగా.

"నాకు మాత్రం అంత కోపం లేదంటావా?" అని అడిగింది పావని.

"ఎందుకే...కోపం వచ్చి నీలో నువ్వే ఉడికిపోవటానికా ? మనం ఇంత పిరికి వాళ్ళం కాబట్టే, ఆ వెధవలు అలా రెచ్చి పోతున్నారు! అసలు వాడి అడ్రస్సు చెప్పు. నే జైలుకెళ్ళినా ఫర్వాలేదు. వాడి అంతుచూసి వస్తాను'' అంటూ నిలదీసింది కవిత.

"చెబుతానే. కానీ దానికి ఇంకా కొంత టైం ఉంది.ఆ సమయం రాగానే ముందుగా నీతోనే చెబుతాను'' అంది పావని.

అక్కడ ఉన్నన్ని రోజులూ పావని మామూలు అలంకారాలకు కూడా ప్రాముఖ్యత నివ్వలేదు. కనీసం బొట్టూ, కాటుక కూడా పెట్టుకోలేదు.

రోజూ కవిత కోసం ప్రసాద్‌కు పూలు తేవటం అలవాటు. కవిత పూలవంత సగం తుంచి పావనికి కూడా ఇచ్చేది.

ప్రసాద్ వినేటట్లుగా పావని కవితతో ఓసారి చెప్పింది–

"నాకు భర్తలేడు. వాడు చచ్చిపోయ్యాడు, నాకు సంబంధించినంత వరకూ. కనుక ఇప్పుడీ అలంకారాలన్నీ నాకు పనికిరావు"

"అసలా వెధవకి మెడకాయమీద తలకాయ ఉంటే నీలాంటిదాన్ని దూరం చేసుకున్నందుకు వాడు ఏ రైలు కిందో తలపెట్టి చావాలి. కాని, వాడలా చెయ్యడు. ఇంకోదాన్ని కట్టుకుని హాయిగా ఎంజాయ్ చేస్తూనే ఉండిపుంటాడు. మరి నువ్వెందుకీ విషాదాన్ని అనుభవించాలి. ఆ మాటకొస్తే వాడమీద కచ్చతోనయినా నువ్వు లైఫ్‌ను ఎంజాయ్ చెయ్యాలి. డబ్బులేనిదానివనేగా నిన్ను ఇలా గాలికి వదిలేశాడు. వాడికి ఎందుకు చెప్పలేకపొయ్యావు ... సత్యనారాయణగారి ఆస్తిలో సగంవాటా నీకే ఇస్తారని? ఆ ప్రబుద్ధుడు ఎక్కడున్నాడో చెబితే నేను చెప్పివస్తాను...నావంతు ఆస్తి కూడా మా పావనికి రాసేస్తున్నానని" అంది కవిత.

"ఆ మాట అనకు. మీ ఆయన నిన్ను వదిలెయ్యగలడు" అని అంటించింది పావని.

"నాకా దిగులు ఎప్పుడూ లేదు. ప్రేమాభిమానాలు ఇచ్చిపుచ్చుకున్నంత వరకే నేను ఎవర్నిఅయినా గౌరవిస్తాను. నన్ను నన్నుగా గౌరవించకుండా, నా ఆస్తికోసం గౌరవిస్తున్నారని తెల్సిన రోజున, నా అసలురూపం ఏమిటో తెలుస్తుంది" అంటూనే కవిత ప్రసాద్‌కు కాఫీ అందించింది.

కవిత పావనిని ఎంతగానో ఓదారుస్తోంది. ఎన్నోవిధాల ధైర్యం చెబుతోంది. ధ్యాస మళ్ళించటంకోసం ఏవేవో విషయాలు చర్చిస్తోంది. సినిమాలు, షికార్లు సరేసరి!

ఎంత ధైర్యాన్ని కొనితెచ్చుకున్నా కడుపులో పెరుగుతున్న భారంతోపాటు, పావనికి గుండెల్లో దిగులు, వేదనకూడా పెరుగుతోంది. లోకవిరుద్ధంగా నడవటానికి ఎంత తెగువ కావాలి? ఎంత గుండెకోతను అనుభవించాలి. తల్చుకున్నకొద్దీ దుఃఖం పెల్లుబికి వస్తూనేవుంది. ఆమెకు మాత్రమే వినిపిస్తోంది హృదయాంతరంగంలో చెలరేగే కల్లోలవుల్లోలాల రొద.

అలాంటప్పుడు కవిత వచ్చి ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసేది.

"ఆ సమానం నువ్వలా ఏడుస్తూ కూర్చోకూడదు. డాక్టరు చెప్పింది"

"చూశావా... ఆడదానికి దేవుడు ఎంత అన్యాయం చేశాడో? నా ఏడుపుకూడా నే ఏడవటానికి వీల్లేకుండా చేస్తున్నాడు"

"అసలా ఏడుస్తూ కూర్చోవాలన్న చేతగానితనమే పనికిరాదు. అక్కణ్నించీ ఎదగటం నేర్చుకోవాలి మనం. అన్నీ అందుబాటులో వున్నప్పుడు, బతుకు పూలబాటన సాగిపోతున్నప్పుడు వేదికలెక్కి ఉపన్యాసాలు ఇవ్వటంకాదు కావల్సింది. కాలనాగు కాటేసినప్పుడూ ధైర్యంగా నిలబడి, విషాన్ని హరాయించుకునే శక్తిని సంపాదించుకుంటే, లోకం దానంతట అదే మనకు దాసోహం అంటుంది" అని గుర్తుచేసింది కవిత.

"కానీ స్వార్థపరులయినవాళ్ళు సాంప్రదాయాలు, కట్టుబాట్ల పేరుతో మన కాళ్ళూ చేతులూ కనిపించకుండా ఎలా కట్టిపడవేశారో చూశావా?" అని అడిగింది పావని.

"ఈ సోకాల్డ్ సంప్రదాయాలు, కట్టుబాట్లు మన సౌకర్యంకోసం మనం ఏర్పరుచుకున్నవే. మనం నలుగురం




వాటిని గౌరవించినంత వరకే కదా వాటికి గౌరవం"

"నువ్వేన్ని చెప్పినా అనాదిగా వస్తున్న ఆచారాలు మన రక్తంలో జీర్ణించుపోయి నాయి. మనకు తెలియకుండానే మనం వాటికి లొంగిపోతుంటాం. ముఖ్యంగా ఆడ దాని కన్నీటి కాలువలతోనే మగవాడి జీవన క్షేత్రాన్ని పండించటం మనకు అతి సహజం అయిపోయింది"

"అదే వద్దంటున్నాను. అయిన దానికీ, కాని దానికీ కన్నీరు కారుస్తూ కూర్చునే జాడ్యం మనలో వున్నంత వరకూ, మనల్ని ఎవరూ ఉద్ధరించలేరు. అంతులేని ఈ కన్నీటి కథలు వినివిని విసుగెత్తిపోయింది లోకం-మనమైనా కొత్త కథలు చెబుతామని ఈ తరం వేపు ఆశగా ఎదురుచూస్తోంది. సహజాలు అసహజం కావాలి. అసహజం సహజం కావాలి. అప్పుడే మనకు విముక్తి. ముందు వాటిని ఎదుర్కొని తట్టుకుని నిలబడగల మానసిక ధైర్యం కావాలి" అని నూరి పోసింది కవిత.

"నువ్వేన్ని చెప్పినా, రేపు ఈ పసి వాడు లేతచేతులతో నా మెడను చుట్టేసు కుంటే, ఈ పెళ్ళికాని తల్లిని చూసి లోకం పకపకా నవ్వుతుంది. నలుగురూ నన్ను గడ్డిపోచకన్నా హీనంగా చూస్తారు"

"నీ పరిస్థితులో నేనుంటే తప్పు చేసిన వెధవనలా వదిలేసే దాన్నికాదు. ఏతప్పూ చేయని పుట్టబోయే పసివెధవను నిందిస్తూ కూర్చునే దాన్నికాదు. అయితే ఒకటి మాత్రం నేనూ ఒప్పుకుంటున్నాను. ఏ తిరుగుబాటు అయినా, మార్పు అయినా ఒక్కసారిగా వచ్చిపడితే తట్టుకోవటం కష్టమే. నీ మటుకు నీవు పెళ్లిగాని తల్లిగా లోకంలోకి వెళ్ళలేనంటావు...అంతేగదా. పుట్టిన బిడ్డ నా బిడ్డగానే పెరుగుతాడు. లోకం దృష్టిలో నేనే వాడి తల్లిని. ఇంకేం కావాలి నీకు?" అని దగ్గరకొచ్చి భుజం మీద చెయ్యివేసింది.

"దేవుడు నాకు అన్యాయం చేశాడని బాధపడుతూ వచ్చాను. కానీ నీలాంటి చెల్లెల్ని నాకిచ్చి నన్నెంతో అదృష్ట వంతురాల్ని చేశాడు. నా అనుకునే వాళ్ళందరికీ దూరమైనాను. మీకు మాత్రం తెంచుకోలేని బంధమైనాను. ఇదే నాకు చిత్రమనిపిస్తుంది..." అన్నది పావని, కవిత ఒడిలోకి జారిపోయి. కవిత ఆప్యాయంగా ఆమె తల నిమురుతూ కూర్చుంది.

అలసిపోయిన ఆలోచనలతో, నిద్ర పోయింది పావని పసి పాపలాగా.

* * *

డాక్టరు చెప్పిననాటికి నాలుగు రోజులు ముందుగానే సరస్వతమ్మగారు కూడా వచ్చింది. ఆమెను చూశాక పావనికి, కవితకు మరికొంత ధైర్యం వచ్చింది.

నర్సింగ్‌హోంలో పావని పురుడు పోసుకుంది.

పేగు తెంచుకుని పుట్టిన ఆ పసివాడు భూమ్మీదపడి కెవ్వుమనగానే పావని అప్పటిదాకాపడ్డ బాధా, వేదనా, మనస్తాపం...అన్నీ మర్చిపోయింది.

వాణ్ణి చూసుకుని తృప్తిగా నిట్టూర్చింది. అనుకోకుండానే పెదాల మీదకు చిరునవ్వు తొంగిచూసింది. అంత లోనే విచారమూ ముంచుకొచ్చింది.

సంతోషం, దుఃఖం మిళితమై వచ్చాయి రంగుల హరివిల్లులాగా. అవి అశ్రువులో, ఆనందభాష్పాలో భాష్యం చెప్పగల వారెవరు?





సరస్వతమ్మగారు మాత్రం అంది - "మనం ఎప్పుడు నవ్వాలో, ఎప్పుడు ఏడవాలో దేవుడు ముందుగానే నిర్ణయించి పంపిస్తాడు. ఆయన ఆదేశం మేరకు ఈ చీకటి వెలుగుల మధ్య తారట్లాడు తుండటమే మన విధి"

కవిత పిల్లాణ్ని చూసి తెగ ముచ్చట పడిపోయింది. వాళ్లింట్లో కవిత ఒక్కతే. ముందుగానీ, తర్వాతగానీ పసిపిల్లలు లేకపోవటంతో ఆ దొ క వెలితిగానే ఉండేది. ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు ఈ పిల్లాడు వచ్చాడు కేర్‌మని ఏడుస్తూ.

ఇష్టం వున్నా లేకపోయినా, తప్పదు కనుక ప్రసాద్ కూడా నర్సింగ్‌హోంకు వచ్చాడు.

"వీడికి మంచిపేరు ఏదన్నా చెప్పండి.. పెడదాం" అంది కవిత భర్తకు బాబును అందిస్తూ.

"ఒక దౌర్భాగ్యురాలికి, మరో నికృష్టపు వెధవకూ పుట్టిన దురదృష్ట వంతుడు వాడు. మంచి పేరు కూడా ఎందుకు? పుల్లయ్య అనో, పెంటయ్య అనో పెడితే సరిపోతుంది" అంది పావని.

"అదంతా నీకు అనవసరమె. కనటం వరకే నీ బాధ్యత. అంతటితో నీ పని అయిపోయింది. ఇక వీడు మా కొడుకు. వీడికి ఏం పేరు పెట్టుకుంటామో, వీడి పేర ఏం పెడతామో అవన్నీ మా ఇష్టం. నువ్వు నోరెత్తటానికి వీల్లేదు" అని గదమాయించింది కవిత.

రాత్రిళ్లు సరస్వతమ్మగారు వచ్చి నర్సింగ్‌హోంలో పడుకుంటుంటే ఇంటి దగ్గర వంట పని కవిత చేసుకుంటోంది. ఉదయమే సరస్వతమ్మగారు ఇంటికి వెళ్తుంది. ఈలోగా కాఫీ తెచ్చి ఇచ్చే డ్యూటీ ప్రసాద్‌కు తప్పలేదు. ఆ విధంగా

ప్రసాద్ ఒంటరిగా పావనికి చిక్కేవాడు. ఓసారి పావని ఝాడించింది.

"నువ్వు తెలివిగా నన్ను మోసం చేశావు. కానీ నువ్వు చేసిన పెద్ద పొరపాటు ఏమిటంటే...మళ్ళీ ఈ ఇంటి అల్లుడిగా రావటమే. ఈ ఇంట్లో మనుషులంతా దేవతలు. మంచితనం అనే చెట్టుకు విస్తరించిన శాఖలు. నీలాంటి స్వార్థపరుల నీడను కూడా వీళ్ళు అసహ్యించుకుంటారు. పైగా ఈ ఇంట్లో నా స్థానం ఏమిటో నీకు చెప్పినా వినిపించుకోలేదు. కవితకు ఎంత ప్రాముఖ్యం వుందో నాకూ అంత ప్రాముఖ్యం వుంది. నాకు ద్రోహం చేసింది ఎవరో చెప్పమని బాబాయిగారు అడిగినప్పుడు, నీ పేరు చెప్పి వుంటే ఈపాటికి నువ్వు ఫుట్‌పాత్ మీద ఉండేవాడివి.

"కవిత అభిప్రాయాలూ,ఆలోచనలూ, ఆవేశం నీకిప్పటికే బాగా అర్థం అయి ఉండాలి. నువ్వు పైకి కనిపిస్తున్నంత అమాయకుడివి కాదని, ఒక గోముఖ వ్యాఘ్రానివని దానికి తెలిస్తే, అది సాక్షాత్తూ కాళికా అవతారమే ఎత్తుతుంది.. వీడిని కన్న తండ్రివి నీవేనని చెప్పమంటావా నీ ముద్దుల భార్యకు"

అప్పుడు ప్రసాద్ చాలా రోజుల తర్వాత ఆమె ముందు నోరు విప్పాడు.

"నీకు నేను అన్యాయం చేసిన మాట నిజమే...నన్ను క్షమించు"

వెంటనే పావని అడ్డుపడింది "అన్యాయం అనేమాట చాలా చిన్న మాట. నన్ను సర్వనాశనం చేశావు. ఒక బలహీనమైన క్షణంలో నీ మాటలు నమ్మినందుకుగాను నన్ను కాలరాసి పారేశావు. నా జీవిత సుమాన్ని నీకు ప్రేమగా అందిస్తే, దాన్నుండి పన్నీరు పిండుకుని మీద చల్లుకుని పెళ్ళికొడుకుగా వెళ్లావు, మరొకర్ని పెళ్ళి చేసుకునేందుకు. నీ పెళ్ళినాడు పందిట్లో అందరిమీదా చిలకరించింది పన్నీరు కాదు నాకన్నీరే.నీ పెళ్ళికి మోగిన మంగళవాయిద్యాల్లో నా రోదన కలిసిపోయింది. నీకు బంధ రా యి కాకుండా, స్పందించే హృదయం అంటూ ఉంటే నా ఏడుపు వినిపించే ఉండాలి. కానీ దిక్కులేని ఆడది ఏం చేస్తుందని కదూ నీ ధీమా...? నన్ను నాశనం చేసిన నిన్ను నిముషంలో నాశనం చేయగలను. ఒక్కమాట నా పెదవిదాటి వస్తే నీవు అందంగా నిర్మించుకున్న నీ జీవిత ఆశాసౌధం కుప్పకూలిపోతుంది. ఏం... అలాచేసి చూపించమంటావా?''

"నన్ను క్షమించు''

''ఎందుకు క్షమించాలి? కొన్ని క్షణాల సుఖాన్ని ఇద్దరం సమానంగా పంచుకున్నాం. అది నీకొక మధురానుభూతిగాను, నాకొక తీరని శాపంగాను ఎందుకు పరిణమించాలి? ఇద్దరు భాగస్వాములు కల్సి ఒక పనిచేసినప్పుడు, ఫలితాలు ఇద్దరికీ సమానంగానే ఉండాలి కదా. న్యాయానికి జీవితాంతం ఇద్దరం సుఖపడాలి. కానీ నాకాయోగ్యత లేకుండా చేశావు. అలాంటప్పుడు నువ్వొక్కడివి మాత్రం ఎందుకు హాయిగా ఉండాలి? నీ జీవితాన్ని నేనూ ఎందుకు ఎడారిపాలు చేయగూడదు?''

ఇంతలో బాబు లేచాడు. బట్టలు ఖరాబు చేశాడు. అప్పుడు పావని అంది-

''బాత్‌రూంలోకి వెళ్ళి ఆ బట్టలు ఉతుక్కురా''

''నేనా?'' అని ఆశ్చర్యపొయ్యాడు.

''నువ్వే! అమెరికాలో మొగుళ్లు ఇలాగే చేస్తారు. పెళ్ళి తొం ద ర గా





ఉతుక్కురా''

"ఏమిటి నీ ఉద్దేశం ?" అని అడిగాడు మొహం చిట్లించి.

"చెప్పానుగదా...వాడు నీకూ కొడుకే. వాడు నీదగ్గరే పెరగబోతున్నాడు. పూర్తి బాధ్యత కవితకన్నా నీమీదే ఎక్కువగా ఉంది. ఇకపోతే, నీ మగ జాత్యాహంకారాన్ని దెబ్బతీయటం కోసమే నేను ఇక్కడకు వచ్చాను. నాకు లేని మనశ్శాంతి నీకూ లేకుండా చేయాలనే ఈ బిడ్డను ఇక్కడ వదిలేసి వెళ్తున్నాను. వీణ్ని నిర్లక్ష్యం చేయటానికి నీవు ప్రయత్నిస్తున్నావని తెల్సినరోజున వీడి తండ్రివి నీవేనని చాటింపు వేయటం నాకు తప్పనిసరి అవుతుంది. ఊ... వాడు ఏడుస్తున్నాడు, వినిపించటం లేదా?'' అని గద్దించింది పావని.

ప్రసాద్ పిల్లాడికి పాలుపడుతుంటే, గుడ్డలు ఉతికి ఆరేస్తుంటే చూసి పావని కొంత కుదుటపడింది.

తనను ప్రాణాధికంగా ప్రేమిస్తున్న కవిత జీవితం వీడితో ముడిపడి ఉంది కనుక బతికిపోయ్యాడు. వీణ్ని బయటకు ఈడ్చినందువల్ల తన జీవితం బాగుపడదు సరిగదా, కవిత జీవితాన్ని కాల్చివేసినట్లు అవుతుంది. ఈ ఒకే ఒక్క ఆలోచన వీడి పాలిటి వరం అయిపోయింది.

పావని పిల్లాడితో ఇంటికి వచ్చాక, వాడిపోషణ భారమంతా కవితే తీసుకుంది. మధ్యలో వాణ్ని భర్త దగ్గరకు తీసుకెళ్ళి ఏవేవో అడుగుతోంది. అతను సమాధానం చెప్పినట్లూ, చెప్పనట్లూ తప్పించుకుంటున్నాడు. పావని గమనిస్తున్నప్పుడు మాత్రం పిల్లాణ్ని ప్రేమగా ముద్దాడుతున్నాడు.

నాలుగురోజులపాటు కిందామీదాపడి కవిత పసివాడికో పేరు సెలెక్ట్ చేసింది. సాత్విక్ అన్న పేరు ఖాయం చేసింది.

"ఒక కసాయివాడి కొడుకు సాత్వికుడు ఎలా అవుతాడు?'' అని అడిగింది పావని.

"ఆ కసాయివాడు కనీసం నీకు సంబంధించినంతవరకూ చచ్చిపొయ్యాడని చెప్పావుగా. కనుక వీడు పరమ సాత్వికురాలైన ఒక తల్లి కడుపున పుట్టిన బిడ్డగా ఆ పేరుకు అర్హుడే. ఇక వీడి తల్లి ఎంత గొప్పదంటే, తండ్రి పేరుకూడా బయటకు రానివ్వదు. కానీ అక్కా....మాకు చెప్పకపోయినా, రేపు వీడు పెద్దఅయ్యాక నా తండ్రి ఎవరూ అని అడిగితే అప్పుడు అయినా చెప్పాలి" అంది కవిత.

"ఎందుకు చెప్పను?అదుగో ఆయనేనీడి తండ్రి"అని ప్రసాద్ వంక చూపించింది.

అతని గుండెల్లో ఒక్కసారిగా పది వేల ఫిరంగులు మోగాయి.

"లోకందృష్టిలోనూ, నా దృష్టిలోనూ కూడా ఇకనుంచి మీరిద్దరే వాడి తల్లిదండ్రులు. వాణ్ని ప్రేమగా చూసినా, ఏదరించుకున్నా, ఇక అదంతా మీ ఔదార్యం, వాడి అదృష్టం.నాకు మాత్రం ఎలాంటి సంబంధం లేదు. ఉండకూడదనే కోరుకుంటున్నాను. మనసు చంపుకుని బతుకుతున్నానుగనుక,నాకుమమకారాలూ ఉండవు ఇంక'' అని చెప్పింది.

అన్నట్లుగానే వాణ్ని దగ్గరకు తీయటం మానేసింది. గుక్కపట్టి ఏడుస్తున్నా, సరస్వతమ్మగారుగాని, కవితగాని వచ్చి వాణ్ని ఎత్తుకుంటున్నారు. ఇదంతా గుండెరాయి చేసుకునే ప్రయత్నమేనని వాళ్ళకీ తెల్సు.పగలంతా ఎంత గంభీరంగా ఉంటున్నా, రాత్రిళ్లు కళ్లు వాచిపోయేలా ఏడుస్తూనే ఉంది. వాళ్ళిద్దరూ ఎంత ధైర్యం చెప్పి, మరెంత హితబోధ చేసినా,

అప్పటికి శాంతించినా, కడుపులోనుంచి భగ్గున రగులుతున్న మంటను కన్నీళ్ళతో ఆర్పుకోవటం పావనికి అనివార్యం అవుతోంది.

పిల్లాడికి నెల తిరక్కముందే పావని హైదరాబాదు బయల్దేరింది ఒంటరిగా. సరస్వతమ్మగారు అక్కడే ఉండిపోయింది పిల్లాడి సంరక్షణకోసం. అంతా కల్సివస్తే ఎవరైనా అనుమానిస్తారేమోనన్న భయమూ లేకపోలేదు.




ఇంటికి వచ్చాక పావనిని తల్లీదండ్రీ చుట్టుముట్టారు.

''అదేమిటే... ఆ పిల్లకు పురుడోస్తే నువ్వు వెళ్ళి ఇన్నాళ్ళు అక్కడ ఉండటం ఏమిటి? అయినా ఆ పిల్లను మొదటి కాన్పుకు పుట్టింటికి తీసుకురాకుండా అక్కడ పొయ్యటం ఏమిటి? అతగాడు పెళ్ళాన్ని వదలి ఆ మాత్రం ఉండాలేడా ఏమిటి?'' అని అడిగాడు కుటుంబరావు గారు.

''ఇన్నాళ్ల అక్కడ ఉండి ఇంత చాకిరీ చేసొచ్చావు. నీకేమిటి వొరిగింది?" అని నిలదీసింది తల్లి.

"ఎవరు ఎవరికి ఎంత చాకిరీ చేశారో, మాలో ఎవరు ఎవరికి ఎంత ఋణపడి ఉన్నామో మీకు అర్ధంకాదు. కనుక అలాంటి విషయాల గురించి పట్టించుకోకండి'' అని చెప్పింది పావని.

"ఇంతకీ నీ మోహాన ఒక చీరగుడ్డ అన్నా పెట్టారా?" అని ఆరా తీసింది.

''నేను తింటున్న ప్రతి ముద్దా, కడుతున్న ప్రతిగుడ్డా వాళ్ళు పెట్టిన భిక్ష. మా మధ్యనున్న అనుబంధం ఎలాంటిదో చెప్పటానికి భాషా, భావప్రకటనా చాలదు. రెక్కలు రాకముందునుంచే పిల్లలు నాలుగు రాళ్ళు సంపాదించిపెట్టాలని ఊహించే మీలాంటి వాళ్ళకు, ఈ ఆత్మీయత గురించి ఎంత చెప్పినా అర్ధం కాదు. కనుక మమ్మల్నిలా వదిలేసి మీ దోవన మీరు వెళ్ళండి" అని తరిమి కొట్టింది పావని.

ఆరోజు రాత్రి సత్యనారాయణగారు పరామర్శించినప్పుడు మాత్రం బాధను ఆపుకోలేక ఏడ్చేసింది.ఆమెను ఓదార్చటం ఆయన వంతు అయింది.

"పిల్లాడికి వచ్చిన లోటేమీ ఉండదు. మీ ఇద్దర్లో ఎవరి కడుపున పుట్టినా, వాడు మా మనవడే. కనుక వాణ్ని గురించిన తాపత్రయం నీకు అనవసరం. చెదిరి పోయిన కలల్ని మళ్ళీ కూడదీసుకుని, జీవితాన్ని కుదుటపర్చుకునే మార్గం ఆలోచించాలి. ఈ రహస్యం మనింటి నాలుగు గోడల మధ్యే ఉంటుంది. నీవు కాస్త కోలుకున్నాక, నీకు మంచి సంబంధం కుదిర్చి పెళ్ళిచేసే బాధ్యత నాకు ఉందమ్మా. నేను దాన్ని మర్చిపోలేదు" అని నచ్చచెప్పారు.

ఇంకో వారం రోజులు విశ్రాంతి తీసుకున్నాక పావని ఆఫీసులో జాయిన్ అయింది. రెండోరోజు ఆఫీసుకు వెళ్తుంటే బస్‌స్టాప్‌లో శేఖర్ కనిపించి చనువుగా దగ్గరకొచ్చి పలకరించాడు.

"నమస్కారమండీ... నేను గుర్తు

న్నానా?"

"మర్చిపోతే గదా?'' అని నవ్వింది.

''ఇదేమిటి, ఇలా అయిపొయ్యారు?" అని అడిగాడు శేఖర్.

''అక్కడి నీళ్లు సరిపడలేదు. జబ్బు చేసింది... ఇప్పుడు ఫర్వాలేదు. అయామ్ ఆల్ రైట్''

"పోనెండి..."

ఇంతలో ఆటో దొరికింది. ఇద్దరూ ఎక్కారు. దారిలో అతను అన్నాడు.

''మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి"

"ఒక అబ్బాయి ఒక అమ్మాయితో ముఖ్యమైన విషయం మాట్లాడాలీ అన్నాడంటే అది అతని పెళ్లి గురించే అయి ఉంటుంది...." అని నవ్వింది. కానీ అతను నవ్వలేదు. సీరియస్‌గానే అన్నాడు–

"లేదండి .... నా పెళ్లి అయిపోయింది..."

ఆ మాటలు పావని గుండెల్లోకి గురి చూసి వదిలిన తుపాకీ గుండ్లలాగా దూసుకుపోయినాయి. ఆ విషయమే ఆమెకు మింగుడు పడలేదు. అయినా సభ్యత కోసం తెచ్చుకున్న గంభీరతతో అన్నది.

"చూశారా... మీ పెళ్లికి నన్ను పిలవను కూడా లేదు"

"ఎవర్నీ పిలవటానికి టైం లేకపోయింది నా పెళ్లికి... సారీ, పాణిగ్రహణానికి మీరొక్కరే వచ్చారు. పెళ్లికూతురూ మీరే, పురోహితులూ మీరే. కానీ మీకా విషయం గుర్తుండకపోవచ్చు" అన్నాడు శేఖర్.

పావని తేలికగా నిట్టూర్చింది. ఆటో హోటల్ ముందు ఆపించాడు. అతనితో పాటు ఆమెకూడా లిఫ్ట్‌లోకి వెళ్లింది ఎందుకూ అని అడగకుండా.

రూంలోకి వెళ్లాక ఫాన్ వేసి, ఆమెకు కుర్చీ చూపించి అతనే చెప్పాడు–

"పదిరోజులైంది రూం తీసుకుని...."

"దేనికి?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"చెప్తాను" అంటూ బాయ్‌ని పిల్చి కూల్ డ్రింక్ చెప్పాడు.

ఆమెకు ఎదురుగా మంచంమీద కాళ్లు ముడుచుకు కూర్చున్నాడు, దిండుకు ఆనుకుని.

"మీకు గుర్తుందో లేదో, ఒకరోజు చిల్లర కావల్సివచ్చి ఒక లాటరీ టిక్కెట్టు తీసాం. అదీ మీ చేతిమీదుగా తీసుకున్నారు. దానికి అయిదు లక్షల రూపాయలు బహుమతి వచ్చింది" అన్నాడు శేఖర్.

పావని మొహం ఆనందంతో దేదీప్యంగా వెలిగిపోయింది.

"నిజమా?" అంది నమ్మకం కుదరక.

"నిజమే"

"నాకు పార్టీ ఇవ్వాలి మరి"

"అలాగే, ఏం పార్టీ కావాలో కోరుకోండి. అయినా ఈ రోజుల్లో అయిదు లక్షలంటే మామూలయిపోయింది గదా"

"వెధవ పార్టీ నాకెందుకు? నా చేతిమీదుగా తీసానుగదా... అందుచేత నాకో మంచి బహుమతి ఏదన్నా ఇవ్వండి" అని అడిగింది పావని.

"నేనూ అదే అనుకున్నాను. మీకు ఎలాంటి బహుమతి ఇవ్వాలా అని ఆలోచించి ఆలోచించి చివరకో నిర్ణయానికి వచ్చాను"

"ఏమిటీ?"

"ఇన్నాళ్లూ మనకు జీవితం మీద లక్ష్యాలే తప్ప, చేతిలో లక్షలు ఉండేవి కావు. అనుకోకుండా నీ చేతి చలవవల్లనే ఈ అయిదు లక్షలూ వచ్చాయి. ఇది

కేవలం నీ అదృష్టమే. నీవు సంపాదించు కున్న డబ్బే అది"

"భలేవాళ్లే... అదేం లేదు" అని అడ్డుచెప్పింది పావని.

"ఆనాడే చెప్పాను. ఆ డబ్బువస్తే అదంతా నీకే ఇస్తానని. కానీ నా మనసు మార్చుకున్నాను. నీకు ఇవ్వటం లేదు. సినిమా తీస్తున్నాను. ఆ సినిమాలో అన్ని పాటలు నువ్వే పాడుతున్నావు... దానికి కథ, మాటలు, పాటలు అంతా సిద్ధం చేయించాను కూడా"

"సినిమాలు మనలాంటివాళ్ళకు కాదు. లక్షలమీద వచ్చినా పోయినా తట్టుకోగల వాళ్లు చేయవల్సిన వ్యాపారం. అందులో లోతుపాతులూ మనకు తెలియవు. చేతికి అందివచ్చిన ఈ డబ్బును చేజేతులా అక్కడ పారబోసుకోవటం అవుతుం దేమో. అయినా సినిమాకు అయిదు లక్షలేం సరిపోతాయి" అంది పావని.

"అయినా ఫర్వాలేదు. ఇది వస్తుందని మనం ఆశించలేదు గనుక పోతే పోయిందన్న విచారమూ అక్కర్లేదు. కానీ నిన్ను గాయనిని చేయాలన్న నా ఆశయం మాత్రం నెరవేరే అవకాశం వచ్చింది. దీన్ని వదులుకోలేను. ఇన్నాళ్ళూ వాళ్ళ చుట్టూ, వీళ్ళచుట్టూ తిరిగాం. చెట్టు ఎక్కదల్చుకున్నవాడు పట్టుకొమ్మల్ని పట్టుకోవాలిగాని పిందెల్ని, ఆకుల్ని పట్టుకుని వేళ్ళాడితే ప్రయోజనంలేదు" అన్నాడు శేఖర్.

ఆమె వద్దని ఎంత వారించినా ప్రయోజనం లేకపోయింది.

"నాకు పిరికిమందు పొయ్యవద్దు. నేను అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాను. నీ రాకకోసమే ఎదురుచూస్తున్నాను. నువ్వు ఎంత తొందరగా బయల్దేరగలిగితే అంత మంచిది" అన్నాడు శేఖర్.

ఆమెకు ఇదంతా ఏదో కలలో జరుగు తున్నట్లుగా ఉంది. ఎంతకీ నిజమని పించటంలేదు.

ఒకటికి రెండుసార్లు అతను నొక్కి అడుగుతుంటే పావని అతని ఇష్టానికే వదిలేసింది.

రెండురోజుల టైం మాత్రమే ఇచ్చాడు. మూడోరోజు రైలుకు రిజర్వేషన్ చేయిస్తానన్నాడు. ఆమె సరేనంది.

ఈ విషయమంతా సత్యనారాయణ గారికి చెబితే, ఆయన కూడా ఆమెకే నిర్ణయాన్ని వదిలేశాడు.

"అతను ఎలాంటివాడు? అసలే దెబ్బ తిని ఉన్నావు" అన్నారు.

"నాకు ఇతనితో అలాంటి భయం ఏమీలేదు. పైగా నన్ను పెళ్ళిచేసుకోవా లనే అనుకుంటున్నాడు"

"నీకా నమ్మకం వుంటే వెళ్లు. కానీ జాగ్రత్తమరి" అన్నారు.

అనుకున్నట్లుగానే ఆరోజు బయల్దేరారు పావని, శేఖర్. మర్నాడు తిరుపతి చేరుకున్నారు.

కాటేజ్‌లో దిగి స్నానాలు చేసి వరండాలో కుర్చీలు లాక్కుని కూర్చు న్నారు. మైకులో అన్నమాచార్యుని కీర్తనలు శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. జనం పల్చగా తిరుగుతున్నారు. అక్కడి ప్రశాంతత, ప్రకృతి దృశ్యం పావనిని ఎంతో ఆకర్షించింది.

"రెండుపూటలా ఇంత తిండి పడేసే వాడుంటే, ఏ చీకూచింతా లేకుండా ఇలా ఇక్కడే ఉండిపోవాలనిఉంది" అంది పావని.

"చీకూ చింతా లేనివాళ్లు ఎవరుంటారు?

దేవుడు జనంనుంచి దూరంగా పారిపోయి వచ్చి ఈ కొండల్లో నివాసం ఏర్పరుచుకుంటే ఆయన్ని అయినా ప్రశాంతంగా ఉండనిస్తున్నారా? అంతులేని కోరికలతో వచ్చే ఈ జనబాహుళ్యాన్ని సమర్థించటం ఆయనకూ చేతకావటంలేదు" అన్నాడు శేఖర్.

మొదలుపెట్టబోయేపని నిరాటంకంగా కొనసాగాలని దేవుడిని కోరుకున్నారు. కళ్యాణం కూడా చేయించారు.

"మరి మన కల్యాణం ఎప్పుడో దేవుణ్ని అడగటం మర్చిపొయ్యాను" అన్నాడు శేఖర్.

"నీ పాణిగ్రహణం అయిపోయిందన్నావుగా?" అని గుర్తుచేసిందామె.

"నా మటుకు నాకు అయిపోయింది. కానీ నువ్వు దాన్ని పట్టించుకోవటంలేదు. అదే నా బాధ. ఇవాళ ఏమైనాసరే, నీ మనసులో మాట స్పష్టంగా చెప్పాల్సిందే. ఏమిటి నీ అభ్యంతరం?"

"మన మధ్యనున్న అంతరమే అభ్యంతరం...ఇవాళ నీ దగ్గర అయిదు లక్షలు ఉన్నాయి. నాదగ్గర అన్ని పైసలు కూడా లేవు" అంది తేలికగా నవ్వేస్తూ.

"అలా అయితే ఈ అయిదు లక్షలూ రేపే నీ పేర ట్రాన్స్ఫర్ చేస్తాను"

"అప్పుడూ మనమధ్య ఆ అంతరం అలాగే ఉంటుంది"

ఇద్దరూ కాటేజ్‌లోకి వచ్చేశారు. బట్టలు మార్చుకుంటుంటే కరెంటు పోయింది. చుట్టూ చిమ్మచీకటి ఆవరించేసింది.

మామూలు సమయంలో మనిషివేరు. అడది ఒంటరిగా ఉన్నప్పుడు మనిషిని వేధించే ఆలోచనలు వేరు. అదీ మనసులు కలిసినవాళ్లు అయితే చెప్పాల్సిన పనిలేదు. ఆ వ్యామోహానికి చీకటి తోడైంది.

ముందుగా ఎవరు ఎవర్ని పట్టుకున్నారో తెలియదు. ఇద్దర్నీ చుట్టుకుని ఉన్న యవ్వనం మాత్రం ఆ చీకట్లో తనకు కావల్సిందేదో వెతుక్కునే ప్రయత్నం చేసింది.

ఎప్పుడు పట్టుకుందో వర్షం- పొద్దున్నే నిద్రలేచి తలుపులు తీసేటప్పటికి కుండపోతగా కురుస్తోంది. చల్లని గాలి ఆప్యాయంగా పలకరించింది.

ఆమె వరండాలో కూర్చున్న అరగంటకు అతనూ లేచి వచ్చాడు. పావని శేఖర్ని చూసి నవ్వింది.

"బాగా నిద్రపట్టిందా?" అని అడిగింది.

"కన్ను మూతపడలేదు"

"నిద్రపోవాలంటే కళ్లు మూసుకోవాలి మరి"

"కళ్లు మూసుకోవాలంటే, మనసు స్తిమితపడాలిగదా ముందర"

"ఏమైంది నీ మనసుకు?"

"అది తెలియకనే ఆరాటం. అసలే చిన్నది జీవితం, ఇంకా చిన్నది యవ్వనం అన్నారు. పైగా నీ అంతులేని ఆలస్యం అయితే ఎలా?"

"నిన్ను ఇబ్బంది పెట్టాలన్నది నా అభిమతంకాదు. కానీ నేను ఒక స్తితికి వచ్చేవరకూ పెళ్ళిచేసుకోలేను. అందుకు కొంత వ్యవధి కావాలి నాకు" అంది పావని.

"నిన్ను కాదనలేక పోతున్నాను. అవుననీ అనలేకపోతున్నాను. నామటుకు నేను ఇంకో రెండేళ్లు గడువు పెట్టుకున్నాను. ఈ రెండేళ్లలో నా భవిష్యత్తు ఏమిటో తెలుస్తుంది. అంతవరకు నువ్వు ఆగలేనంటే. నిన్ను అడ్డుకోగలశక్తి నాకులేదు"

"మనసులు కలవని శరీరాల కలయిక శవాల కలయికేనని నాకు తెల్సు. నామీద నీకూ ఇష్టం కలిగేవరకూ వేచి ఉంటాను" అన్నాడు శేఖర్.

* * *

మద్రాసు వచ్చాక శేఖర్ అంతకు ముందే చాలా ఏర్పాట్లుచేశాడన్న విషయం పావనికి అర్థమైంది.

ప్రొడక్షన్ ఆఫీసులో రచయిత, డైరెక్టరు, మ్యూజిక్ డైరెక్టరు వగైరా సాంకేతికవర్గం అంతా సమావేశమవు తోంది. పావని వెళ్ళిన రెండు రోజులకు మ్యూజిక్ రిహార్సల్స్ మొదలుపెట్టారు.

చెప్పగానే ఆకళింపు చేసుకుని పాడింది పావని. ఆమె కంఠంలోని శ్రావ్యతకీ, మాధుర్యతకీ సంగీత దర్శకుడు ఎంతో మెచ్చుకున్నాడు. ఆయన చాలా హిట్ సినిమాలకు సంగీతం సమకూర్చి మంచి గిరాకీలో ఉన్నాడు. అందుచేత ఆయన మొదటిరోజు రిహార్సల్స్ అయ్యాక, శేఖర్‌ను పక్కకు పిల్చి చెప్పాడు.

"చూడండీ... ఆ అమ్మాయి బాగానే పాడుతోంది. కానీ రికార్డింగ్‌లో ఎలా ఉంటుందో తెలీదు. ఎంత బాగా పాడినా, కొత్తవాళ్ళను పెట్టుకుంటే పిక్చర్ మార్కెట్ కావటం కష్టం. నాకు ఒక మంచి చిత్రానికి పనిచేశానన్న తృప్తి, మీకు చిత్రం బాగా పోయిందన్న తృప్తి





మిగలాలీ అంటే, ఫీల్డులో ఉన్నవాళ్ళనే పెట్టుకోవటం మంచిది. అంతగా కావాలంటే, ఒకచోట ఎక్కడన్నా ఒక చరణం పాడిద్దాం... ఏ సైడ్ హీరోయిన్ వేషానికో" అని నచ్చ చెప్పబోయ్యాడు.

శేఖర్ ఒప్పుకోలేదు. "అయ్యా... మీ వ్యాపార రహస్యాలు, వృత్తి రాజకీయాలూ నాకు తెలియవు. నేను ఆమెను నా

చిత్రంలో అన్ని పాటలూ పాడించదల్చు కున్నాను. అందుకు మీకేమన్నా అభ్యంత రమా?"

"నామటుకు నాకేం అభ్యంతరం లేదు" అన్నారాయన.

"మరయితే ఇంకేం చెప్పకండి" అన్నాడు శేఖర్.

పాటల రికార్డింగ్ నాడు పరిశ్రమలోని పెద్దలు అందర్నీ ఆహ్వానించాడు శేఖర్. ఇతను కొత్త నిర్మాత గనుక, ఇతని హిస్టరీ, జాగ్రఫీ ఎవరికీ తెలియదు గనుక పెద్ద నిర్మాతలు ఎవరూ రాలేదుగాని, నలుగురు అయిదుగురు కొత్త నిర్మాతలు, ఆ దర్శకుడు, సంగీత దర్శకుడు చేత సినిమాలు తీయిస్తున్న ఇంకో నలుగురు ప్రసిద్ధ నిర్మాతలు రికార్డింగ్‌కు హాజరైనారు.

పూజ పూర్తి కాగానే శుభాకాంక్షలు చెప్పి వెళ్ళిపోయ్యారు. పావని అనే కొత్త గాయని ఈ చిత్రంతో పరిచయం అవుతోందని తెల్సుకున్నారు...ఆమెను పలకరించారు. బిడియంతో ఒదిగిపోతూ నమస్కారాలు చెప్పింది. 'బాగా పాడి, పేరు తెచ్చుకొని, పైకి రావాలని' ఆశీర్వదించి వెళ్ళారు.

మొదట్లోనే ఒక డ్యూయెట్ సాంగ్ మొదలెట్టారు. పరిశ్రమలోవున్న సుప్రసిద్ధ గాయకుడితో డ్యూయెట్ పాడటం, చుట్టూ ఉన్నవాళ్లు అంతా కొత్తవాళ్ళే కావటంతో ఆమెకు కొంత నెర్వస్‌గా వున్నా, ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తూ, కలలు కంటున్న శుభముహూర్తం కావటంచేత తనకు తనే ధైర్యం తెచ్చుకుంది.

సంగీత దర్శకుడు చెప్పినట్లుగానే, రిహార్సల్స్‌చేయించినట్లుగానే పాడుతున్నా ఆయనకు నచ్చటంలేదు. హమ్మింగ్ అనుకున్నట్లు రావటంలేదన్నాడు. పాడిందే పాడిస్తున్నాడు. ప్రతీసారి కొత్త మెలిక తిప్పుతున్నాడు. ప్రసిద్ధ గాయకుడు పాడింది మాత్రం ఓకే అయిపోతోంది. ఈమెను అడుగుఅడుగునా ఆపేస్తున్నాడు.

ఆ గాయకుడు వాచీవంక చూసుకుంటున్నాడు, ఇంకెంతసేపు నాకీ పరీక్ష అనుకుంటూ. అది గమనించిన సంగీత దర్శకుడు పావనిని విసుక్కున్నాడు ... ఒక అరగంట రికార్డింగ్ ఆపేశాడు.

"ఒకసారి చెబితే అర్థం చేసుకోవాలి, అల్లుకు పోవాలిగాని, రోజుల తరబడి పాఠాలు చెబుతూ కూర్చునే తీరిక ఇక్కడ ఎవరికి ఉంది తల్లీ ... ఈ వరసన ఈ రికార్డింగ్ ఎన్ని సంవత్సరాలకు అయ్యేటట్లు" అని విసుక్కున్నాడు.

పావనికి ఇంత అవమానం ఎప్పుడూ ఎదురుకాలేదు. తల కొట్టేసినట్లు అయింది. ఏడుపు వచ్చేసింది. ఎందుకొచ్చిన ఖర్మ ఇదంతా అనుకుంది.

రికార్డింగ్ మళ్ళీ మొదలైంది. ఈసారి వాయిద్యగాళ్ళ మీదకు పోయింది దోషం. ఎవడో ఒకడు, ఏదో ఒక బిట్ చెడగొడుతున్నాడు...సంగీత దర్శకుడు వాణ్ని మొహం వాచేలా చీవాట్లు పెడుతున్నాడు. వాళ్లు కిమ్మనకుండా తలపక్కకు తిప్పేసుకుంటున్నారు–తమని కాదన్నట్లుగా.

కాల్‌షీట్ అయిపోయిందని ఆ గాయకుడు మరోచోట రికార్డింగ్‌కు వెళ్ళిపొయ్యాడు. వీళ్ళ పాటమాత్రం పూర్తి కాలేదు.

పాడినంత వరకూ పావని వాయిస్ విన్నాడు శేఖర్. తన చెవులను తనే నమ్మలేకపొయ్యాడు. పావని గొంతులో ఏదో జీర! రేడియోలో, టి.వి.లో పాడి

నప్పుడు ఖంగుమని మోగిన పావని గొంతుక ఇదేనా అన్న అనుమానం శేఖర్‌కి వచ్చింది.

"కొత్తవాళ్ళను వద్దండీ అని చెబితే మీరు విన్నారుగాదు. చూడండి... మీ డబ్బూ వేస్ట్ అయింది, నా శ్రమ వృథా అయింది. పూర్ క్వాలిటీ. జనం ఎలా చూస్తారు? మీకా అమ్మాయిమీద అభిమానం ఉంటే వేషం ఇవ్వండి... సలక్షణంగా ఉంటుంది. కానీ సంగీతానికి మాత్రం పనికిరాదండి'' అని చెప్పాడు.

శేఖర్ నిలువునా కృంగిపొయ్యాడు. పావని గదిలో కూర్చుని ఏడుస్తోంది.

"ఈ వెధవ సినిమా ఛాన్స్ వద్దు. ఈ తిట్లూ వద్దు. నిజానికి వాడు చెప్పినట్లే పాడాను. నిముషానికో రకంగా మార్చేసింది వాడు. పైగా నన్ను తప్పుపట్టాడు. అవతల ఆర్టిస్ట్ పొలికేకలు పెట్టినా నచ్చింది గాని, నేను నా సర్వశక్తులూ వినియోగించినా వాణ్ణి మెప్పించలేకపొయ్యాను"

శేఖర్ ఆరోజు జరిగిందంతా మననం చేసుకున్నాడు. ఆమెను ఊరడించాడు. తనకోసం మళ్లీ ఒకసారి అదే పాట పాడమన్నాడు-టేప్‌రికార్డర్ ముందుపెట్టి. ఆ పాట మళ్లీ వింటే బాగానేవుంది. ఒక టేప్ రికార్డర్‌లో వచ్చిన క్వాలిటీ రికార్డింగ్ థియేటర్‌లో రాలేదంటే నమ్మశక్యం కాలేదు. ఆ టేప్‌ను భద్రంగా దాచుకున్నాడు.

మర్నాడే ఆ సంగీత దర్శకుడి ఇంటికి వెళ్ళి ఆయనకి ఇవ్వవల్సిన మొత్తాన్ని ఇచ్చి నమస్కారం పెట్టాడు.

"ఏమి ఇది?'' అన్నాడాయన.

"నా చిత్రానికి నేనే వేరే సంగీత దర్శకుణ్ణి పెట్టుకుంటున్నాను. అనుకున్న ప్రకారం మీ డబ్బు మీకిచ్చాను'' అన్నాడు.

''నేను కట్టిన బాణీలు మరొకరు వాడటానికి వీల్లేదు'' అన్నాడాయన.

''అలాగే నేను మళ్ళీ కట్టించుకుంటాను" అన్నాడు శేఖర్.

ఆ సాయంత్రం దర్శకుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. "ఇదేమిటి? ఇలా చేశారు? ఆయన ఎవరనుకుంటున్నారు? చిత్రసీమలో ఇవాళ ఆయన మకుటం లేని మహారాజు. టాప్ హీరోలు కూడా ఆయనకు ఎదురు చెప్పలేరు. ఆయన్ను కాదంటే, మీ చిత్రం బయటికొస్తుందా?" అని హెచ్చరించాడు.

"మీ దగ్గర గొప్ప టాలెంటు ఉంది. జనంలో ఎంతో పేరుంది. కనుకనే నేను మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను. కానీ జరిగిన తంతు చూశారుగా...'' అంటూ ఆ టేపు వినిపించాడు.

"ఆమెలో లోపం ఉందంటే నేను నమ్మలేకపోతున్నాను. కనుకనే మరో సంగీత దర్శకుణ్ణి పెట్టుకుంటాను...''

''ఈ ఫీల్డు సంగతి మీకు తెలియదండీ. ఆయనతో గొడవ పడ్డట్టు తెలిసిపోయింది. మీ సినిమాకు పనిచేయటానికి ఇంకో మ్యూజిక్ డైరెక్టరు ఎవరూ ముందుకు రారు..." అని ఖచ్చితంగా చెప్పేసి వెళ్ళిపొయ్యాడు డైరెక్టరు.

అయినా శేఖర్ తన పట్టుదల విడవలేదు. వెతకటం మొదలెట్టాడు. ఒక మలయాళ చిత్రానికి సంగీతం ఇస్తున్న నాయర్‌ను పట్టుకున్నాడు. విషయం అంతా చెప్పాడు. ఆయన చేసినట్యూన్‌లు వినిపించాడు.

"ఇవి మనకు పనికిరావు" అన్నాడు నాయర్.

రాత్రింబవళ్లు కష్టపడి కొత్త బాణీలు తయారు చేశాడు నాయర్. మగ

గొంతుకకుకూడా మరో కొత్త కుర్రాడు రాజును నాయరే పరిచయం చేశాడు.

''ఇక్కడ డామినేషన్ ఇలాగే ఉంటుంది. అందుచేత మనం బొంబే వెళ్దాం. నేను అక్కడ కొన్నాళ్ళు పని చేసి వచ్చాను. కనుక పెద్ద ప్రాబ్లమ్ ఏమీ ఉండదు'' అని నాయర్ సలహా ఇచ్చాడు.

శేఖర్‌కు అదే మంచిదనిపించింది.

బొంబాయి వెళ్ళి రికార్డింగ్ పూర్తి చేసుకుని వచ్చాక శేఖర్ ఒక పత్రికా సమావేశం ఏర్పాటుచేశాడు. వాళ్ళకా పాటలు వినిపించి జరిగింది వివరించాడు.

మద్రాసు సినీ రంగంలో ఇదొక సంచలనమే సృష్టించింది. మద్రాసు పరిశ్రమను కాదని, బొంబాయి వెళ్ళి రికార్డు చేయించుకోవాల్సిన అవసరం ఎలా వచ్చిందో శేఖర్ మళ్ళీ వివరించి, కొత్త వాళ్ళను రానివ్వకుండా ఎలా డామినేట్ చేస్తున్నారో ఉదాహరణ చూపటానికే తాను ఇంత శ్రమ తీసుకోవాల్సి వచ్చిందని, మద్రాస్‌లో రికార్డు చేసిన టేపు, బొంబేలో రికార్డు చేసిన పాటలు పత్రికల వారికి వినిపించాడు.

ఫలితంగా పావని గురించి పత్రికలన్నీ పొగిడేశాయి. ఆమె పాటల్ని ఆకాశానికెత్తేశాయి.

ఆమె పాటలు ముందుగానే విడుదల చేశారు. అవి జనం నాలుకల మీద నర్తించ సాగాయి. పావనికి మంచి పేరు వచ్చింది. ఇది గమనించిన కొందరు నిర్మాతలు ఆమె చేత పాడించుకోవాలని ఉబలాట పడ్డారు.

శేఖర్ ఆశించింది ఇదే! ఇందుకే అతను ఇంత శ్రమ పడ్డాడు. తను సినిమా పూర్తిగా తీస్తాననిగాని, అది విడుదలై డబ్బు చేసుకుంటుందనిగాని అతనేనాడూ ఆశలు పెట్టుకోలేదు. టాలెంటును పైకి లాగటానికి ఇదొక మార్గం-పబ్లిసిటీకి దగ్గర దారి....అంతే.

పావని పెద్ద గాయని కావాలి. అదే అతని లక్ష్యం! అది నెరవేరుతున్నందుకే అతను పొంగిపొయ్యాడు.

* * *

ఆరునెలల్లో పావని పాటలు పాడిన సినిమాలు రెండు రిలీజ్ అయినాయి. అదృష్టం బాగుండి ఆ సినిమాలు సక్సెస్ అయి ఆమె పాటలకూ మంచి గుర్తింపు వచ్చింది. ఆమె కంఠంలోని మెలొడీ చాలా మందిని ఆకర్షించింది.

ఈమె పాటలకు మొదట బాణీలు కుదిర్చిన సుప్రసిద్ధ సంగీత దర్శకుడు కూడా దారికి వచ్చాడు. ఇప్పుడు నాయర్ కట్టిన ట్యూన్లే, పావని, రాజు పాడిన పాటలే జనంలో ఎక్కువగా చెలామణీ అవుతున్నాయి. పావనికి ఆశించినదాని కన్నా ఎక్కువ పేరు వచ్చింది.

శేఖర్ ఆనందానికి అవధిలేదు.

అయితే అతను మొదలుపెట్టిన సినిమా మాత్రం సగంలో ఆగిపోయింది డబ్బు లేక. పంపిణీదారులు ఎవరయినా పెట్టుబడి పెడతారేమోనని వాళ్ళచుట్టూ తిరిగాడు. కానీ ఎవరూ ముందుకు రాలేదు. ఇంకెవరన్నా నిర్మాత మిగిలిన చిత్రం పూర్తి చేయగలిగితే ఆయనతో హక్కులు పంచుకోవటానికి సిద్ధపడ్డాడు. ఈ విషయం చెబితే ఓ అసిస్టెంట్ డైరెక్టరు శెట్టిగార్ని తీసుకొచ్చాడు.

శేఖర్ ఆయనకు కథ వినిపించాడు. తీసినంతవరకూ వివరాలు చూపించాడు. కావల్సిన ఖర్చు ఎంతోగూడా లెక్క చెప్పాడు.

"సవరకు ఈరో, ఈరోయిన్‌కి పెళ్ళి

అవ్వదా?" అని అడిగాడు శెట్టిగారు.

"ఈమధ్య మన ప్రేక్షకుల టేస్ట్ మారిపోయింది. ట్రాజెడీస్ లైక్ చేస్తున్నారు. అందుకని మనమూ ట్రాజెడీయే చేస్తున్నాం" అన్నాడు శేఖర్.

"నాలుగురూపాయలుబెట్టి సినిమా జూసేది ఏడవటానికా? అళ్ళ ఏడుపు మనకు కొట్టుద్దేమోనయ్యా?" అని సందేహం వెలిబుచ్చాడు.

"లేదండీ....ఇది చాలామంచి కథ. చక్కని సెంటిమెంట్ వుంది. జనానికి బాగా నచ్చుతుంది"

"ఏమో, ఎవుడు జూశాడు? ముందు డబ్బు పెట్టేవాడ్ని, నాకు నచ్చొద్దూ? ఒకవేళ ఏమన్నా బెడిసికొట్టిందనుకో, మనమేగదా సేతులుకాల్చుకునేది"

"అయితే ముగింపు మార్చేద్దామండి. ఈ లోకంలో చచ్చిపోతారు. పైలోకంలో కల్సుకుంటారు. అక్కడ దేవతలే వీళ్ళ అమరప్రేమకి మెచ్చి పెళ్ళిచేస్తారు. నావల్ లైపు, బావుంటుంది" అని ఉత్సాహ పరచాడు శేఖర్.

"అళ్ళిద్దరి పెళ్ళికోసం జనాన్నందర్నీ పైలోకానికి తీసుకుపోటం ఎందుకూ? ఈడ్నే కలిపేస్తేపోలా?" అని సలహా ఇచ్చాడు శెట్టి.

"పోనీ అలాగ్గే చేద్దాం'' అని రాజీకి వచ్చాడు శేఖర్. "రేపే డైరెక్టర్ని, రైటర్ని పిలిపించి స్టోరీ మార్పించేద్దాం."

అక్కడికీ శెట్టిగారు ఒప్పుకోలేదు. శేఖర్ నిరాశగా అసిస్టెంట్ డైరెక్టర్ వేపు చూశాడు. అతను అసలు కీలకం ఎక్కడో అక్కడ నొక్కేశాడు.

"సార్..మన కాస్టింగ్ లో హీరోయిన్ కొత్తమ్మాయి. చాలా నాటకాలు ఆడి, ఇక్కడికొచ్చింది. ఒకసారి ఆమెను కల్సి మాట్లాడదాం. ఆమెతో కూడా కలిస్తే, ఆయన అభిప్రాయం మార్చుకోవచ్చు. ఎందుకంటే ఇది హీరోయిన్ సబ్జక్ట్. ఆమె నొకసారి చూస్తే మీకు అభిప్రాయం మారిపోతుంది" అన్నాడు అసిస్టెంట్ డైరెక్టర్.

"సరే అయితే, వీర్నొకసారి వాళ్ళ ఇంటికి తీసుకెళ్లు" అన్నాడు శేఖర్.

అతను శెట్టిగార్ని నాలుగయిదు స్టూడియోలకు తిప్పాడు. అక్కడ నటిస్తున్న కొంతమంది నటీనటులు అతన్ని పలకరించారు. ఖాళీగా ఉన్న నాట్యతార లతను శెట్టిగారికి పరిచయం చేశాడు.

ఆయనొక గొప్ప చిత్రం తీయబోతు న్నారనీ, శృంగారప్రధానమైన నాయిక పాత్రను లతకి ఇవ్వాలని అనుకుంటు న్నారనీ చెప్పాడు.

ఆరాత్రి ఆమె ఇంటిదగ్గర అన్నీ వివరంగా మాట్లాడి వచ్చాక శెట్టిగారికి సినిమా తీయాలన్న కోరిక బాగా బలపడింది. అప్పుడు అసిస్టెంట్ డైరెక్టరు ఆయనకు నచ్చజెప్పాడు.

"మీరు సొంతంగా తీయటం మొదలెడితే పాతికలక్షలు తక్కువకాదు. శేఖర్ గారి పిక్చర్ తీసుకోండి. ఖర్చులూ లాభాలు సంగతి స్పష్టంగా మాట్లాడు కుందాం. మీకుకావల్సిన లతకి మంచి వేషం ఒకటి క్రియేట్ చేద్దాం. ఆమె మీకు అందు బాటులో ఉంటుంది. ఈ పిక్చర్ కు మీరు సగం డబ్బే పెడుతున్నారు. మీవంతు డబ్బుకు నష్టం రాకుండా చూసే పూచీ నాది... ఇక రెండో సినిమా దీనిమీది లాభాలతో, అనుభవంతో మొదలు పెడదాం. నాకు డైరెక్టర్ ఛాన్స్ ఇప్పించండి...లతని సరికొత్త అందాల్లో చూపెట్టి జనానికి వెర్రి ఎక్కిస్తాం. వంద

రోజులు మినిమం గ్యారంటీ. ఈ దెబ్బతో మీరు పెద్ద నిర్మాతల జాబితాలో చేరిపో తారు" అని ధూపం వేశాడు.

శెట్టిగారికీ ప్లాను నచ్చింది. శేఖర్ సినిమా పూర్తి చేయటానికి శెట్టిగారు ఒప్పుకుని రాత కోతలు పూర్తి చేసుకు న్నారు.

మూడు నెలల్లో సినిమా విడుదల అయింది. రెండు వారాల్లో డబ్బాలు తిరిగొచ్చాయి. మొత్తంమీద శేఖర్ సినిమా విడుదల అయింది అనిపించాడేగాని, అతనికి మిగిలిందేమీ లేదు. అందుకు అతను విచారించనూ లేదు.

"ఎందుకొచ్చిందీ అవస్త. ఆనాడే ఆ డబ్బు పెట్టి ఆస్తిపాస్తులు అమర్చు కుంటే ఎంతో నిశ్చింతగా కాలంగడిచి పొయ్యేది గదా" అంది పావని.

"కాలం ఎలాగైనా గడుస్తుంది? అది ఎవరికోసమూ ఆగిపోదు. ఆనాడు నేను డబ్బుకోసమే చూసుకుంటే, ఇవాళ నువ్వింత గొప్ప గాయనివి అయ్యే దానివా?" అని అడిగాడు శేఖర్.

"నేను గాయనిని కాకపోతే మాత్రం లోకానికి ఏమిటి లోటు?" అని ప్రశ్నిం చింది.

"లోకం సంగతి నాకు తెలియదు గాని, నామటుకు నేను బాధపడాల్సివచ్చేది- ఇంత టాలెంట్‌వున్న వ్యక్తి ఇంత అజ్ఞాతంగా ఉండిపోయిందే అని"

"నాకన్నా ఎక్కువ టాలెంట్ ఉన్న వాళ్ళు ఉన్నారు"

"ఇది వాళ్ళకీ వర్తిస్తుంది. నేను కాద నటం లేదు. అవకాశాలు లేక రాణించని వారు ఎందరో ఉన్నారు. నాకయినా, నీకయినా ఆ డబ్బు వచ్చింది కాబట్టే, ఈ మాత్రం అయినా నిలబడగలిగాం. ఒక్కొక్కసారి డబ్బును పోగొట్టుకోవటం అంత లాభసాటి పని మరొకటి ఉండదు"

పావని నిట్టూర్చింది. కాసేపు మౌనం తర్వాత అడిగింది-

"ఇప్పుడింక ఏంచేద్దాం అనుకుంటు న్నావు?"

అతను కాసేపు ఆకాశంలోని నక్షత్రాలు లెక్కపెడుతూ కూర్చున్నాడు.

"మా ఊరికి వెళ్లి వ్యవసాయం చేసు కుందామనుకుంటున్నాను"

"అదేమిటి? ఎక్కడి గవర్నమెంటు ఉద్యోగం! ఎక్కడి సినిమా నిర్మాత! ఎక్కడి వ్యవసాయం!" అని ఆశ్చర్య పోయింది.

"జీవితంలో కెరటాలు వచ్చిపో తుంటాయి. ఒక కెరటం ఉవ్వెత్తున పైకి లేపుతుంది. మరో కెరటం ముంచెత్తు తుంది"

"ఇంతాచేసి ఏం మిగిలింది నీకు?"

"జీవితం వ్యాపారంకాదు. నావాళ్లు అనుకున్నవాళ్ళకోసం పాటుపడటంలో ఉన్న తృప్తి, ఆనందం నిర్వచనానికి అందేవి కావు"

"మరి నీవాళ్లు అనుకున్నవాళ్ళను వదిలేసి ఎలా వెళ్లాలనుకుంటున్నావు?" అని సూటిగా అడిగింది.

"ఒకనాడు నిన్ను అడిగాను నేను పెళ్లిచేసుకోమని. మన మధ్యనున్న అంతరమే అభ్యంతరం అన్నావు. ఆ అభ్యంతరం ఇప్పుడు మరింత పెద్దది అయింది"

"ఎలా?"

"ఇవాళ పావని ఒక ప్రసిద్ధ గాయని. ఆమె పాటకోసం పడిచచ్చేవాళ్లు లక్షల్లో ఉన్నారు... నాకేం ప్రత్యేకత ఉంది"

"అన్నికోట్ల మంది పడిచచ్చే పావని




మాత్రం నువ్వంటే పడి చస్తుంది. ఎప్పుడైనా అడిగి చూడు - పావనీ, నీ ప్రాణాలు కావాలీ అని. అవి నీవేగదా తీసుకోమంటుంది..."

"ఆవేళ తిరుపతి కొండమీద నువ్వు అన్న మాటలు నాకింకా గుర్తున్నాయి"

"నువ్వు అప్పుడు చెప్పిన సమాధానమూ నా గుండెల్లో మారు మోగుతూనే ఉంది. నా గురించి నీకు పూర్తిగా తెలియదు. నా చరిత్ర ఇదీ అని నీకు చెప్పనూలేను, చెప్పకుండా ఉండనూ లేను''

''నీవు చెప్పకపోయినా దాని సారాంశం నాకు తెల్సు''

''ఏమిటది?''

"లాటరీలో అయిదు లక్షలు వచ్చాయని తెల్సినరోజున నా ఆనందానికి అవధులులేవు. సంతోషాన్ని పట్టలేక పోయ్యాను. ఒక్కసారి నీ దగ్గరకు పరుగెత్తుకుని వచ్చి ఈవిషయం చెప్పాలని ఆరాటపడ్డాను. నీవు పనిచేసిన ఆఫీసులో నీ భువనేశ్వర్ అడ్రసు తీసుకొని రైలు ఎక్కాను. అడ్రసు వెతుక్కుంటూ మీ ఇంటికి వస్తున్నాను. దార్లోనే ఎదురైనారు నువ్వూ, మీ చెల్లెలూను మెటర్నిటీ ఆస్పత్రి గేట్లో. నిండు గర్భవతిగా నిన్ను చూడగానే నాకు నోటమాట రాలేదు. అప్పుడు నాకు అర్థమైంది నన్ను భువనేశ్వర్ ఎందుకు రావద్దని అన్నావో''

"ఏ రహస్యాన్ని నీ నుంచి దాచాలనుకున్నానో, ఆ రహస్యం నీకు తెల్సిపోయిందన్నమాట. మరి తెల్సీ నువ్వు ఎందుకు నన్ను చేసుకోవాలనుకున్నావు?"

"అంతకుముందే మన పాణిగ్రహణం అయిపోయింది. దానికి మన అంతరాత్మలే సాక్షి. నేను నా మాటకే కట్టుబడి ఉండాలని అనుకున్నాను- నువ్వు కాదు పొమ్మంటే తప్ప'' అన్నాడు సమ్మదిగా.

ఆమె నిట్టూర్చి కాసేపాగి అన్నది-

"నా బతుకు గాఢాంధకార బంధురం అయిన సమయంలో నాకు చిరుదీపంలా కనిపించావు. ఆ చిమ్మచీకటిలోనున్న నన్ను చెయ్యిపట్టుకు తీసుకొచ్చావు ఈ వెలుగువెల్లువలోకి, ఈ కీర్తి శిఖరంమీదకు. ఇప్పుడు ఇక్కడ నన్నొక్కదాన్నీ వదిలేసి వెళ్ళిపోతానంటే నేను ఏం కావాలనుకున్నావు?'' అని అడిగింది పావని.

జరిగిన కథ అంతా క్లుప్తంగా చెప్పింది. ఇన్నాళ్ళనుంచీ గుండె గదిలోపల ఎక్కడో దాచుకున్న మాతృ హృదయం ఒక్కసారి పెల్లుబికింది. కన్నీరు కాలువలు కట్టింది.

"రేపెళ్ళి మనం ఆ బాబును తెచ్చుకుందాం. వాడు మనకు బరువుకాడు'' అన్నాడు శేఖర్.

పావని అతని హృదయం మీదకు వాలిపోయింది. ఎంతకాలంగానో వెతుకుతున్న శాంతి ఆమెకు అక్కడ దొరికింది.

* * *

తీరిక చూసుకుని భువనేశ్వర్ వెళ్దామని అనుకుంటుండగానే ఒకరోజు అకస్మాత్తుగా కవిత, ప్రసాద్‌లే బాబును తీసుకువచ్చారు.

వాళ్ళను చూడగానే పావని సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయింది. ఆప్యాయంగా కవితను దగ్గరకు లాక్కుంది. బాబును ముద్దులతో ఊపిరాడనివ్వలేదు.

శేఖర్, ప్రసాద్‌ను లోపలికి రమ్మనమని ఆహ్వానిస్తే జంకుతూనే లోపలికి వచ్చాడు ప్రసాద్.

ఈనాటి పావని స్థితి, అంతస్తు,

హోదా ఆ ఇంట్లో అణువణువునా కనిపిస్తూనే ఉన్నాయి.

"ఇన్నాళ్టికి దయకలిగిందా ఈ దీను రాలిమీద?" అని నవ్వింది పావని.

"ఇన్నాళ్ళూ నీవు గడిస్తున్న కీర్తి ప్రతిష్టలు నేనూ నీకన్నా ఆసక్తిగా గమనిస్తున్నాను, సంతోషిస్తున్నాను. కానీ నీ దగ్గరకు రావాలంటేనే కుదరలేదు. వీడొకడు నా మెడకు చుట్టుకుపోయి నాడు. వీణ్ని ఇక్కడకు తీసుకురానూ లేను; రాకుండా ఉండనూలేను" అంది కవిత.

పావని వెంటనే సమాధానం చెప్ప లేకపోయింది. వాడు వచ్చినప్పణ్నించీ కవిత చంకదిగటంలేదు.

ఎంత పిల్చినా పావని దగ్గరకు రావటం లేదు.

"వీడికి మరీ అతిగా గారాబం చేసి నట్లున్నావు" అంది పాలుకలిపి ఇస్తూ.

"నా గారాబంకన్నా, అమ్మమ్మ, తాతయ్యల గారాబమే బాగా ఎక్కువ. అసలు వీడు వాళ్ళదగ్గరేగా పెరుగు తున్నాడు"

పావని సాత్విక్‌కు పాలు తాగిస్తూ ఆప్యాయంగా వాడి నొక్కుల జుట్టును నిమిరింది.

"అమ్మా... ఈమె నాకు ఏమవుతుంది?' అని అడిగాడు ముద్దులొలికే మాటలతో.

పావని కళ్ళల్లోనుంచి కన్నీరు జలజలా రాలింది. చటుక్కున వెనక్కితిరిగి మొహం చాటుచేసుకుంది.

"నీకు అమ్మ అవుతుంది నాన్నా" అంది కవిత.

"అమ్మ ఇంట్లో బుజ్జిపాపాయిలు లేరా?" అని అడిగాడు వాడు ఆడుకునే నేస్తం కోసం.

"లేరునాన్నా! ఇక్కడకూడా నువ్వే బుజ్జి పాపాయివి. ఇది కూడా నీ ఇల్లే"



"అమ్మమ్మ వాళ్లు?''

"అదికూడా నీదే"

''మన వూళ్ళో వున్నది?"

"అదీ నీదే"

పావని ఆశ్చర్యపోతూ చూసింది కవితవేపు. నెమ్మదిగా అడిగింది.

"ఇదేమిటే...వేలెడులేడు. ఇప్పట్నించీ ఇలాంటివన్నీ అలవాటు చేస్తున్నావు? ఇళ్ళూ ఆస్తులూ గురించి వాడికెందుకు చెప్పు?''

కవిత వెంటనే అంది "ఎక్కడికి పోతాయి తండ్రి బుద్ధులు ? రక్తంలో జీర్ణించుకుపోయిన లక్షణాలు అవి"

పావని ఆశ్చర్యంగా చూసింది.

''వీడి తండ్రి ఎవరూ అని మేం ఎంత అడిగినా నువ్వు చెప్పలేదు. అందుకు కారణమూ ఊహించలేకపోయ్యాం. అంత అన్యాయం చేసిన దుర్మార్గుణ్ని సమర్థిస్తున్నందుకు నీమీద నాకు కోపం వచ్చింది. కానీ నీ చిక్కు సమస్యను అర్థంచేసుకోలేక పోయ్యాను. ఎందుకంటే మాకు అసలా అనుమానం రాలేదు. ఆయన నన్ను చూడటానికి మనింటికి రావడమే మొదటి సారి అనుకున్నాంగాని, అంతకుముందొక సారి వచ్చాడని, వారంరోజులు ఉన్నాడని, మీ ఇద్దరి మధ్యా స్నేహం పెరిగిందని, నిన్ను పెళ్ళి చేసుకుంటానని ఆశలు కల్పించాడని-ఇంత కథ నడిచిందన్న అనుమానమే రాలేదు. నువ్వుగానీ, ఆయన గాని మాటమాత్రంగానైనా చెప్పలేదు మరి మీ పూర్వ పరిచయం గురించి. నా పెళ్ళి అయిన తర్వాత నీలో చిరాకు పరాకు ఎక్కువైనాయి. దాన్ని మేము మరో రకంగా అర్థంచేసుకున్నాం. నీకు పెళ్ళి కాలేదు, మిగిలినవాళ్లందరికీ అయి పోతున్నాయన్న బాధ అలా వ్యక్తం అవుతోందని అభిప్రాయపడ్డాం. నువ్వు పుటికి వచ్చినప్పుడు మా ఆయనా, నువ్వూ మర్యాదకోసమైనా పలకరించు కోకపోవటం, శత్రువుల్లా ప్రవర్తించటం నాకు వింతగా అనిపించినా, నీవున్న పరిస్థితుల్లో మగవాళ్ళందరి మీదా ఉండే ద్వేషం కాబోలు ఇది అని సమాధాన పడ్డాను.

"సాత్విక్ పెద్దవాడవుతున్నకొద్దీ, వాడిలో కనిపిస్తున్న పోలికలు స్పష్టంగా ఆయన పోలికలే. పైగా ఇంకో విచిత్రం ఏమిటంటే ఆయన బాబును విపరీతంగా ద్వేషిస్తాడు. ఒంటరిగా ఉంటే వాళ్ళిద్దరూ వయసులోని తేడాను మర్చిపోయి చిన్న పిల్లల్లా గిల్లికజ్జాలకు దిగుతారు. పసివాడిమీద సాధారణంగా ప్రేమ ఉండాలి. తల్లికీ, తండ్రికీ దూరమైన వాడిమీద మరి కొంత జాలి, సానుభూతి ఉండాలి. వాటికి బదులుగా వాణ్ని అస్తమానం సాధించే గుణం ఎందుకు వచ్చింది....?మా ఇంట్లో ఉంచకుండా అనాధ శరణాలయంలో చేర్పించాలన్న పట్టుదల ఏమిటి? జుట్టు దగ్గరనుంచీ, కనుముక్కు తీరు వరకూ రోజు రోజుకి స్పష్టంగా రూపుదిద్దు కుంటున్న పోలికలు అసలు రహస్యానికి అవసరమైన క్లూ అందిస్తే, మొదట్నించీ జరిగిన సన్నివేశాలను సమన్వయపర్చు కుంటే ఆయనమీదకు అనుమానం మళ్ళింది. నిలదీసి అడిగాను, నిజం చెప్పమని. చేసిన దగుల్బాజీపని ఒప్పుకున్నాడు...'' అంది కవిత.

"నీ ఆవేశం నాకు తెల్సు. నామీద నీకున్న అపారమైన ప్రేమ గురించీ తెల్సు. ఇలా చేసింది మీ ఆయనే అని తెలిస్తే నువ్వు ఆయన్ని క్షమించవు. ఆయన్ని శిక్షించటం నాకూ ఇష్టమే




అయినా, ఆయనతోపాటు ఆ శిక్ష నీకూ పడుతుందన్న ఆలోచన రాగానే నాలో నేనే దుఃఖాన్ని దిగమింగుకున్నాను. చెడిన దాన్ని ఎలాగూ చెడ్డాను. నీ జీవితాన్ని కూడా ఎలా చెడగొట్టను?'' అంది పావని.

"అలాంటి నీచుడి స్వభావం ఇవాళ కాకపోతే రేపైనా బయటపడక మానదు. ఈ రెండేళ్ళలోనే నేను ఎంత ఉదాత్తంగా ఊహించుకున్నానో అంత సంకుచితత్వాన్ని కనబరచాడు. డబ్బుకోసం గడ్డి కరుస్తాడు. అవకాశం ఉంటే మరో పదిమంది ఆడవాళ్ళ దగ్గరకు వెళ్తాడు. ఇలాంటివాడు నా భర్త అని తల్చుకుంటేనే నాకు కంపరం పుడుతోంది... అసలు ఇంతకీ ఆయన నీతో మాట్లాడాలనే వచ్చారు....రా...'' అంటూ పావనిని ఇవతలికి తీసుకొచ్చింది కవిత.

పావనిని చూడగానే కూర్చున్నవాడల్లా లేచి నిలబడ్డాడు ప్రసాద్. కవిత ఆయన వైపు చూసి అంది-

''ఏదో చెప్పాలన్నారుగదా, చెప్పండి''

ప్రసాద్ పావని వంక చూసి "నన్ను క్షమించండి'' అన్నాడు.

"ఆ మాట మీరు ఇదివరకే అన్నారు. అయినా ఆ ఒక్కమాటతో మీరు మళ్ళీ మంచివాళ్ళు అయిపోతారు. కానీ నేను మాత్రం లోకం దృష్టిలో ఎప్పటికీ చెడిపోయినదాన్నే ... ఒకనాడు నేను స్నేహంతో చేతిని అందించాను. కానీ ఆ ప్రేమను, గౌరవాన్ని నిలబెట్టుకోలేకపోయినావు...'' అంది పావని.

ప్రసాద్ వంగి ఆమె కాళ్ళు పట్టుకోబోయాడు. పావని వెనక్కి జరిగింది.

"అమెరికాలో అమ్మాయిలు ఇలాంటి వాళ్ళను ఏం చేస్తారో నాకు తెలియదు. ఆంధ్రాలో అమ్మాయిలు ఇలా చెయ్యాలని నా కోరిక'' అంటూ భర్తవైపు తిరిగి చెప్పింది కవిత "ఇంక మీరు శలవు తీసుకోవచ్చు''

ప్రసాద్ వింతగా చూశాడు.

"తప్పుచేసినందుకుకాదు.దాన్ని మీరు కప్పిపుచ్చి నన్ను తెలివిగా మోసం చేసామనుకున్నారే ఆ వక్రబుద్ధే నన్ను మరింత గాయపరచింది. పెళ్ళి అయిన తర్వాతగాని, దీనికి పిల్లాడు పుట్టిన తర్వాతగాని మీలో అరక్షణం సేపైనా కనికరం కలగలేదే? అయ్యో...నా వల్ల ఆ ఆడపిల్ల ఇంత నరకయాతన అనుభవిస్తోందన్న ఫీలింగ్ కూడా రాలేదే? ఇంతటి నయవంచకుడితో, కసాయివాడితో నేనింకా కల్సి జీవించలేను. ఈ క్షణంనుంచీ మీ దోవ మీది, నా దోవ నాది'' అంది కవిత.

ఆమె మాటంటే దానికి తిరుగు ఉండదని తెల్సిన ప్రసాద్ మొహం మాడ్చుకుని వెనక్కి తిరిగి నెమ్మదిగా మెట్లుదిగి వెళ్ళిపొయ్యాడు.

''ఏమిటే నువ్వు చేసినపని?'' అని అడిగింది పావని.

''ఏ ఆస్తికోసం వాడు నిన్నూ నన్నూ మోసం చేశాడో ఆ ఆస్తి అయినా వాడికిదక్కకుండా చేస్తాను''

"కానీ నీ జీవితం ఏమవుతుంది?'' అంది పావని.

''ఒక నికృష్టుడి బాహుబంధాల్లో నుంచి బయటపడుతుంది ... అతనింక మారడు. కనీసం ఏడిమీద అయినా అతని ప్రభావం పడకుండా చూస్తాను'' అంది కవిత సాత్విక్ తల నిమురుతూ. పావని కవితను అక్కున చేర్చుకుంటే ధైర్యాన్ని ఇస్తూ ఆమె భుజంతట్టిందికవిత.



# చతుర ఫీచర్

**1983** ఫిబ్రవరి 11వ తేదీ!

ఉదయం ఆరుగంటల సమయంలో తన యజమానురాలు అలోసేన్‌కోసం టీ పట్టుకెళ్ళిన పనిమనిషి ఛాయ, ఆమె గది తలుపు తోసిన వెంటనే కనబడిన దృశ్యానికి భయంతో కెవ్వున కేకపెట్టింది. చేతిలోని ట్రే జారి కిందపడి టీకప్పు బద్దలైంది. ఆ గదిలోంచి రొప్పుతూ వేగంగా బయటికొచ్చింది.

ఛాయ కేకలకి అలోసేన్ తమ్ముడు విశ్వజిత్ గుహ, మరది మనోజిత్‌సేన్ తమ గదుల్లోంచి అక్కడికొచ్చారు.

"ఎందుకలా రొప్పుతున్నావ్? ఏమైంది??" అనడిగాడు విశ్వజిత్.

"రక్తం...రక్తం..." భయంతో షాక్‌తిన్న పనిమనిషి అంతకుమించి ఏం చెప్పలేకపోయింది.

"ఏమిటీ...?!"

విశ్వజిత్, మనోజిత్‌లు ఒక్క ఉదుటున అలోసేన్ గదిలోకి వురికారు. అక్కడి దృశ్యం హృదయాల్ని బద్దలు చేసేదిగా వుంది. అలోసేన్ దేహం, ఆమె పడుకున్న మంచం అంతా రక్తంతోతడిసి



వుంది. ఆమె వంటిపై రవిక, లోపావడాలు మాత్రమే వున్నాయి. చీర గదిలో ఓ మూలన పడివుంది. ఆమె కడుపుపై లోతైన గాయం వుంది.

తన సోదరి అంత దారుణంగా మృతి చెందడం చూసిన విశ్వజిత్‌కి దుఃఖం పెల్లుబికింది. మనోజిత్ ఏదో తట్టినట్టుగా బయటకు వెళ్ళి కొద్దిసేపటికి తిరిగొచ్చి విశ్వజిత్‌తో చెప్పాడు.

"ప్రశాంత్‌బాబు తన గదిలో లేడు. ఎక్కడా కనపడటంలేదు. మనం వెంటనే దీన్ని పోలీసులకి తెలియపరిస్తే మంచిది."

విశ్వజిత్ కూడా ప్రశాంత్ గదికి వెళ్ళి చూశాడు. ఆ గదిలోని బట్టల అలమరా తెరిచి వుంది! దానిలో బట్టలులేవు. గదిని

పరిశీలిస్తే ప్రశాంత్ కంగారుగా ఆ గదిని ఖాళీచేసి వెళ్ళినట్టు స్పష్టమవుతోంది.

విశ్వజిత్ కాశీపూర్ పోలీస్‌స్టేషన్‌కి ఫోన్‌చేసి హత్య గురించి తెలిపాడు. ఆ సమయంలో డ్యూటీలోవున్న ఇన్‌స్పెక్టర్ సుజిత్ బోస్ అతను చెప్పిన సమాచారాన్ని రికార్డుచేసి, తన బలగంతో హత్య జరిగిన ప్రదేశానికి చేరుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ బోస్ హత్యజరిగిన గదిలో మృతదేహాన్ని పరీక్షచేశాక విశ్వజిత్ వేపు తిరిగాడు.

"మీరూ, నౌకర్లూ కాక ఈ ఇంట్లో ఇంకెవరయినా వుంటున్నారా?"

''ప్రశాంత్ కూడా మాతోనే వుంటున్నాడు. అతను మా అక్క నడిపే సంస్థకి మేనేజర్. అతను రాత్రికి రాత్రే మాయమైపోయాడు"

''మీ బావ? అంటే... మృతురాలి భర్త?''

"మా బావ అరుణ్‌సేన్ మూడేళ్ళ క్రితం కేన్సర్‌తో చనిపోయాడు''

అలోసేన్ మంచంమీద ఓ కత్తి, మంచంకింద ఆమె చెప్పులతోపాటు పురుషులు ధరించే మరో చెప్పుల జతను చూశాడు ఇన్‌స్పెక్టర్ బోస్. ఆ చెప్పులు ప్రశాంత్‌వని చెప్పాడు మనోజిత్.

ఇన్‌స్పెక్టర్ బోస్ ప్రశాంత్ గదిని పరిశీలించాడు. అందులో అనుమానాస్పదమయినవేవీ అతనికంటపడలేదు. చివరగా అతను స్నానాల గదిలోకి వెళ్ళి చూశాడు. అక్కడ రక్తపు మరకలుపడ్డ దుప్పటి ఒకటి దొరికింది. విశ్వజిత్, మనోజిత్, ఛాయ దాని గురించి తమకేమీ తెలీదన్నారు. అదిఎవరిదో చెప్పలేకపోయారు.

శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపాడు ఇన్‌స్పెక్టర్ బోస్. దుప్పటి, కత్తి, చెప్పులు సీలుచేసి కలకత్తాలోని ఫోరెన్సిక్ విభాగానికి పంపాడు.

శవాన్ని మొదట చూసిన ఛాయ నుంచి మొదటి స్టేట్‌మెంట్ తీసుకున్నారు. తను ఆ ఇంట్లో గత అయిదేళ్లనుంచీ పని చేస్తున్నట్టు చెప్పిందామె.

హత్య జరిగిన రోజు రాత్రి 9గంటలకి ఛాయ వడ్డించగా, హతురాలూ, విశ్వజిత్, మనోజిత్, ప్రశాంత్‌లు భోంచేసి తర్వాత ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు. తర్వాత పనంతా పూర్తిచేసుకుని ఛాయ తను పడుకునే స్టోర్‌రూమ్‌కి వెళ్ళిపోయింది ఆమెకారాత్రి అనుమానింపదగిన శబ్దాలేమీ వినరాలేదు. అలవాటు ప్రకారం మర్నాడు ఉదయం అయిదున్నరకే నిద్ర లేచి టీ తయారుచేసి అలోసేన్ గదికి పట్టుకెళ్ళినప్పుడు ఆమె రక్తపు మడుగులో పడి వుండటం చూసింది.

విశ్వజిత్ స్టేట్‌మెంటులో ఇలా పేర్కొన్నాడు. "నేను ఏడేళ్ళనుంచీ మా అక్క వాళ్ళింట్లో వుంటున్నాను. నా చిన్నప్పుడే మా అమ్మ చనిపోయింది. మా అక్కకి ఏడేళ్లక్రితం పెళ్ళయింది. ఆ పెళ్ళి జరిగిన మూడు నెలల తర్వాత మా నాన్న చనిపోయాడు. అప్పట్నుంచీ నేను మా అక్క దగ్గిరే వుండి చదువుకుంటున్నాను. మూడేళ్ళక్రితం మా బావ చనిపోయాడు. క్రితం సంవత్సరం నేనూ, మనోజిత్ ఎమ్మెస్సీ పాసయ్యాము.

"మా బావకు హౌరాలో ఎలక్ట్రిక్ వస్తువుల దుకాణముంది. అతను మరణించాక మా అక్క దానికి మేనేజర్‌గా అవివాహితుడైన ప్రశాంత్‌ధర్‌ని నియమించింది. వ్యక్తిగతంగా నాకు అతనంటే గిట్టదు. రాత్రి అతను ఎక్కడికి మాయమైపోయాడో నాకు తెలియదు''

"గత నాలుగు నెలలుగా ఓ ముసుగు వేసుకున్న ఆకారం నిశ్శబ్దంగా వరండాలో తిరగడం గమనిస్తున్నాను. అలికిడికి నేను తలుపు తెరిచి వరండాలోకి చూసేసరికి ఆ ఆకారం మాయమైపోతుండేది. మా అక్క వరండాలో లైటు వేయడానికి ఒప్పుకోక పోవడంతో ఆ ఆకారాన్ని ఇప్పటికీ గుర్తు పట్టలేకపోయాను..,పట్టుకో లేకపోయాను. అదీకాక ఆ ఆకారం రాక పోకలు ఖచ్చితంగా రోజూ ఒకే సమయంలో జరిగేవికావు. నేను దీని గురించి మా అక్కకు చెప్పినా ఆమె తేలికగా కొట్టిపారేసేది" అంటూ మరికొన్ని వివరాలిచ్చాడు విశ్వజిత్.

తర్వాత మనోజిత్ స్టేట్ మెంటులో, "మా వదిన ప్రశాంత్‌ధర్‌ని ఎంతగానో నమ్మేది. ఎకౌంట్ పుస్తకాలన్నీ అతనే చూస్తుండేవాడు. అతను రాత్రినుంచి కనబడకపోవడాన్నిబట్టి ఈ హత్యకు అతనే కారణమని నేను అనుమానిస్తున్నాను.

"గత కొన్ని నెలలుగా నాకు కూడా, వరండాలోంచి ఎవరో తిరుగుతున్నట్టు అనుమానంగావుంది. కాని, ఆ వ్యక్తిని పట్టుకోకుండా మా వదిన అడ్డుపడింది'' అని చెప్పాడు.

అలోసేన్ గదిని సీలుచేసి, స్టేట్ మెంట్లన్నీ రికార్డు చేసుకుని ఇన్‌స్పెక్టర్ తిరిగి పోలీస్‌స్టేషన్‌కి చేరుకున్నాడు. స్థూలంగా చూస్తే ఆ హత్య ప్రశాంత్‌ధర్ చేసినట్లే కనబడుతోంది. కాని, ఇన్‌స్పెక్టర్ మెదడులో అనేక సందేహాలు ఉత్పన్నమయాయి. ప్రశాంత్ కోసం ఎంతగా గాలించినా అతని ఆచూకీ దొరకలేదు.




1983 ఫిబ్రవరి 23న అలోసేన్ హత్యపై పోస్ట్‌మార్టమ్ రిపోర్టు కాశీపూర్ పోలీస్‌స్టేషన్‌కి చేరింది. అది చదివి ఇన్‌స్పెక్టర్ బోస్ దిమ్మెరపోయాడు. 'కడుపులో లోతైన గాయం అయినందు వల్ల అలోసేన్ మరణం సంభవించినట్లూ, హత్యకుముందు ఆమెరతిలో పాల్గొన్నట్లూ గర్భ నిరోధానికి ఆమె 'లూప్' పద్ధతిని అనుసరిస్తున్నట్టూ తేలింది. ఆమె బ్లడ్ గ్రూపు 'బి' అని ఆ రిపోర్టులో వుంది.

అదేరోజు ఇన్‌స్పెక్టర్ కి చేరిన కెమికల్ ఎనాలిసిస్ రిపోర్టులో కత్తికి అంటిన రక్తం,అలోసేన్ పడకపైనిరక్తం వేర్వేరు బ్లడ్ గ్రూపులకు చెందినవని వుంది. కత్తిపై వేలిముద్రలు స్పష్టంగా లేవు.

ఈ వాస్తవాలు వెల్లడయ్యాక కేసు ఇంకా క్లిష్టంగా రూపొందింది. ఇన్‌స్పెక్టర్ మరో కోణంనుంచి తన పరిశోధన ఆరంభించాడు. అలోసేన్‌తో పాటు ఆమెతో గడిపిన మరో వ్యక్తి కూడా హత్యకు గురైనట్టు అతననుమానించాడు. అతని మృతదేహాన్ని మరుగుపరిచి వుంటారు. ఆ మృతుడు ప్రశాంత్ కాదు కదా అనే అనుమానం కలిగింది ఇన్‌స్పెక్టర్‌కి.

ఇన్‌స్పెక్టర్ బోస్ ముందుగా అలోసేన్ బేంకు అకౌంట్లు పరిశీలించాడు. 1983 జనవరి 10న ఆమె బేంకులోంచి 2లక్షల 40వేల రూపాయలు డ్రాచేసింది. ఇన్‌స్పెక్టర్ దాని గురించి విచారించగా, అలోసేన్ హౌరాలో ఓ స్థలాన్ని 2లక్షల 30 వేల రూపాయలకి కొనబోయినట్టు తెలిసింది. ఆ వ్యవహారానికి సూత్రధారి ప్రశాంత్‌ధర్. కొనుగోలుకి సంబంధించిన రాతకోతలు ఇంకా పూర్తిగాకపోవడంతో హౌరా నుంచి ప్రశాంత్ ఫిబ్రవరి 10న డబ్బుతోపాటు తిరిగొచ్చేశాడు.

ఇన్‌స్పెక్టర్ బోస్ పరిశోధన అలా సాగుతుండగానే మరో సంఘటన జరిగింది ఫిబ్రవరి 28న అతను నైట్‌డ్యూటీలో వున్నపుడు, రాత్రి 2 గంటల సమయంలో "ఆ ముసుగు ఆకారం మళ్ళీ వచ్చి, ఛాయ వుంటున్న స్టోర్‌రూమ్ లోకి వెళ్ళిం"దని విశ్వజిత్ నుంచి ఫోన్ వచ్చింది.

"నాకు చాలా భయంగా వుంది. వెంటనే రండి" అని ఆందోళనగా చెప్పాడు విశ్వజిత్.

''మనోజిత్ ఏడి? అతన్ని నిద్ర లేపలేదా?" అనడిగాడు ఇన్‌స్పెక్టర్ మామూలుగా.

"లేదు...నేను మీకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. నేను మనోజిత్‌ని లేపేందుకు వెళ్తే ఆ ఆకారం మాయమై పోతుందని వెనుకాడాను" అన్నాడు విశ్వజిత్.

అలోసేన్ హత్యకు, ఈ సంఘటనకు సంబంధం వుంటుందనే ఆలోచన కలిగింది ఇన్‌స్పెక్టర్ బోస్‌కి. వెంటనే బైలుదేరి, పావుగంటకల్లా ఆ ఇంటికి చేరుకున్నాడు.

ఇంట్లో లైట్లు వెలగడంలేదు. అంతా చీకటి, నిశ్శబ్దం! ఇన్‌స్పెక్టర్ బోస్ జీపు దిగి మెయిన్‌డోర్‌ని సమీపించేటప్పటికి విశ్వజిత్ వచ్చి తలుపు తీశాడు.

''రండి ఇన్‌స్పెక్టర్ ఆ ఆకారం ఇంకా గదిలోనే వుంది. నేనో కంట గమనిస్తూనే వున్నాను" అన్నాడు.

"మెయిన్‌డోర్ తాళం మీ ఒకరి వద్దనేనా, ఇంకా ఎవరి దగ్గిరైనా వుంటుందా?" అనడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంతక్రితం మా అక్క, ప్రశాంత్‌ల దగ్గిరుండేది. ఇపుడు నా దగ్గిర, మనోజిత్ దగ్గిర మాత్రమే వుంది" ఆ మాటల్లోనే వాళ్ళు స్టోర్‌రూమ్ దగ్గరికి చేరుకున్నారు. గది తలుపులు చేరవేసి వున్నాయి. తలుపులు తోసి, టార్చిలైటు వేసి చూసిన ఇన్‌స్పెక్టర్ ''మై గాడ్!" అన్నాడు.





మంచంపై రక్తసిక్తమైన పనిమనిషి ఛాయ దేహం!

గది వెనుకవైపు తలుపు తెరచివుంది. హంతకుడా తలుపు గుండా పారిపోయి నట్టున్నాడు.

విశ్వజిత్ ముఖం పాలిపోయింది. "ప్చ్. వెనుక తలుపుకి గొళ్లెం పెట్టా ల్సింది" అన్నాడు.

ఇంతలో మనోజిత్ నిద్రలేచినట్టు కళ్లు నులుముకుంటూ అక్కడికి వచ్చాడు. ఇన్‌స్పెక్టర్ బోస్‌ని నిర్వేరపోయి చూశాడు. ఛాయ మృతదేహాన్ని చూడ గానే అతని మొహం వివర్ణమయింది.

అలోసేన్‌కు మల్లేనే ఛాయను కూడా హత్య చేశారు. ఆమె కడుపుపై లోతైన గాయంవుంది రక్తంతో తడిసిన కత్తి మంచంపై పడివుంది. బోస్ ఆ కత్తిని ఫోరెన్సిక్ పరిశోధనకి పంపాడు.

విశ్వజిత్ తన స్టేట్‌మెంటులో, దాదాపు 2గంటల సమయంలో పనిమనిషి ఛాయ గదివైపు ఓ ఆకారం వెళ్తున్నట్టు చూసి, నిశ్శబ్దంగా డ్రాయింగ్ రూమ్‌లో కొచ్చి పోలీసులకి ఫోన్‌చేసినట్టు చెప్పాడు. మనోజిత్‌సేన్ ఈ హత్య గురించి నోరు మెదపలేదు.

తర్వాత పోలీసులు ఇల్లంతా వెదికినా పనికొచ్చే 'క్లూ' ఏదీ దొరకలేదు. ఛాయ మృతదేహాన్ని పోస్టుమార్టమ్‌కి పంపారు.

కాని, మరుసటిరోజే రాత్రి పదిన్నర గంటలకి ఇన్‌స్పెక్టర్ బోస్ అలోసేన్, ఛాయలను హత్య చేసిన నేరం కింద మనోజిత్ సేన్‌ని అరెస్టు చేసి, కాశీపూర్ పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్లాడు. హత్యాభి యోగంపై మనోజిత్ అరెస్టవడం చూసి విశ్వజిత్ అవాక్కయ్యాడు.

తాను హత్య చేయలేదని, నిరపరాధి నని బుకాయిస్తున్న మనోజిత్‌తో ఇన్‌స్పెక్టర్ బోస్ ఇలా అన్నాడు.

"చూడు మనోజిత్! నేను రాత్రే నిన్ను అరెస్టు చేసి వుండేవాణ్ణి. కాని, ఛాయ హత్యపై పోస్ట్ మార్టమ్‌లో లభించే సమాచారం కోసం ఆగాను. అది చూశాక రెండు హత్యలూ నువ్వే చేసినట్టు నిర్ధారణ అయింది. మొదట్నించీ నువు చేసిన తప్పులే నాకు నీపై అనుమానాన్ని రప్పించాయి అలోసేన్, ప్రశాంత్ ధర్‌లని హత్య చేశాక నువు మంచి వాసనిచ్చే సబ్బుతో చేతులు కడుక్కొని శుభ్రంగా ఇస్త్రీ చేసిన బట్టలు ధరించావు. ఛాయ హత్య తర్వాత కూడా నువ్వు అదే విధంగా చేశావు.

అలోసేన్ హత్య జరిగిన నాటి పొద్దున్నే విశ్వజిత్ మామూలుగా నలిగిన దుస్తుల్లో వుండగా, నువు అప్పుడే స్నానంచేసి ఇస్త్రీ బట్టల్ని ధరించి వున్నావు. ఛాయ హత్య తర్వాత కూడా నువ్వు అలాగే కొత్తబట్టల్లో కన్పించావు. ఛాయను హత్యచేసి, వెనుక తలుపు గుండా జారుకుని, నీ గదికెళ్లి బట్టలు మార్చుకుని, అపుడే నిద్రనుంచి లేచినట్టు నన్ను నమ్మించడానికి కళ్లు నులుము కుంటూ వచ్చావు. పోస్టుమార్టమ్‌లో ఛాయ రెండు నెలల గర్భవతని తేలింది. ఇప్పుడు చెప్పు. నా మాట నిజమా? అబద్ధమా?"

మనోజిత్ వణికిపోతూ తన నేరాన్ని ఒప్పుకున్నాడు. హత్యల వెనుక గల కారణాల్ని ఆ తర్వాత వివరించాడు.

"ఎనిమిది నెలల క్రితం నేపాల్ నుంచి వచ్చిన జాక్సన్ ఎర్నెస్ట్ అనే విదేశీ యుడితో నాకు పరిచయమైంది. అతను

బూతు చిత్రాలు, నల్లమందుల వ్యాపారం ఒస్తుంటాడు. నన్నూ తన వ్యాపారంలో కలవమని ప్రోత్సహించసాగాడు. నేను మొదట నిరాకరించినా అతనా వ్యాపారాల వల్ల వచ్చే భోగాల గురించి గొప్పగా చెప్పడంతో ఆఖరికి ఒప్పుకున్నాను. బూతు చిత్రాల్లో నాతో నటించేందుకు ఓ యువతి అవసరమైంది.

నా కళ్ళు మా పనిమనిషి ఛాయపై పడ్డాయి. పెళ్ళి చేసుకుంటానని ఆమెకు వాగ్దానం చేసి నాపట్ల అనుకూలంగా మార్చుకున్నాను. ఆమెను కలకత్తాలో జాక్సన్ నివసించే పార్క్‌స్ట్రీట్‌లోని ఓ ఇంటికి తీసుకెళ్ళేవాడిని. అక్కడ నేనామెతో సంభోగంలో పాల్గొంటుండగా జాక్సన్ రహస్యంగా దాన్ని సినిమాగా తీసేవాడు.

ఆవిధంగా మేమిద్దరం బూతు చిత్రాలు తయారుచేయసాగాం. జాక్సన్ నాకు డబ్బు బాగా ముట్టజెప్పేవాడు. అలా జరుగుతుండగా ఓరోజు రాత్రి ఒక ఆకారం మా వదిన గదిలోకి వెళ్ళడం చూశాను. నేను బాగా గమనించి చూడగా అతను ప్రశాంత్ అని తెల్సింది. మా వదిన, ప్రశాంత్‌ల మధ్య అక్రమ సంబంధం ఏర్పడిందన్నమాట!

నాకిది ఆమెను బ్లాక్‌మెయిల్ చేసేందుకు ఓ మంచి అవకాశంగా తోచింది. ఈ సంగతి నాకు తెలిసినట్టు చెప్పి, అది బయటకు పొక్కి పరువు పోకుండా వుండాలంటే నాకు 20 వేలిమ్మని అడిగాను. మొదట్లో ఆమె కంగారుపడ్డా నా బెదిరింపుకి లొంగలేదు.

నేను మళ్ళీ బెదిరించాను. ఆమె నా మాటల్ని నవ్వుతూ కొట్టిపారేసి నా పరువు




తన గుప్పిట్లో వుందని చెప్పింది. ఆమె ఓ విదేశీయుడి సహకారంతో నేనూ, ఛాయ పాల్గొన్న బూతు చిత్రాల కాపీలు తీయించి తన దగ్గర వుంచుకుందిట! నాకు జాక్సన్ ఎర్నెస్ట్‌గా పరిచయమైంది ఆవిడ మిత్రుడే! వాళ్ళిద్దరూ కలిసి అతి తెలివిగా పన్నిన వలలో నేను చిక్కుకున్నానన్నమాట! ఆ విషయం ఆమె బయటపెట్టేసరికి నేను నిశ్చేష్టుణ్ని అయ్యాను.

తర్వాత ఆ కుట్రలో ప్రశాంత్ కూడా భాగస్థుడే అని తెలిసింది. విశ్వజిత్‌కి ఇదేమీ తెలియదు. దీనిలోంచి బయటపడేందుకు నేను ఛాయకి అంతా చెప్పి, ఆమె సాయం కోరాను. నేను తనని పెళ్లి చేసుకుంటానని నమ్ముతున్న ఆమె నాకు సహకరించేందుకు ఒప్పుకుంది.

అలోసేన్ ఆ బూతు చిత్రాలన్నింటినీ కలకత్తాలోని అలహాబాదు బేంకు లాకరులో భద్రపరిచి వుంచిందట! లాకరు తాళంచెవి ప్రశాంత్ గదిలోని అలమరలో వుంది. అందులోనే హౌరాలో స్థలం కొనేందుకు బేంకులోంచి తీసిన నగదు కూడా వుంది.

నేను రెండు కత్తులు కొని హత్యకు పథకం సిద్ధం చేశాను. ఆరోజు రాత్రి 1.45కి ఛాయ నా గది కొచ్చింది. మేము ముందు ప్రశాంత్‌ని చంపాలనుకున్నాము. ఇద్దరం అతని గది వైపు వెళ్ళేటప్పటికి అతను అలోసేన్ దగ్గరికి వెళుతూ కన్పించాడు. దాంతో నేను వాళ్ళిద్దరినీ ఒకేసారి అంతమొందించాలనే నిర్ణయానికి వచ్చాను.

కాసేపటికి ఛాయ, నేనూ అలోసేన్ గదిలో ప్రవేశించాము. మంచంపై ఆమె, ప్రశాంత్ నగ్నంగా వున్నారు. ఒకే క్షణంలో నా దగ్గిరున్న కత్తి ప్రశాంత్ కడుపులోనూ, ఛాయ చేతిలోని కత్తి

అలోసేన్ కడుపులోనూ దిగబడి వారి ప్రాణాలను హరించాయి.

హత్య చేసిన వెంటనే నేను ప్రశాంత్ గదిలోకి వెళ్ళి అరమరలోంచి లాకరు తాళంచెవి, రెండు లక్షల రూపాయలు తీసుకున్నాను. హేంగర్లకివున్న బట్టలన్నీ తీసి సూట్ కేస్‌లో వుంచి కారు డిక్కీలో పెట్టాను. ప్రశాంత్ శవాన్ని కారు వెనుక సీటులోకి చేర్చాను. కారులో అతను మూలగడం చూసి మళ్ళీ మళ్ళీ పొడిచి చంపాను.

తర్వాత సబ్బుతో చేతులు శుభ్రంగా కడుక్కుని, బట్టలు మార్చుకుని, కారులో బొంబాయి హైవేలో చాలాదూరం వెళ్ళి ప్రశాంత్ శవాన్ని ఓ నిర్జనప్రదేశంలో పడేసి వచ్చాను. ఆవిధంగా అలోసేన్‌ను ప్రశాంత్ హత్యచేసి పరారీ అయినట్టు కేసును తప్పుదోవ పట్టించాను.

రెండు రోజుల తర్వాత ఛాయ తను గర్భవతి అయిన సంగతి చెప్పి వెంటనే పెళ్లి చేసుకుందామని పోరు మొదలెట్టింది. నేను ఆమెను కూడా నా దారిలోంచి తొలగించుకోవాలనినిశ్చయించుకున్నాను. ఆరోజు మామూలుగా ఆమె కోసం వెళ్ళినప్పుడు ఆమెను కత్తితో పొడిచి చంపేశాను" అని వివరించాడు అతను.

హత్యచేసి, సాక్ష్యాధారాలను నాశనం చేసినందుకు మనోజిత్ సేన్‌పైన కాశీపూర్ పోలీస్‌స్టేషన్‌లో కేసు రిజిస్టర్ చేశారు.

ఇప్పుడతను తీర్పుకోసం ఎదురుచూస్తూ ఆలీపూర్ సెంట్రల్ జైల్లో వున్నాడు!

— జాకీ

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావలసింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీజగత్తులో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విశేషాలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ
హైదరాబాద్ - 500004


Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

గ్లాక్సో కానుక

# తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం జిల్లనిపించే నారింజ రుచి గలది



**విటమిన్-సి తో పరిపుష్టమైనది**

ఎక్కువ ధరైన పంచదార కలపనవసరం లేదు

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి, మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సి తో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.






GLL-1174 R

# గ్లూకోన్-సి

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/4

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం!



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



**మార్గదర్శి**

చిట్‌ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● ఆబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం